

కలువలు - కాంతలు

చిత్రకారుడు : వీరిశెట్టి అచ్యుతరావు-పుల్లేటికుర్రు.

## 17-6-59 సంచికనుంచీ కొత్త ఆకర్షణ



# కథ కాని కథ



## ఉత్తమ రచనకు రూ. 10 బహుమానం

ఒకసారి కొందరు స్టూడెంట్లు టిక్కెట్లు లేకుండా రైల్లో ప్రయాణం చేస్తున్నారు. మధ్యలో టికెట్ ఇన్స్పెక్టరు వాళ్లని పట్టుకున్నాడు. ఎక్సెస్ చెల్లించమని డబాయించాడు. స్టూడెంట్లు నెమ్మదిగా అతన్ని కబుర్లలోకి దించి మంచి చేసుకున్నారు. వాళ్ళ కబుర్లలో పడి టిక్కెట్లాయన తను వచ్చిన పని మరిచిపోయాడు. నవ్వుతూ, తుళ్ళుతూ వాళ్ళతో కాలక్షేపం చేశాడు. వాళ్ళ స్నేహం ఎంతదాకా పోయిందంటే, ప్రయాణం పూర్తయేసరికి టికెట్ ఇన్స్పెక్టరు ఖర్చుమీద స్టూడెంట్లు శుభ్రంగా రైల్లోకి భోజనం తెప్పించుకుని తిన్నారు, కిళ్ళీలు వేసుకుని సిగరెట్లు కాల్చేశారు.

ఇలాంటి గమత్తులు రోజూ ఎన్నో ఎందరికో జరుగుతూ ఉంటాయి తలుచుకుంటే మనకే నవ్వొస్తుంది. రమ్యంగా చెప్పగలిగిన వాళ్లైతే, ఇతరులకి చెప్పినప్పుడు ఇతరులకీ నవ్వొస్తుంది. కొందరికి మాటకిమాట అనే యటంలో మంచినేర్పు ఉంటుంది. దీన్ని రిపార్టీ అంటారు. వినేవాళ్ళకి నవ్వు, పడేవాళ్ళకి ఏడుపూ తెప్పించేవి కొన్ని, వినేవాళ్లకీ పడేవాళ్లకీ కూడా నవ్వు తెప్పించేవి కొన్ని ఇలా ఎన్నో రకాలైన రిపార్టీ లుంటాయి.

* * *

యుద్ధకాలంలో ఇద్దరు మిత్రులు చెన్నపట్నం బీచిలో కూర్చుని గాలిమేస్తూ, కబుర్లు తింటున్నారు. ఇంతలో ఒకాయనికి కబుర్లు మొహమొత్తి సుండలు తినాలనిపించింది. సుండలంటే వేయించి, ఉప్పూ కారం తగిలించిన బటాణీలు. ఒక అణా సుండలు కొన్నాడు. నోట్లో వేసుకోబోతూ వాసనచూసి అడిగాడు:

"ఏమోయ్, ఇవి కిరసనాయిల్లో వేయించావా?" అని హేళనగా సుండలవాణ్ణి అడిగాడు.

వాడు తడుముకోకుండా "ఈ కరువు రోజుల్లో ఆ మాత్రం కిరసనాయిలు దొరికితే బ్లాక్ మార్కెట్ లో నే అమ్మేవాణ్ణి" అన్నాడు.

### ప్రేమరాయణంలో పిడకలవేట

ట్రాజిడీగా ప్రారంభమై కామెడీగా ముగిసే సంఘటనలూ, కామెడీగా మొదలై ట్రాజెడీగా ముగిసేవి కొన్నికూడా నిత్యజీవితంలో ఎదురుపడతాయి.

ఇద్దరు స్నేహితులుండేవారు. ఒకేరూములో ఉంటూ, ఒకేక్లాసు చదువుతూ ఉండేవారు. వాళ్ల అన్యోన్యం చెప్పటానికి వీల్లేనిది. ఒకర్ని విడిచి ఒకరు ఉండేవారు కాదు ఇలా ఉండగా ఎలావచ్చిందో ఇదరికీ తగాదా వచ్చింది. ఎందుకొచ్చిందో ఎవరికీ తెలీదు అప్పటిదాకా అవునంటే అవుననీ, కాదంటే కాదనీ అనుకునేవారు ఇప్పుడు ప్రతిచిన్న దానికీ అవునంటే కాదనీ కాదంటే అవుననీ దెబ్బలాడుకోటం మొదలుపెట్టారు. బహుశా ఇద్దరూ ఒకే అమ్మాయిని ప్రేమించారేమో లేక ఆ అమ్మాయివారిలో ఒకరిని కోరచూపులు చూసి, ఇంకొర్ని క్రీగంటిచూపులు చూసిందేమో. ఏమయితేనేం మునపటి సయోధ్య చెడింది

చెడిపోవటం అందరికంటే వారిద్దరికే ఎక్కువబాధగా ఉంది. జీవితంమీద, మనుషులమీద నిష్కారణంగా విరక్తిపుట్టింది. ఇదేం బాగా లేదనుకున్నారు. ఒకానొక చీకటి రాత్రివేళ వారికి మెరుపులాంటి ఆలోచన తట్టింది: జాయింటుగా ఆత్మహత్య చేసుకోవాలని. అయితే ఆత్మహత్యకి గల అనేక మార్గాల్లో ఏది మంచిదీ అని ఆలోచించారు. చాకో బ్లేడూ పుచ్చుకుని ఒకరి మెడ ఒకరు ఒకేసారి కోసుకుంటే? చావు తథ్యమే గాని అంత పథ్యమైనది కాదు. నెప్పికదా? అందుకని అది వద్దనుకున్నారు. నల్లమందు, నూనె తాగితే? గన్ పాటేగాని, ఎవరన్నా పసికట్టి ప్రాణాలు పోకముందే, తాగింది కాస్తా కక్కించేస్తే? అభాసవుతుంది. ఇలా ఎన్నో అపాయకరమైన ఉపాయాలు ఆలోచించి చివరికి ఒక నిశ్చయానికొచ్చారు. దగ్గర్లో నిక్షేపంలాంటి నది ఉండగా వేరే ఆలోచన దేనికీ? ఇద్దరూ నది ఒడ్డుకివెళ్ళారు. కొల్లాయిగుడ్డలు కట్టుకుని అంత అర్ధరాత్రి చలివేళ నదిలో దిగారు. బాగా లోపలికి, కంఠం లోతుకి వెళ్ళారు. వన్, టూ, త్రీ అనగానే ఒకేసారి మునగాలని ఒప్పందం. ఒకడు 'వన్' అన్నాడు రెండోవాడు 'టూ' అన్నాడు. వెంటనే అవతలతను 'త్రీ' అనకుండానే "ఆగు" అన్నాడు "ఏం" అన్నాడతను. "ఏం లేదు. నువ్వు త్రీ అనగానే నేను మునుగుతాననుకో. నువ్వు మునిగావో లేదో నాకెలా తెలుస్తుంది? మునిగినా వెంటనే లేచి హాయిగా ఇంటికెళ్ళిపోతావనుకో. నా గతేంకాను? నేను చచ్చినా మునగను," అన్నాడు.

"నన్నంటున్నావు గాని నువ్వుమాత్రం అలా చెయ్యవని నమ్మకమేమిటి? నేనే మునిగి, నువ్వే మానేస్తావేమో?" అన్నాడు రెండో అతను.

"అయితే ఇద్దరం మానేద్దాం".

"సరే. పద".

ఒడ్డెక్కివచ్చి బట్టలు తొడుక్కుని రూముకి వచ్చేశారు. మళ్లీ వాళ్ళు ఆత్మహత్యను గూర్చి నోరు తెరిస్తే ఒట్టు.

* * *

ఇలా నిత్యజీవితంలో జరిగే చిత్రమైన సంఘటనలు ఈ శీర్షికలో వారంవిడిచివారం ప్రచురించ దలచాము. ఎవరైనా పంపించవచ్చు. సంఘటన చమత్కారమైనది కావచ్చు. కరుణామయమైనది కావచ్చు. కేవలం 'మాటకుమాట'గా ఉండచ్చు. కాని నిజంగా జరిగినది, స్వానుభవంలోదీ అయివుండాలి. సాధ్యమైనంత క్లుప్తంగా ఉండాలి. వారపత్రికలో ఒక 'కాలమ్' మించగూడదు. ఎవరికీ పరువునష్టం కలిగించేదిగా ఉండగూడదు.

వచ్చినవాటిలో బాగున్నవని తోచినవాటిని ప్రచురిస్తాము. ప్రచురించినవాటిలో ఉత్తమమని నిర్ణయించిన దానికి 10 రూ. **బహుమతి** ఇస్తాము. కవరుమీదనే "కథకానికథ" శీర్షికకు అని స్పష్టంగా రాయాలి. అలా రాయనివి పోటీకి స్వీకరించబడవు. 17-6-59 తేదీ సంచికనుంచి ఈ పోటీ ప్రారంభమవుతుంది.

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

సంవత్సర చందా
రు. 13—0—0
విడిప్రతిక 25 న.పై

Founder: K. NAGESWARA RAO

వికారి వైశాఖ బహుళ ద్వాదశి బుధవారం

సంపుటము 53
సంచిక 35
3-6-59


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
నవశక్తి ఫిలింస్‌వారి "మాయింటి మహాలక్ష్మి"లో
గిరిజ, నూతన నటుడు హరనాథ్.


| | | |
|---|---|---|
| రాజధానికబుర్లు— | — | 3 |
| న్యూఢిల్లీలేఖ.—శ్రీ కృష్ణ | — | 5 |
| తిండికి తిమ్మరాజులు—కె. పార్థసారథి | — | 7 |
| అద్దంలో అందం—కలగర్ల వెంకటరాజు | — | 9 |
| ఆపద్బాంధవులు—కొమాండూరి | — | 11 |
| "చరిత్రహీనులు"—సాంబశివరావ్ బాబ్జీ | — | 13 |
| బంగారం; సింగారం—బాపు బొమ్మలకథ | — | 16 |
| అన్వేషణ—పోతుకూచి సాంబశివరావు | — | 18 |
| సంఘటన—మంజీర | — | 20 |
| శకునం—ఇందల లింగమూర్తి | — | 25 |
| ఆంధ్రమహాభారతం— | — | 26 |
| అత్తగారూ - జపానుయాత్ర—భానుమతీ రామకృష్ణ | — | 28 |
| నక్షత్ర ఫలితాలు— నరసింగరావు | — | 33 |
| వనితాలోకం—వకుళమాల | — | 35 |
| వనితావాణి— | — | 40 |
| కంచి మర్యాద—చల్లా రాధాకృష్ణమూర్తి | — | 44 |
| బాలలసంఘం— | — | 46 |
| సినిమా— | — | 49 |
| ఆరుద్ర గళ్లనుడికట్టు— | — | 55 |
| పుస్తకసమీక్ష— | — | 56 |






# రాజధాని కబుర్లు — ప్రవీణ్

## కుంభకర్ణుడి పునర్జన్మ

హైదరాబాదు నగర పాలక సంఘాన్ని ఒంటెతో పోలుస్తారు కొందరు. అది ఆరునెలలకొకసారి నీరు త్రాగుతుంది అంటారు జనం. ఇది ఆరునెలలకొకసారి ఒక కన్ను తెరచి, మూస్తుంది. దాని నడక అసహ్యంగా ఉంటుంది. దీని నడత అసహ్యంగా ఉంటుంది.

కొందరు మాత్రమే ఈవిధంగా పోలుస్తారు. మరికొందరు నగరపాలక సంఘం నిద్రపోడానికి కారణం ఒకటి చెబుతారు. ఆ కారణం వినండి.

రాముడి బాణంవల్ల మరణించిన కుంభకర్ణుడు, "రాముడు దేవుడు కదా! మరి నాకు జన్మలేదు" అనుకున్నాట్ట. అనుకొని రాముడితో అన్నాట్ట. దానికి రాముడు 'నువ్వు రాక్షసుడివి కనక నావల్ల చచ్చినా, నీకు పునర్జన్మ తప్పదు. నీకు నిద్ర జీవితావసరం కే బట్టి నువ్వు హైదరాబాదు నగర పాలక సంఘమై జన్మిస్తావని వరమిస్తున్నాను. ఇప్పుడెంత నిద్రపోతున్నావో, అప్పుడూ అంతేపోవచ్చు. మనుష్యులంటే ఇప్పుడు నీకెంత అసహ్యమో అప్పుడూ అంతే ప్రదర్శించవచ్చు' అన్నాట్ట.

కుంభకర్ణుడు చనిపోయి, హైదరాబాదు నగర పాలక సంఘమై జన్మించాడు— అంటారు ఈ "మరికొందరు".

* * *

గతవారంలో సికిందరాబాదు జిల్లా కాంగ్రెసు కార్యవర్గం సమావేశం జంటనగరాల సంలీనీకరణ పథకం వదులుకొమ్మని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది. సికిందరాబాదు హైదరాబాదు నగరాల మధ్య సరిహద్దు కాగితాలపైనే కాని మరెక్కడా కనపడదు. సికిందరాబాదు జనాభాని మినహాయిస్తే, ఆంధ్రప్రదేశ రాజధాని నగరం జనాభా సంఖ్య తగ్గి, మన రాజధానిని కేంద్రం ఖాతరుచేయని పరిస్థితి ఏర్పడింది. ఎన్నో విధాలుగా ప్రజలకు అసౌకర్యాలు కలుగుతున్నాయి. కాని సికిందరాబాదు 'నాయకులు' మాత్రం లీనీకరణ వద్దంటారు. వారు పైకిచెప్పే కారణాల విలువ మనకి తెలుసు. అసలు కారణాలేమిటో వారికే తెలియాలి.

అదలా ఉంచండి. సికిందరాబాదు నగర పాలక సంఘ సమావేశాల్లో సభ్యుల ప్రవర్తన ప్రసక్తి మనం తీసుకురావద్దు. అక్కడి అధికారుల అసమర్థతను సోదాహరణంగా మరోసారి పరిశీలిద్దాం. కాని హైదరాబాదు నగరపాలకసంఘం నిర్వహించబడే తీరు చూస్తే గుండెలు పగిలిపోతాయి.



శ్రీ ఎస్. విజయరంగం

హైదరాబాదు పోలీస్ కమిషనర్ పదవిలో వున్న వీరు సెంట్రల్ ఇంటెలిజెన్స్ బ్యూరో డిప్యూటీ డైరెక్టర్ గా నియమితులైనారు.

'నిర్వహణ' అంటే ఒక భావకవి నిర్వచించాడు "నిర్ + వహణ = ఏ బాధ్యతా వహించకపోవడం" అని. ఈ నిర్వచనం నిర్ — వచనమే. కాని హైదరాబాదు నగరపాలక సంఘం విషయంలో మాత్రం ఇది పూర్తిగా వర్తిస్తుంది.

నాసాల్ నగర కాంగ్రెసు సమావేశ సందర్భంలో నగరపాలక సంఘం కొన్ని మైళ్ళ రోడ్డుని వ్యవధి లేకుండానే సిమెంటు చేయించింది. గత అక్టోబరులో జరిగిన కాంగ్రెసు సమావేశానికి నగరంలోని "ట్రాఫిక్ ద్వీపా"లన్నీ హఠాత్తుగా చిన్న ఎత్తు ఉద్యానవనాలయ్యాయి. ఈ పనులు జరిపించడానికి ఎర్రటేపు నగరపాలక సంఘం సభ్యుల కాళ్ళకడ్డుపడదు. హోలీపండుగ సందర్భంగా నగరపాలక సంఘంవారి నీళ్ళ టాంకర్లు రంగు నీళ్ళతో బయలుదేరి శాసనసభ్యుల మంత్రుల వసతిగృహాల వెంట తిరిగాయి. ఇక్కడ కూడా టేపుపేర ప్రసిద్ధికెక్కిన ఎర్రతీగ కాళ్ళకడ్డుపడదు.

కాని ప్రజలకవసరమైన సదుపాయాలు చేయాలంటే నగరపాలక సంఘానికి నిద్ర ముంచుకొస్తుంది. చిక్కడ్‌పల్లికి నారాయణగూడాకి మధ్యవున్న వంతెన వెడల్పు చేయకపోవడంవల్ల ఏటేటా ప్రజలకి, ప్రభుత్వానికి లక్షలకొలది రూపాయలు నష్టం వస్తోంది. ఈ విషయం 'ఆంధ్రపత్రిక' ఇదివరలో కంఠమెత్తి చెప్పింది. అది మరోవారం ప్రస్తావిస్తాను. సుల్తాన్ బజార్ రోడ్డు అతి సన్నంగా ఉండడంవల్ల ఎన్నో ప్రమాదాలు కొద్దిలో తప్పిపోతున్నాయి. రెండు మూడు వారాల క్రిందట కోఠీవద్ద బస్సు క్రిందపడి మరణించాడు ఒక యువకుడు. ఇది మరోసారి చెబుతాను. జనరల్ పోస్టాఫీసునుంచి తిలక్ మెమోరియల్ హాలుకిపోయే రోడ్డును కాచిగూడా రోడ్డులో కలపాలని యత్నం విడాదిగా సాగుతోంది. ఇదికూడా మరోవారం ప్రస్తావిస్తాను. నగరం మధ్యలో పారే— కాదు! పారని— మురికినీటివల్ల ఉద్భవించే వ్యాధుల ప్రస్తావనకు ఒక వారం కేటాయిస్తాను. కోర్టుధిక్కార నేరంపై మాజీ కమీషనర్‌పై ఉన్నత న్యాయస్థానం జుల్మానా విధిస్తే, అది నగర పాలక సంఘమే చెల్లించుకోవాలనే స్టాండింగ్ కమిటీ చర్చ సంగతి కూడా ఇప్పుడు ప్రస్తావించను.

నగరపాలకసంఘం గుడ్డిగా నడుస్తున్న తీరునుగురించి రాయడానికి, వారం వార

# ★ రాజధాని కబుర్లు ★

రాసినా కొన్ని సంవత్సరాలు చాలవు. ఉదాహరణకి, చిక్కడ్‌పల్లిలో 'గూలాన్ రెస్టారెన్'కి ఎదురుగా ఉన్న ఖాళీస్థలంలో ఉన్న మురికినీటి చెరువు సంగతి చూడండి. అక్కడికి ఆ నీరు అలా చేరడానికి మునిసిపల్ ఇంజనీర్ల అనుమతి ఉందని ఎంతమందికి తెలుసు? ఆనీరు పోయే మార్గానికి అడ్డంగా గృహనిర్మాణానికి ఇంజనీర్లు అనుమతి ఇచ్చారని ఎంతమందికి తెలుసు? సమర్థుడుగా భావింపబడి, నగరపాలక సంఘ కమీషనర్‌గా నియమింపబడిన శ్రీ సి. ఎస్. శాస్త్రి, అనుభవజ్ఞుడిగా ఎంచబడి మేయర్‌గా ఎన్నుకోబడిన శ్రీ కృష్ణస్వామి ముదిరాజ్ ఆ దారివెంట ఎన్నోసార్లు పరిశీలనకు వచ్చి, ముక్కులో బాటు కళ్ళుమూసుకు వెళ్ళిపోయారని మనలో ఎంతమందికి తెలుసు?

ఇవన్నీ చెప్పాలంటే — మనకో వారం చాలదు. పరిశీలిద్దాం — వారం వారం వీలున్నంతవరకు. పరిశీలించడంవల్ల ప్రయోజనం కలదని కాదు. కుంభకర్ణుడు నిద్రిస్తున్నాడు కదా?

## ప్రభుత్వం 'చెయి'స్తుందిట

'నీట ముంచినా మీరే! పాల ముంచినా మీరే!' అన్నారు రాజధాని పౌరులు నగరంలో పాల సరఫరా వాళ్ళనుచూసి. 'సరే! నీరూ, పాలు కలిసిన మిశ్రమంలో మునిగి తేలండి. ఏం చేస్తాం?' అన్నారు పాలవాళ్లు సమాధానంగా!

నీళ్ళనే పాలనుకొని, కాఫీనీళ్ళు, మజ్జిగనీళ్ళు త్రాగి ఉంటున్నారు. రాజధానిలోని చిన్నలు, పెద్దలు ఇంతవరకు.

ఇప్పుడు ప్రభుత్వం ఒక పథకం తెచ్చింది. ఇరవైఐదు లక్షలు ఖర్చుపెట్టి, సహకార సంఘాలు స్థాపించి, పాలవాళ్ల పాలపడిన పౌరులను రక్షిస్తుందట ప్రభుత్వం. సహకార సంఘాలను సమీకరించేయడం వర్తమాన భారతంలో సులభ సాధ్యమైన పనికాదు. సమయానికి సంఘాలు సమీకరించకపోతే, ఈ డబ్బు మరోవిధంగా ఫైలుసులో పడిపోతే, ప్రభుత్వం తప్పులో కాలేసిందని చెప్పుకోవలసి వస్తుంది.

పండిట్ నెహ్రూ ప్రధాని పదవిలో ఉన్నప్పుడు, ఒక సహకారసంఘం స్థాపించి సమీకరించేయించాలని యత్నించారట. నిబంధనలన్నీ సరిగా నెరవేర్చినా, ఏణ్ణర్థం పట్టిందట సమీకరించేయించడానికి. అవినీతి ఆంధ్రప్రదేశ్ సహకారశాఖ ప్రధాన లక్ష్యా



శ్రీ పి. నారాయణస్వామి

హైదరాబాదు సిటీపోలీస్ ప్రత్యేకశాఖ డిప్యూటీ కమీషనర్‌గా పనిచేస్తున్న వీరు సెంట్రల్ ఇంటెలిజెన్స్ బ్యూరో అసిస్టెంట్ డైరెక్టర్‌గా నియమితులైనారు.

లలో ఒకటి. దాని ప్రధానలక్షణాలలో మరొకటి అసమర్థత. శాసనసభ్యులు ఈ ప్రసక్తి తెచ్చినప్పుడల్లా, సహకార శాఖామంత్రి అంటూంటారు శాసనసభలో! "సభ్యులు చాలా ఆరోపణలు చేశారు. వాటిలో సత్యం లేకపోలేదు. అంగీకరిస్తాను. సరిచేస్తాం. కాని చాలావరకు అతిశయోక్తులు. ఇది అన్యాయం" అని.

తమకు జరిగే అన్యాయాలను చూసి, శోకించుకొంటూంటారు రాజధాని పౌరులు. పాలవిషయంలో కోపాలు, తాపాలు పనిచేయవు. ఖ్యాతిలో పాలు పంచుకొని, ప్రభుత్వంపై వత్తిడి తేవాలి. అన్నీ సక్రమంగా జరిగితే, మూడవ ప్రణాళిక అంతానికి మనకి నీళ్ళులేని పాలు దొరకవచ్చు. అంతవరకు కాఫీనీళ్ళు, మజ్జిగనీళ్ళు త్రాగి తృప్తిపడదాం.

## విజయరంగం విశ్రాంతి

రక్షకభట శాఖాధికారులు ప్రజారంజకులు కావడం కష్టం. దొంగతనాలు లేకపోతే, 'వీళ్ళెందుకు?' అని ప్రశ్నిస్తుంది ప్రజ. దొంగతనాలు జరిగితే, 'వీళ్ళేం చేస్తున్నారు?' అని ప్రశ్నిస్తుంది.

గత రెండు సంవత్సరాలుగా నగర పోలీసు కమీషనర్ పదవి నిర్వహించిన శ్రీ ఎస్. విజయరంగం గత 14వ తేదీన పదవీ విరమణ చేశారు. వారు సెంట్రల్ ఇంటెలిజెన్స్ బ్యూరో(మద్రాసు)కి డిప్యూటీ డైరెక్టర్‌గా నియమితులయ్యారు. వారి స్థానంలో అనంతపురం డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌గా పని చేస్తున్న శ్రీ కళ్యాణరావు ఆరోజు నగర పోలీస్ కమీషనర్‌గా పదవీ స్వీకారం చేశారు. శ్రీ విజయరంగం క్రింద డిప్యూటీ కమీషనర్‌గా పని చేసిన శ్రీ నారాయణస్వామి కూడా సెంట్రల్ ఇంటెలిజెన్స్‌లో అసిస్టెంటు డైరెక్టర్‌గా నియమితులైనారు.

విజయరంగం కార్యనిర్వహణారంగం మారింది. ఈ రంగంలో వారి పాత్రపోషణ (వి) జయప్రదంగా ముగిసింది. వారి పదవీ నిర్వహణాకాలంలో పోలీసుశాఖ సమర్థతకి, ప్రజాదరణకి పేరు మోసింది. తమ కొత్త పదవిలో శ్రీ విజయరంగం తమ కీర్తి ప్రతిష్ఠలు ఇనుమడింపచేసుకుంటారని 'ఆంధ్ర సచిత్ర వార పత్రిక' ఆశిస్తున్నది.

డిప్యూటీ కమీషనర్‌గా పనిచేసిన శ్రీ ఆర్. నారాయణస్వామి నగర క్రీడారంగంలో ఎంతో శ్రద్ధ తీసుకున్నారు. శ్రీ స్వామి విశ్రాంతి క్రీడారంగానికి తీరని లోటు.

## అత్త సొమ్ము అల్లుడు....

అత్త సొమ్మును అల్లుడు దానం చేసే వ్యవసను జాతీయం చేయడంవల్ల ఆకాశవాణి కేంద్రాలు ఉద్భవించాయని ఒక ప్రబుద్ధుడన్నాడు. అత్తగారి సొమ్ము కాబట్టి అల్లుడు ఎలా ఖర్చుపెట్టినా ఫరవాలేదనుకుంటారు, ఆకాశవాణి మిత్రులు.

ఆకాశవాణి జాతీయ కార్యక్రమంలో భాగంగా ప్రజాస్వామ్యాన్ని గురించి కొన్ని కార్యక్రమాలను ప్రసారం చేసింది. ఈ కార్యక్రమాలను వినమంటూ జాబులు వ్రాసింది హైదరాబాదు కేంద్రం కొందరు శ్రోతలకి. లేఖలక్రింద సంతకం ఒక ఉద్యోగిది ఉంది. అక్కడ 'ఫర్ స్టేషన్ డైరెక్టర్' అని సంతకం చేశాడా ఉద్యోగి.

లేఖలో కార్యక్రమాలను గురించి కావలసినవి, అక్కరలేనివి ఎన్నో వివరాలున్నాయి. ఒకటే విషయం మరచిపోయారు పాపం. ప్రసారం ఎప్పుడు చేస్తున్నారో సమయం పేర్కొనలేదు. ఈగ ఇల్లలుకుతూ పేరు మరచి పోయిందట.

ఇంతకూ చెప్పవచ్చే విషయం: ఆకాశవాణి కేంద్రం శ్రోతలకు సవరణ పంపింది. ఆ సవరణలో ఈ సమయం ప్రస్తావన లేదు. కాని "సంతకం క్రింద 'ఫర్ స్టేషన్ డైరెక్టర్' అని చదువుకోండి" అని మాత్రం ఉంది.

ఖర్చు పెట్టడానికి అత్తగారి సొమ్మున్నంత కాలం—అల్లుడి సొమ్మేంపోయింది మధ్యలో? ఏమంటారు? ★



# న్యూఢిల్లీ లేఖ

# సహకార సేద్యంపై ప్రజల ఔదాసీన్యం

కాంగ్రెసు స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజుల్లో బ్రిటిష్ వారు అనేవారు: "ఏనుగు పోతుంటే కుక్కలు మొరుగుతా"యని.

భారతదేశం నుంచి బ్రిటిష్ పరిపాలనకు ఉద్వాసన చెప్పి 11 ఏళ్లయింది. కాని ప్రజాభిప్రాయం అంటే బ్రిటిష్‌వారికి వుండే చులకన భావానికి మటుకు ఉద్వాసన జరగలేదు. బ్రిటిష్ ప్రభుత్వం తరవాత అధికారంలోకి వచ్చిన ప్రభుత్వపు నాయకులకు ఈ చులకన భావం వారసత్వంలాగా సంక్రమించింది. దీనికి రెండు ఉదాహరణలు చెబితే సరిపోతుంది.

ఇటీవల ఇక్కడ మూడు రోజులుగా జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశాలను గూర్చి సంపాదకీయాలు రాస్తూ దాదాపు దేశంలోవున్న పత్రికలన్నీ సహకార సేద్యం గురించీ, దాని ప్రచారోద్యమం గురించీ వ్యాఖ్యానం చేశాయి. సహకార సంస్థలలో తరిఫీదు పొందటానికి ముందు కనీసం వందమందైనా వలంటీర్లు కావాలని, ఆతర్వాత వేలాదివలంటీర్లు కావలసివస్తారని కాంగ్రెసు ప్రకటించింది. కాని ఇప్పటిదాకా ఆగ్గురుమాత్రమే ముందుకు వచ్చారన్న సంగతి దాదాపు ప్రతి సంపాదకీయంలోనూ పత్రికలు రాశాయి. సహకార పద్ధతిమీద ఎవరికీ అంతభక్తి శ్రద్ధలు లేవనటానికి ఇంతకంటే ఏం నిదర్శనం కావాలి? అందుచేత ఇష్టంలేని రైతులమీద సహకార సంస్థల్ని రుద్దాలని కాంగ్రెసు ప్రయత్నించటం ఏంలాభం? ఈ ధోరణిలో పత్రికలు విమర్శిస్తున్నాయి.

1960 మార్చితో అంతమయ్యే ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో అమలు చేయటానికి అనువైన పథకాలు వెంటనే తయారుచేయవలసిందని సమాజవికాస, సహకార శాఖ రాష్ట్ర ప్రభుత్వాలకొక సర్క్యులర్ పంపించింది. రెండవ ప్రణాళిక ముగిసేలోగా 2 కోట్ల సభ్యులను చేర్చాలని వేసిన కొత్త పథకానికి ఇది మొదటిమెట్టు అన్నమాట. సహకార వ్యవసాయానికి చేయవలసిన ఆర్థిక సహాయవిషయం కేంద్ర ప్రభుత్వం ఆలోచిస్తోందని కూడా రాష్ట్ర ప్రభుత్వాలకు హామీ ఇచ్చారు.

ఇక ప్రభుత్వం నూనె గనుల త్రవ్వకం విషయమై అనుసరిస్తున్న విధానాన్ని — అందులో ఉండే సాధకబాధకాలు తెలిసినవాళ్లంతా విమర్శిస్తున్నారు. నేను పై వేటురంగాన్ని సమర్థిస్తున్నానని దీనర్థం కాదు. నిజంగా ఇప్పుడు జరుగుతున్నది చూస్తుంటే, ప్రభుత్వ రంగంలో పెట్రోలుకు సంబంధించినంత వరకూ సోవియెట్ పద్ధతులు నడుస్తున్నాయి. నూనె గనుల త్రవ్వకాన్ని కమ్యూనిస్టులైన రష్యన్లకీ, రుమేనియన్లకీ అప్పగించారు. ప్రభుత్వ రంగంలో నిర్మించే నూనెశుద్ధి కర్మాగారాల పనికూడా కమ్యూనిస్టులకే అప్పగించారు.

ట్రోజన్ యుద్ధంలో గ్రీకులు కర్రగుర్రం ద్వారా కోటలోకి జొరబడి ట్రోజన్లను ఓడించారు. ప్రభుత్వ రంగంలోకి కూడా ట్రోజన్ గుర్రం జొరబడుతోందనటానికి నిదర్శనంగా మూడు ఉక్కు కర్మాగారాల్ని చూడచ్చు. రష్యన్ల సహాయంతో నిర్మిస్తున్న భిలాయ్ కర్మాగారంలో ఒకటే చిన్న సమ్మె జరిగింది. కాని మిగతా రెండు కర్మాగారాల్లోనూ ఎన్ని సమ్మెలు జరిగాయో!

పెట్రోలు శాఖ చేసిందేమిటి? జ్వాలాముఖి, కాంబే వంటి కీలక ప్రదేశాలకు కమ్యూనిస్టులను యథేచ్ఛగా రానిచ్చింది. "చేసిన చెడు చేసినవాడు పోయిన తరవాత కూడా ఉంటుం"దంటారు. ప్రస్తుతం పెట్రోలు శాఖను నిర్వహిస్తున్న మహానుభావుల్ని లోకం విస్మరించవచ్చును గాని, వారు చేస్తున్న పనిఫలితాలను మాత్రం విస్మరించదు. అమాయకులు, అవిద్యావంతులు అయిన అస్సాం, జ్వాలాముఖి ప్రజలను మభ్యపెట్టి లోబరుచుకుంటున్న కమ్యూనిస్టుల చర్యల ఫలితాలు ఈ దేశంలో చిరకాలం నిలిచిపోతాయి.

ఈ విమర్శలకు ప్రధానమంత్రి ఇచ్చిన సమాధానమేమిటి?

మొదటి సమాధానం: భారత దేశానికి అసలే విదేశీ ద్రవ్యం కరువుగా ఉంటే, కమ్యూనిస్టులనుంచి యంత్ర పరికరాలను కొనటానికి పెట్రోలు శాఖకు విదేశీ ద్రవ్యం ఇచ్చారు.

రెండో సమాధానం: పెట్రోలు, నాచురల్ గ్యాస్ కమీషన్‌ను స్టాచూటరీ కమీషన్‌గా మారుస్తున్నామని, పెట్రోలియం పదార్థాలను అమ్మటానికి ఒక సంస్థను నెలకొల్పుతున్నామని ఆయన ఇటీవల పత్రికా విలేఖరుల సమావేశంలో ప్రకటించారు.

మూడో సమాధానం: పెట్రోలు శాఖ మంత్రికి కాబినెట్ మంత్రి హోదా ఇవ్వటం.

* * *

పేటుమారుతుంది గాని గ్రామఫోను మారదు.

భారత దేశపు నిరుద్యోగులను నిర్దాక్షిణ్యంగా తగ్గించారు. విదేశాలకు ప్రయాణాలను కూడా తగ్గించారు అయితే మంత్రులూ, ప్రభుత్వాధికారులూ హాయిగా విదేశీయాత్రలు

# న్యూఢిల్లీ లేఖ

సాగిస్తూనే ఉన్నారు. తాజా ఉదాహరణ:— భారత చైనా సంబంధాలు విషమించిన ఈ సమయంలో సంస్కృతి వ్యవహారాలశాఖ మంత్రి కమ్యూనిస్టు చైనా వెడుతున్నారు. ఈ శాఖ సంస్కృతికిచేసే దోహదమల్లా ఏమిటంటే ఎంతసేపూ కమ్యూనిస్టు దేశాలతో సంస్కృతి ఒప్పందాలు చేసుకోవటం. కాని న్యూఢిల్లీకి సంబంధించినంత వరకూ సంస్కృతి అనబడేదంతా ఒక క్రమంలోకర్లా ధ్వంసం చేయబడుతోంది. ప్రాచ్యదేశాల్లో అందమైన నగరం న్యూఢిల్లీ అని అనే వారిది వరకు. 1947 తరవాత, అందమంతా క్రమంగామాయమైపోతోంది.

* * *

కొత్తగా స్థాపించిన ఉత్పత్తి అభివృద్ధి మండలి విదేశీ యాత్రలను లలితకళగా పెంపొందించింది. ఉత్పత్తి పద్ధతులను పరిశీలించటానికి జపానువెళ్ళిన ఒక ప్రతినిధివర్గం సలహాల ఫలితంగా ఈ సంస్థ స్థాపించబడింది. ఇంకో ఏడు ప్రతినిధివర్గాలు విదేశాలకు వెళ్ళటానికి ఆయత్తమవుతున్నాయి. ఈ రకం విదేశవిద్యాభ్యాసానికి డబ్బిచ్చేది అమెరికన్లు. రెండో ప్రణాళిక ముగిసేనాటికి ఈ పద్దుకింద ఖర్చు 30 లక్షల డాలర్లు అవుతుంది. వేరే కొన్ని లక్షల భారతీయ ద్రవ్యం కూడా ఉత్పత్తి అభివృద్ధిమండలికి కేటాయించారు.

యంత్రసామగ్రి సహాయం, టెక్నికల్ తర్ఫీదు సహాయం, విదేశయాత్రలు—వీటివలన భారతదేశానికి కలిగిన యథార్థ ప్రయోజనం ఏమిటి అనే విషయాన్ని అంచనాల సంఘం నిష్పాక్షికంగా విచారణ చేయాలి అని కొందరి సూచన. ముఖ్యంగా: ఎన్ని సంఘాలు చైనా వెళ్ళాయి.? అవి సాధించినదేమిటి? అనేది తేల్చాలి.

నాయకుల ఉద్బోధనలవల్లా, ఉత్పత్తి మండలి స్థాపనలవల్లా నిజంగా ప్రయోజనమే ఉంటే భారతదేశంలో ఉత్పత్తి ఈ పాటికి ఇతర దేశాల ఉత్పత్తిని తలదన్ని ఉండాల్సింది. దేశభక్తికి ప్రత్యామ్నాయంలేనట్లే కష్టపడి పనిచెయ్యటానికికూడా ప్రత్యామ్నాయం లేదు. జపానులోనూ, పశ్చిమ జర్మనీలోనూ ఉత్పత్తి పద్ధతులెలా ఉన్నాయో పరిశీలించివచ్చి, వర్ణించి చెప్పినంతమాత్రాన మనదేశంలో ఉత్పత్తి పెరిగిపోతుందా? దేశప్రయోజనాలకంటే వర్గ ప్రయోజనాలే ముఖ్యమైనంతకాలమూ ఎన్ని ఉత్పత్తిమండలులైనా చేసేదేమీ లేదు. ప్రచారమైతే గట్టిగా జరిగిందిగాని ఈ మండలి స్థాపించిన మొదటి ఏడాదిలో సాధించినదేమీ లేనే లేదు.

(47-వ పేజీ చూడండి)

# తిండికి తిమ్మరాజులు

తెనుగు దేశంలో 'తిండికి తిమ్మరాజు-పనికి పోతురాజు' అనేది ఒక నానుడి. వీళ్లు తినడానికంటే సిద్ధం. పని అనేసరికి పలాయనం. దేశంలో ఇలాంటివాళ్లు ఎక్కువైతే కార్యసాధనా కాదు, పైపెచ్చు ఆహార సమస్య ఏర్పడుతుంది.

భారతదేశ సమస్యలలో ఆహార సమస్య ఒకటి. ఈ ఆహారసమస్యకి కొంతవరకు కారకులు ఈ తిండికితిమ్మరాజులే అంగుకే రాష్ట్రపతి, నెహ్రూ కలసి ఏకకంఠంతో “ఎక్కువ పండించండి. ఆహారధాన్యాలే కాదు. కాయధాన్యాలు, పండ్లూ, పాలూ గుడ్లూ కూడా తిని సమస్యని పరిష్కరించండి” అని ఘోషిస్తున్నారు.

ఈ తిండికి తిమ్మరాజుల్ని ఇంగ్లీషులో 'గ్లటన్స్' అంటారు. 'ఆస్ట్రిచ్' అనేది ఒక జాతి పక్షి దీన్నే తెలుగులో 'ఉష్ట్రపక్షి” అంటారు. ఇది తిననివస్తువంటూ ఉండదు. ఏది పడితే అది తినేస్తుంది. మేకులు, ఇనపముక్కలు, కర్రలు, పురుగులు కప్పలు. ఒకటేమిటి? కనపడ్డదల్లా పొట్టన పెట్టుకుంటుంది. రూపానికి కొంగలా పొడుగు మెడా, పొడుగు కాళ్లూ ఉంటాయి.

ఓ నియమం, నిష్ఠా, యిష్టం, అయిష్టం, వేళా, పాళా ఏమీ లేకుండా ఏది పడితే అది తినేసేవాళ్ళని ఇంగ్లీషులో 'ఒరేవస్ ఈటర్స్' అంటారు. వీళ్ళ నోటికి ఎప్పుడూ తాళం పడదు.

ఈ తిండిపోతులకి ఆచంద్రార్క తార్కాణము బకాసురుడు. కాని యీ బకాసురుడినే తలదన్నాడు భీముడు.

సరే 'బొజ్జ దేముడు' వినాయకుడిగురించి చెప్పక్కరలేదు. కుడుములు, ఉండ్రాళ్లు తిని బాగా పెద్దదైన ఆ బొజ్జని చూసేసరికి చంద్రుడికి నవ్వాగలేదు (దానికి ఫలితం కూడా అనుభవించాడు గా!)

మనలో ఈ(వి)నాయకులు కోటానకోట్లు వీళ్ళ స్థూలకాయాన్ని కాని, భారీ దేహాన్ని కాని, వినాయకుడిని తలదన్నే కడుపుని కాని చూసి మనం నవ్వామంటే, మనల్ని కొట్టినంతపని చేస్తారు. మన ప్రాంతాల్లో ఆడవాళ్లు 'నందికేశుడి నోము' అని ఓ నోము పడుతూ ఉంటారు. ఆ నోముకి ఒకే పిండి వంట చాలా చేస్తారు. (ఏదో కొంత కొల ఉంది లెండి). ఆ పిండివంట ఎంత వేసినా పారేయకూడదు. వండినది మిగిలిపోకూడదు. అందుకని ఈ నోముని సాధారణంగా పెళ్ళిళ్ళలోనూ, శుభకార్యాలలోనూ పడుతూ ఉంటారు. (వండినది చెల్లిపోయి, నోము అయిపోతుందని.) అంతబాధ పడక్కరలేదు. ఇలాంటి వినాయకులు ఓ పది, పదిహేను మంది కూర్చుంటే చాలు. వాళ్ళతో 'బాబూ! పారేయకూడదు. తినేయ్యాలి' అని చెప్పక్కరలేదు.

కొందరు నియమాలనీలకంఠయ్యలుంటారు. వీళ్ళు విస్తట్లో వేసినదల్లా పారేయకుండా తినేస్తారు (మిరపకాయలు, అవ

## కె. పార్థసారథి

కాయపెచ్చులు, ములక్కాడల పిప్పులు కూడా పారెయ్యరు). ఇంకొందరు భోజనాల దగ్గర మాట్లాడరు. చాలు అనరు. కావాలి అనరు. వేసినదల్లా తినేస్తారు ఇలాంటి నియమాలన్నీ తిండికి తిమ్మరాజులకి దేముడిచ్చిన వరాలు. పెళ్లిళ్లు, శుభకార్యాలూ అంటే ఇలాంటివాళ్ళంతా అక్కడ హాజరు. పెళ్లిళ్ళలో మొగపెళ్ళివారు కొందరు అదే పనిగా ఒకేఆధరువునో, పిండివంటనో తినడం ప్రారంభించి ఆడపెళ్ళివారిచేత 'ఇంక లేదు' అనిపించాలని పంతం పడతారు. ఒకాయన పెళ్ళిలో పంతంకొద్దీ మిఠాయి




“మామగారికి ముడుపు…”

ఉండలు ఎక్కువతింటే కడుపునొప్పి వచ్చిందట. బాధపడుతూంటే చుట్టూఉన్న వాళ్ళు కడుపునొప్పికి మందు వేసుకోమంటే 'ఆమాత్రం ఖాళీఉంటే మరో రెండు మిఠాయి ఉండలే తింటాను' అన్నాడట. 'ఆవగింజంత సందుంటే అరవై గారెలు అప్పుడే తిననా' అన్న మనిషితరహా ఈతడు.

కొందరు పొద్దున్నే లేచి మొహం కడుక్కున్నాక 'దేవాలయాన్ని' ప్రవేశించి, ఆత్మారాముడికి నైవేద్యం పిదప తాంబూలం సమర్పించుకొని, దీప, ధూపాలతో పెట్టికొస్తేనేగాని రోజు సరిగ్గా గడవదు. ఇప్పుడు ఎక్కడికెళ్లినా అడుగడుక్కీ కాఫీహోటలే—ఈ పోతురాజుల పాలిట కల్పవృక్షాలు.

నా మిత్రుడొకడు కాఫీ హోటలుని 'మామగారు' అంటాడు. రోజూ 'మామగార్ని' ఇంటికెళ్ళి దర్శించి ముడుపుకట్టి చెప్పకుంటేనేకాని అతడికేదో వెలితిగా ఉంటుందిట.

ఇక కాఫీసంగతి సరేసరి. రోజుకి ఎన్ని సార్లో? మొహంకడుక్కోకుండా ఒకసారి (బెడ్ కాఫీ) కడుక్కున్నాక ఒకసారి. వీధిలోకి వెళ్ళేటప్పుడు ఒకసారి. వీధిలోకి వెళ్ళాక కనీసం రెండుసార్లు. మళ్ళీ సాయంకాలను ఇంట్లోఒకసారి. వీధిలో రెండు సార్లు. మొత్తం రోజులో అధమం ఆరు, ఏడుసార్లు తాగుతారు ఈ కాఫీత్రాగుబోతులు.

సరే ఉపవాసాలు, వారాల సంగతికి వద్దాం.

'నాకీవేళ ఆదివారం', 'నాకీవేళ శనివారం', 'నాకీవేళ అమావాస్య' అంటారు. ఇంట్లో రాత్రి, అధమం మూడు మినప రొట్టెలో, పది పదిహేను పూరీలో లాగించేస్తారు—ఉపోషం పేరు చెప్పకొని. ఆ ఉపోషం ఎందుకు? ఈ కడుపుమొయ్య తినడం ఎందుకు? ఫలహారం అనడం—బలహారం చేయడం.

అసలు కొందరు అ సమానూ అన్నం తినడంఏమిటి? ఏరొట్టో, ఏ పూరీలో తిందామని వారాలుపడతారు. వారాలుండి ఒక్కొక్కళ్లు కేరున్నర పచ్చి వేరుశనగకాయలు వేయించుకు తిన్నవాళ్ళని నేనెరుగుదును.

వితంతువులు—ఉపోషాలు—మినప

# ★ తిండికి తిమ్మరాజులు ★

రొట్టెలు గురించి అంతబాగా పరిశీలించే 'మహాకవి గిరీశం' వ్రాసిన 'విడో' మీద ఇంగ్లీషు పద్యాలు చూసి 'టెన్నిసన్ గుండె కొట్టుకున్నాడు.' ఈ వారాలుండి కొందరు చాటుగుండా హోటలుకెళ్ళి మసాలాదోసె, ఉల్లి పెసరట్టు కొట్టేస్తారు. ఓ ఉల్లిదోసె, ఓ ప్లేటు యిడ్లీ పుచ్చుకొంటేనే కాని రోజులో తమ కార్యక్రమం మొదలెట్టరు— మంత్రాలుచదివే నేటి బ్రాహ్మలు.

ఎంత పెద్దవాళ్లైనా రోజుకి మూడుసార్లు తినేవాళ్ళు మనకింకా కనపడతారు. మొన్న మొన్నటివరకూ మా అమ్మమ్మ నన్నూ తినమనేది. 'తినాలిరా నాయనా! తినకపోతే ఎప్పటికి పెద్దవాడవుతావు' అంటూ అక్కర లేకపోయినా వడ్డిస్తుంది ఇప్పటికీ మా అమ్మమ్మ. చిన్న పిల్లలికి వాళ్ళు అడిగినప్పుడల్లానో, ఏడ్చినపుడల్లానో ఏదిపడితే అది పెడితే అజీర్తి చేస్తుంది. కొందరికి కడుపులో బల్ల పెరుగుతుంది. పెద్దయితే వాళ్లు చిల్లర డబ్బులు దొంగిలించి చిరుతిళ్ళు కూడా తింటారు.

నా స్నేహితుడు తన చదువు ఇంకో రెండేళ్ళలో పూర్తి చేస్తాడనగా, ఇంట్లో అస్తమానూ తినే అన్నం, కూరలు, పచ్చళ్లు అంటే విసుగేసి 'నాకు ఉద్యోగం అయ్యాక చూడు. రాత్రిళ్ళు భోజనం మానేస్తాను. రస్కులు, బ్రెడ్, బాదంపప్పు, ఆపిల్ పళ్లు, బత్తాయి, నారింజపళ్ళు ద్రాక్షపళ్ళే తింటాను. కాల్చిన రొట్టెకి వెన్నరాసుకు తింటే ఎంతమజాగా ఉంటుంది. మనవాళ్లకి తిండి తెలియదోయ్. నేను హాయిగా ఇలా తిండి తినడానికే పెళ్ళి చేసుకోను. లేకపోతే దానికి ఇవన్నీ పెట్టాలి' అని ఎప్పుడూ వల్లించేవాడు. మరిప్పుడేం చేస్తున్నాడో తెలియదు.

కన్యాశుల్కంలో గిరీశం, వెంకటేశంతో అంటాడు.

"నాదగ్గర కరెన్సీనోట్లు ఉన్నాయిగాని మార్చలేదు. పదణాలు పెట్టి ఒశేరు కాశీ మిఠాయి పట్టుకొని రా. రాత్రికి మరి నేను భోజనం చెయ్యను."

దేశభక్తి గేయంలో గురజాడ 'తిండి కలిగితె కండకలదోయి కండకలవాడేను మనిషోయ్' అన్నారు. అందుకనే మేమంతా



నియమాల నీలకంఠయ్య

ఇలా తింటున్నామంటారు వీళ్లు,
కాని "కండ కలిగితె తిండికలదోయ్"

'కక్కాడితేనేగాని డొక్క ఆడదు' అనే విషయాల్ని మరచిపోతున్నారు వీళ్లు. కొందరికి 'ఆశ లావు పీక సన్నము.'— తినాలని ఆశ, తినడం చేతగాదు. కొందరు 'దంచినమ్మకి బొక్కిందే కూలి' రకం. ఏదో పిండి కలుపుతూనో, వంట వండుతూనో ఇంత నోట్లోవేసుకు చూస్తారు. రుచికోసం అని చెప్పి వండిన కూరంతా కానిచ్చేసినకథ మన కందరికీ తెలిసినదే.

సరే! అంతా తిండిపోతుల గురించేనా, కొంత ఇవతలవాళ్ళగురించికూడా చెప్పొద్దూ. కొందరు "మింగడానికి మెతుకులేదు. మీసాలకి సంపెంగనూనె" అన్న తరహా. తింటానికి డబ్బులుండవు—వారానికి మూడు సినీమాలు తప్పకుండా చూస్తారు. అదేం కడుపు నిండాలా? కాలునిండాలా 'బ్రతికుంటే బలుసాకు తినొచ్చు. కాని ముందు సినీమా చూడకపోతే ఛస్తాము' అంటారు ఈరకం.

కొందరు ఇంట్లో మూతికి మెతుకులు రాసుకొని పైకొచ్చి 'అది తిన్నాము. ఇది తిన్నాం' అని డాబులు చెప్తారు. అంతా భేషజం. దీనికో చిన్నకథుంది.

ఇద్దరు మిత్రులున్నారు. ఇద్దరూ ఒకళ్లని మించినవాళ్లు ఇంకొకళ్లు. మొదటివాడు రొట్టె తింటూ రెండవవాడితో 'చూశావా నేను ఎంత గొప్పవాడినో! నేతిగిన్నె పక్కనుంచుకొని, రొట్టెముక్క అందులోముంచుకొన్నట్టుగా నటిస్తూ తింటున్నాను' అన్నాడు.

రెండవవాడు 'ఓస్! నువ్వు ఇంతేనా, నేను మాయింట్లో నేతికారేజీ గోడకి తగిలించి, పీటమీద కూర్చుని తింటూన్న రొట్టె ముక్క కారేజీవైపు చూపించి, అద్దుకున్నట్టుగా భావించి తినేస్తాను' అని గుక్క తిప్పుకోకుండా అన్నాడట.

మా చుట్టాలలో ఒక అమ్మాయున్నంగా, పొడుగ్గా ఉంటుంది. కాని ఆ అమ్మాయి అక్షరాలు మాత్రం పొట్టిగా, బొద్దుగా, ముద్దుగా ఉంటాయి. మా మామయ్య ఒకసారి జోక్ అనుకొని 'ఏం సుశీ! నువ్వుతినే అన్నం అంతా నీ అక్షరాలకే పెడుతూన్నట్టున్నావు?" అన్నాడు.

అమెన్యా యూనివర్సిటీలో ఒకవ్యక్తిని చూశాను. మధ్యాహ్నం విరామసమయంలో భోంచేశాడు. ప్రక్కనేవున్న కాంటీన్ లోకి వెళ్ళాడు. ఒకదోసె, ఒక ప్లేటు పూరీ, ఒక ప్లేటు పకోడీ, ఒక కాఫీ పుచ్చుకున్నాడు. అది చూడగానే, నేను అలా నిశ్చేష్టుడనై ఉండిపోయాను. నా గొంతుకలోంచి 'అపర బకాసురుడు' అని చిన్నగా రాబోయింది. దాన్ని నా పెదిమలు గొంతుకలోనే ఆపేశాయి.

ప్రస్తుత యుగంలో బకాసురుణ్ణి జ్ఞప్తికి తెచ్చే తిండి తినగలవాడు—'కింగ్ కాంగ్' అని అమెన్యా ఎక్కడో చదివితే అనిపించింది ఈ తిమ్మరాజుల రాజ్యానికి 'కింగ్ కాంగ్' కింగ్ —రాజులకి రాజు రారాజు. ఈ రాజులకి, తిమ్మరాజులకి, తతిమ్మా రాజులకీ అందరికీ జై! ★

# అద్దంలో అందం

కలగర్ల వెంకటరాజు

"ప్రతి ఒక్కరూ, ఎందుకలా చూస్తారు నా వేపు? నాలో ఏముంది? ఏమిటీ వింత? నాలా ఎవరూ లేరా? అంతా నా వేపు అవిధంగా చూస్తుంటే నేను నిజంగా చాలా అందంగా ఉన్నానన్నమాటా!

నేనంత అందంగా వున్నానా! ఏమో! నాకెలా తెలుస్తుంది?

మరి నేనంత ఆకర్షవంతంగా ఉండటానికి కారణం? ముక్కా, చెవులా, కురులా, చెక్కిళ్ళా, కన్నులా?

కాదు ముక్కు ఎంతమాత్రము కాదు, పొడుగ్గా—కోనసూదిగా—

మరి చెవులా? చెవులు కాదు. కురులా? ఏమో! నా కురులన్నీ చేర్చి అల్లితే ఎంతో చక్కని జడ అవుతుంది.

చెక్కిళ్ళా! లేమావిచిగుళ్ళవలె, గోధుమఛాయలో అద్భుతంగా కనబడుతున్నవి. మరి కనులా! చెప్పనక్కర్లేదు. నల్లగా తుమ్మెద జంటలా...

అయితే కళ్లలో ఏదో ఆకర్షణశక్తి వున్నది. పెద్దవిగా, గుండ్రంగా, చక్రాలులాగున్నాయి. సన్నటి కాటుక తీర్పు కళ్లకు వింత అందం కలుగజేస్తున్నది."

* * *

ఆమెలో ఒక చైతన్యం కలిగింది. రోజూ నిలువుటద్దంముందు కూర్చుని, ఆమె తను ఎంత అందంగా ఉన్నదీ పరిశీలించుకుంటుంది.

సంబంధాలు వస్తున్నాయి. అంతా వస్తున్నారు, చూచి వెడుతున్నారు. కాని ఎందుచేతనో ఒక్క సంబంధమూ నిశ్చయం కావడంలేదు. ఆమెకు అనుమానం కలిగింది. ఏమిటి, తను అంత అందంగా లేదా?

ఈసారి ఆమె కళ్లు ఎత్తి చూసింది, కాబోయే పెళ్ళికుమారుని ముఖంలోకి ఆమె కళ్లు జ్యోతుల్లా ప్రకాశించాయి. పెళ్ళి కుమారుని ముఖంలో తృప్తి మెరిసింది. పిల్ల నచ్చిందన్నారు వచ్చినవారు. అన్నీ సవ్యంగా కొద్ది రోజుల వ్యవధిలో జరిగిపోయాయి. ఆమె అత్తవారింటికి వెళ్ళింది.

అత్తవారింటికి వచ్చినది మొదలు ఆమె తన విషయమై మునుపటలాగే శ్రద్ధవహిస్తూ వచ్చింది. సౌందర్య పోషణకు, పుట్టినింటినుంచి తెచ్చుకొన్న టాయిలెట్ సామాన్లు పూర్తిగా అయిపోయాయి. ఒకనాడు, ఆఫీసుకు పోతున్న భర్తతో ఆమె అంది:

"ఏమండీ! ఒకమాట."

ఇది స్త్రీ సహజమైన మాటే ననుకొని,

"ఏమి"టని అతను వెనుదిరిగి ఆప్యాయంగా ఆమెవేపు చూశాడు.

"సాయంకాలం ఇంటికి వచ్చేటప్పుడు ఒక పౌడరు డబ్బా తెస్తారా?"

"ఓస్! ఇంతేనా—అలాగే తెస్తాలే," అని అడుగు ముందుకు వేశాడు. ఆమెకు కొంచెం ధైర్యం కలిగింది.

"ఒక స్నో సీసాకూడా—నేను తెచ్చుకున్నది అయిపోయింది," అని మెల్లగా నసిగింది.

"అలాగే లే" అని అతను ముందుకు సాగిపోయాడు. ఆ సాయంకాలం ఆమె కోర్కె నెరవేరింది.

పనులన్నీ చేసుకొని, గదిలో నిలువుటద్దం ముందు నిలబడింది. ఆ అద్దం అంటే ఆమెకు ఎంతో సరదా. తనగదిలో చేర్చబడిన సామానుల్లో ఇదొకటి. ఆ ఇంటికి ఆ అద్దమూ, ఆమె ఒకేసారి వచ్చినట్లు ఆమె మొదట్లో విన్నది. తన ప్రతిబింబం ఆ అద్దంలో చక్కగా కనుపిస్తుంది. అందుకే కాబోలు ఆమెకు ఆ అద్దమంటే అంతయిష్టం.

* * *

"ఏమండీ! మీరు ఎంతకు కొన్నారండి ఈ అద్దం?" అని అతన్ని అడిగింది.

"ఏం! అంతబాగుందా? మన పెళ్ళి ముందు కొన్నా. నీకోసమే!" తన కోసమా! ఆమె ఎంతో మురిసిపోయింది. రోజుకి రెండుసార్లయినా అద్దాన్ని గుడ్డతో తుడిచేది. తుడిచినంతసేపూ తన ప్రతిబింబమును చూస్తూ మురిసిపోయేది.

చేతనయినంతవరకు ఆ రాత్రి చక్కగా ముస్తాబయింది. ఇరుగు పొరుగువారు, చూడ వచ్చినవారు, అంతా ఆమె సలక్షణంగా వుందని అనడం వింది. కాని ఒక్కనాడూ భర్త ఆ మాట అనలేదు. తను అందంగా వున్నానని భర్తచేత అనిపించుకోవాలని వుంది అంతా లోకులపొగడ్తలేనా! తన భర్తకు తనంత అందంగా లేనేమో! ఇటువంటి అలంకరణలు అతనికి ఇష్టము లేదేమో! అతనికి ఎప్పుడూ ఇంటిపని, ఆఫీసుపని అంతే.

అడుగులో అడుగువేసుకొంటూ మెల్లగా భర్తను చేరింది. నిద్రపోయి చాలాసేపయిందేమో, తట్టి లేపింది. నిద్రాభారంతో కళ్ళెత్తి చూశాడు. మళ్ళీ నిద్రాదేవి ఒడిలో వాలిపోయేడు

"ఏమండీ! అప్పుడే నిద్రా?"

జవాబు లేదు—

"ఏమండీ, మిమ్మల్నే"

"ఊ" అని ఇటు ఒత్తిగిల్లాడు.

"అంత నిద్రేమిటండి? ఊరు సాగుపోండే.

"అవును నీకలాగే వుంటుంది" విరాసుగా అన్నాడు. మూసిన కళ్ళు విప్పలేదు. ఆమెకు ఆశాభంగమయింది. ఆరాత్రి కలత నిద్రలో ఏమేమో పలవరించింది.

ఆరోజు పనిలో పొరపాటు జరిగింది. "అదేమిటే, అత్తింటి కోడలవు. అలా చేయవచ్చా?" అన్నారు అత్తగారు. సమాధానంగా, అత్తగారి కళ్ళల్లోకి కోపంగా చూసింది. "ఇదొకటి నేర్చుకొన్నావు; కొట్టవచ్చేలా గుడ్లెక్క పెట్టుకొని చూస్తావేం?" అంది అత్తగారు.

ఆమె అవమానంతో క్రుంగిపోయింది. కండ్లు మూసుకొని అద్దం ముందు వచ్చి చతికిలబడింది. నిజంగా తన గుడ్లు ఎక్కి వచ్చాయి. కళ్ళు విప్పి చూచుకుంది. 'కళ్ళే ముఖానికి అందం' అని అనుకుంది.

* * *

"ఏమండీ! వచ్చినప్పటికన్న మా కోడలు చాల చిక్కి చిక్కిపోయింది. కారణం ఏమిటి?" అని ఇరుగు,పొరుగు అమ్మలక్కలు అడిన మాటలు చాటుగావుండి వింది అవును తను చాలా చిక్కిపోయింది. నునుపైనపాల బుగ్గలు ఇప్పుడు పాలిపోయాయి కళ్ళు లోతుగా పీక్కుపోయాయి. తనపై తాను శ్రద్ధతీసుకోవడం మానేసింది.

భర్తను తప్పించుకుని తిరగడం మొదలెట్టింది. గదిలో నిలువుటద్దంపై గుడ్డ కప్పింది ఇక ఆ అద్దం ఉండడం యిష్టం లేక, ఒకనాడు—"ఏమండి ఈ అద్దం ఈగదిలోంచి తీసివేస్తే?" అంది.

"ఏం!" అని అమాయకంగా అడిగాడు అతను.

"అబ్బే అది అక్కడ ఉండడం బాగులేదు. మరో గదిలోకి మార్చిస్తే?"

"ఇంకా ఎక్కడ పెట్టడం? ఎక్కడా బాగా లేందే! ఇంతకీ అది నిన్నేం చేసిందని?

ఆమె మాట్లాడలేదు.

ఆవేళ అతను ఆఫీసునుంచి పెందరాళే వచ్చాడు. చాల హుషారుగా ఉన్నాడు. ఆమెను ప్రేమగా దగ్గరకు తీసుకున్నాడు. ఆమె బెట్టుగా దగ్గరకెళ్ళింది. "ఇవాళ సినీమాకు వెళదాం వస్తావా!" అన్నాడు.

ఆమె జవాబు చెప్పలేదు. కొంచెం దూరంగా తొలగిపోయింది. "చూడు టైము అవుతూంది. తొందరగా తెములు" అంటూ పెరట్లోకి దారితీశాడు. శూన్యంలోకి చూస్తూ, ఆమె అలా అక్కడే నిలుచుండి పోయింది, అతను తిరిగి వచ్చేవరకు.

"ఇంకా తెములలేదా!" అన్నాడు.

"నేను రాను మీరొక్కరే వెళ్ళండి," అంది.

"ఛా! అదేమిటి ఇద్దరంకలసి వెళ్దాం."

"ఊహూ!" అంది ఆమె మురిపెంగా.

"వంట్లో బాగులేదా? అవును అమ్మ చెప్పింది యీ మధ్య నీ వంట్లో బాగులేదని. చాలా చిక్కిపోయావు. సరేలే తర్వాత ఆలోచిద్దాం. టైముఅవుతూంది. నీవురావన్నమాటేనా వెళ్తున్నా."

# అద్దంలో అందం

ఆమెలో తుఫాను చెలరేగింది. "నా అతీగతీ ఇన్నాళ్ళకు కావలిసివచ్చింది కాబోలు. నే చిక్కిపోయానని—కాదు, నా అందంలో మార్పువచ్చిందని— అదీ అమ్మ చెప్పగా తెలిసిందిగాబోలు" అనుకుంది బాధగా.

రోజులు గడుస్తున్నకొద్దీ ఆమె బాధ ఇనుమడించింది, కాని అతనిలో చలనం లేదు. దీనికితోడు గదిలో నిలువుటద్దం ఒకటి. ఆ అద్దం గర్భశత్రువై పట్టుంది ఆమెకు.

ఎగురుగా ఉన్న టేబిలుపై చిన్న అద్దంలో ఆమె ప్రతిబింబం కనిపించింది. అద్దం తీసుకుంది చేతులోకి. చేయిజారి అది క్రింద పడింది. ముక్కలన్నీ ప్రోగుచేసి, దానిలోకి చూసింది. "ఎందుకలా బాధపడిపోతున్నావు" అని ప్రతిబింబం ఎదురుచెప్పింది.

"నావల్ల ఏమైనా పొరపాటు జరిగిందా? లేదే. మరి?—వారివలన తప్పుందనా?— ఊహూ!—ఆయనకంటె అందంగా ఉన్నాననికదూ? అందరు నన్ను అందంగా ఉన్నానన్నారు. అందుకేగదా ఇంతగర్వం. నాకంటె ఎంతమంది లోకంలో లేరు అందగత్తెలు? ఇంతకీ ఆయన ఎంతచక్కగా ఉన్నారో చూశానా? లేదు! కాదు నేను నా బాహ్యసౌందర్యంలో మునిగిపోయేను. ఆయనకి యివి యిష్టంలేదుగాబోలు. నా అందాన్ని మెచ్చుకోలేదు నిజమే. కాని ఆయనకు కావలసిందేమిటి? అందరు భర్తలలాగా ఆయన బాహ్యరూపానికి అంతవిలువ ఇవ్వరుగాబోలు. శాశ్వతమైన అందాన్ని చేకూర్చే ఆత్మసౌందర్యాన్ని కాపాడుకోవాలి. అదే చిరస్థాయిగా ఉంటుంది. మనోవికాసం పొందాలి. ఇప్పటికైనా తెలుసుకోవడం మంచిదైంది."

"అద్దం ముక్కలన్నీ చెదిరిపోయాయి. ఆమె ప్రతిబింబంకూడా మాయమైంది.

"అరె అద్దం బద్దలయిపోయిందే! ఎలా పోయింది" అంటూ అతనుగదిలో అడుగుపెట్టాడు. ఆమెకి మాటలు వినపడలేదు.

"ఏమండి, ఒక్కమాట అడుగుతా, చెపుతారా?"

"ఓ! దానికేం. పదిమాటలడుగు."

"అదికాదండీ.....నేనెలాగున్నానండీ మీ కంటికి?.....నేను అందంగా ఉన్నాననేగా, మీ ఉద్దేశం?"

"ఊఁ!.....లేకేం! వెర్రిదానిలా ఉన్నావే. ఇన్నాళ్ళూ నీ అందమే గదా కొరుక్కుతింటున్నాను" అన్నాడు.

ఆమె ఒక్కగంతులో వెళ్ళి నిలువుటద్దం మీద గుడ్డతొలగించి చూచింది. ఆమెకళ్ళు కొత్తకాంతుల్లా ప్రకాశిస్తున్నాయి. అతను ఆమె వెనకాలే నిలబడి ఆనందపు నవ్వు నవ్వుతున్నాడు—

# ఆపద్బాంధవులు

శ్రీగుణిత కుచేలరావు విశాల నయనాలతో ప్రపంచాన్ని ఒక్కసారి పరికించాడు. నల్లటి ముసుగులో నిద్దరపోతున్నట్లు తోచింది ప్రపంచం.

తనను మోసుకువచ్చిన రైలుబండి తిరిగి మరి కొంతమందిని మోసుకొని బాపురుమంటూ వెళ్లింది. ఆవులించాడు కుచేలరావు. కడుపు ఖాళీగా వున్నట్లు, ఏవేవో జ్వాలలు బయలుదేరినట్లు తోచింది. "ఈ జానెడు పొట్టకోసమేగదా ఈ జనం తాపత్రయ పడుతోంది" అని నిట్టూర్పు విడిచాడు.

తలెత్తి తిరిగి చీకట్లోకి చూచాడు. ఎదురుగా కొండ మంచుకప్పు వేసుకొంటున్నది. చలిగాలికి రెపరెపలాడిన దేహం పైని వెంట్రుకలు నిగుడ్చాయి.

ఇలా ఎంతసేపని నిల్చోటం? అప్పటికి ఊరు మాటుమణిగింది. ఎక్కడికి వెళ్లేట్టు? ఎవరిని పలకరించేట్టు? తనను ఆహ్వానించిన సంఘంవారు కనీసం ఎడ్రసన్నా యిచ్చారు గాదు. పోనీ ఫలాని నాటకాలవారు ఎక్కడ వుంటారని అడిగి తెలుసుకొందామనుకొన్నా యీ రాత్రప్పుడు ఎవర్ని కదిపితే ఎవరూరుకొంటారు? నాటకాలవారు రాత్రిళ్లు నిద్దరపోరని తనకు అనుభవంలో తెలిసిన విషయమైనప్పటికీ ఎక్కడని వెదకటం? అయినా ఈ మహాపట్టణంలో ఏ మారుమూల వుందో అది! ఆ పిలిచినవాళ్ళు పోనీ దారి ఖర్చులకని అయిదో పదో పంపిన పాపాన్న పోయేరు కారు. తనకన్నా నిర్భాగ్యులు కామోసని సరిపెట్టకొన్నాడు.

ఆత్మారాముడు బుసలు కొడుతున్నాడు. ఇప్పుడు తనను పట్టుకొన్న సమస్య హామ్లెట్ సమస్యకన్నా జటిలమయింది. భారత ప్రభుత్వపు ఆర్థిక సమస్య తన సమస్య ముందు బలాదూర్. ఈ రాత్రికి ఎచ్చోట ఎట్లు మేను వాల్చవలె?

కనురెప్పలు బరువెక్కి కళ్ళు మూసుకుపోతున్నాయి. నిద్రముందు ఆకలి ప్రభావం తగ్గుతున్నట్లు తోస్తోంది.

తనదగ్గర ఒక లెదర్ హాండ్ బాగ్ తప్ప అట్టే బరువు సామ్రగిలేదు. నిజానికి అది లేకపోను—మరీ బాగోదని 'రావు'దగ్గర ఎరువు తెచ్చుకొన్నాడు. ఆ మాటకొస్తే ఈ సిల్కు లాల్చీ, గ్లాస్కో పంచె మాత్రం తనవా ఏమిటి? చెప్పగూడదు మరీ పబ్లిగ్గా అలాంటి విషయాలు. అయినా తనకీ బట్టలు సదుపాయంగా లేవు. గళ్ల లుంగీ, మోచేతుల బనీనే హాయిగా వుండేవి.

తనకేకో సన్మానం చేస్తారని గదా యీ బాధలకోర్చి అయిగురూపాయల అరువుతో యిక్కడికివచ్చి పడింది. అయినా వాళ్లు స్టేషనుదగ్గరకు వస్తామని చెప్పి రాలేదు. నిజానికి అది వాళ్ల తప్పుగాదు. మరుచటి రోజు వుదయాన ఆరుగంటలబండికి స్టేషనుకు వస్తామని వాళ్లు వ్రాసినా, సదుపాయంగా వుంటుందిగదా అని ముందుగా యిలా వచ్చి పడ్డాడు. ఇద్దరు ముగ్గురిని ఫలానా సమాజం ఎక్కడ అని పలుకరించినా జవాబిచ్చిన పాపానపోయారు కారు. మొత్తానికి ఎలా

## కొమాండూరి

గైతేనేం పొరపాటే జరిగిపోయింది. జరిగిపోయిందాన్ని పట్టుకు విచారించడంలో ప్రయోజనం లేదు.

వెయిటింగు రూంలో పడుకోవటానికి అనుమతి దొరకటమనేది దుర్లభం. వాచ్‌మన్‌తో ఇంటర్వ్యూ అయింతరువాతనే ఎంట్రెన్సు. 'ఎంట్రెన్సు ఫీ' కట్ట సమర్థులైనవారికే ఇంటర్వ్యూలో గెలుపు. అంత సమర్థతే వుంటే 'ఎయిర్ కండిషను' రూంలో బసచేసి వుండేవాడు. ప్లాట్‌ఫారాన్ని గుత్తకు పుచ్చుకొన్న రైల్వే పోలీసులు లాఠీలు తిప్పుకొంటూ పహరా యిస్తున్నారు.

ఇక అక్కడ నిలుచుండి లాభంలేదు. వూరుమీదికి పడ్డాడు. అన్నట్లు యీ పట్టణంలో "సిటీ రూల్సు" ప్రవేశపెట్ట బడ్డాయని విన్నాడు చూచాయగా. అయిడియా!

ఇప్పటికైనా ఇలాంటి అయిడియా తట్టినందుకు యముబుఱ్ఱకు అభినందనలు తెలుపుకొన్నాడు.

అంత నడివీధి, అంత మరువీధిగాని ప్రదేశంలో విశాలమైన అరుగు ఎక్కడైనా కనిపిస్తాయా అని చూచాడు. ఈ రోజుల్లో అరుగులు కట్టించుకోవటం మాటయిపోయింది— పిదప కాలం! కావ్యాలలో ఆ మాటకొస్తే, పేదరాసి పెద్దమ్మ కథలలో అరుగులమీదపడుకొన్న పెద్దమనుషులు ఘన కార్యాలెన్నో చేశారు. "ఆముక్తమాల్యద"లో ఒకానొక కవిపుంగవుడు స్వగతంగా మాట్లాడుకొన్న రెండు సంస్కృత శ్లోకపాదాలతో కొమాండు దైవ రాజు కన్నులు తెరిపించాడు. సరే లే! ఈ ఆలోచనలతో ప్రస్తుత సమస్య తీరదు గా!

అతి ప్రయత్నంమీద కొంత చీకటిగా ఉన్న రెండు అరుగులు కనుపించాయి. మూడంతస్తులమేడ. అది సంపన్నుల యిల్లది. పూర్వకాలపు శోభ తరిగిపోకుండా కాపాడుకు వస్తున్నట్లుంది. హాండ్‌బాగ్‌లోని తుండు బయటకుతీసి అరుగుకు ఒకవైపున శుభ్రపరచి పక్కపరచి పడుకొన్నాడు. మళ్ళీ తనకు వణుకు ఆరంభమయింది. ఒకవైపు చలిగాలి వరోకవైపు పాలరాతిగచ్చు! పోనీలే ఏదో యీ రాత్రి గడిస్తే ఎలాగూ ఆ సమాజంవారు కాలుక యివ్వకుండా పోరు. రేపటినుంచి మూడంకె వేసి వెచ్చగా గుర్రు పెట్టి నిద్దరపోతూ యాశీతాకాలంగడుపవచ్చు. ఇవ్వరూ—వాళ్లు మానాన్నవాళ్ళు పోతారు.

వీధి చివర్న ఏవో తలుపులు చప్పుడవు)



వరుడు శ్రీ యలమంచిలి రామచంద్రరావు (బి ఎస్ సి) వధువు విజయలక్ష్మి (కృష్ణాజిల్లా పంచాయతీబోర్డు అధ్యక్షులసంఘము ప్రెసిడెంటు, కృష్ణాజిల్లా కాంగ్రెసు సంఘ కార్యదర్శి శ్రీ చెన్నుపాటి రామకోటయ్యగారి కుమార్తె) ఏప్రిల్ 28 రాత్రి వడమటలంకలో వివాహం వైభవంగా జరిగినది



ప్రకృతి రామణీయకానికి నిలయమని పేరొందిన హిమాలయాలలో 'మనలీ' అనే పట్టణం దేశంలో 'సెలవు సెలవు'ను అభివృద్ధి చేయడానికై ప్రభుత్వం ఆరంభించిన కార్యక్రమం క్రింద ఈ కేంద్రం బాగా వృద్ధి కెక్కింది విదేశీయాత్రికులు పలువురు వస్తున్నారు.

# ★ ఆపద్బాంధవులు ★

తున్నాయి గస్తీ పోలీసుల హుంగామా కాబోలు! పిశాచాలాంటి దెబ్బలకు తలుపులు బద్దలవుతాయేమో ననిపిస్తోంది చప్పుడు క్రమంగా సమీపిస్తోంది వచ్చారు రానే వచ్చారు ఇద్దరు భటులు అరుగు మెట్లెక్కి బాటరీ లైటు వేశారు ఖర్మ వాళ్ళ ఆగమనాన్ని పరికించుతూ రెప్పవాల్చనిది కుచేలరావు కళ్ళు అలాగే వుండిపోయాయి

తనకు దగ్గరగా వచ్చాయి రెండు రెళ్ళ బాలుసు కాళ్ళు!

"ఎవరు నువ్వు?" ఒక కంఠం!

"ఎందుకు వచ్చావు?" మరొక కంఠం!

"సిటీరూల్సు ప్రకారం వీధి అరుగులమీద పడుకోకూడదని తెలీదూ?" తిరిగి మొదటి కంఠం

అప్పటికి తేరుకున్నట్లు కుచేలరావు తెలుసన్నట్లు తలవూపాడు

"మరి!" రెండో కంఠం!

"అబ్బాయ్! నీ వ్యవహారం బాగాలేదు గాని స్టేషనుకుపద!" మొదటి కంఠం

అచేతనకు గావాలి ద్వాపరయుగంలో కృష్ణపరమాత్మ అవతరించిన ప్రదేశం, కలియుగంలో గాంధీమహాత్ములవంటి పరమపూజ్యులు వీళ్ళ తరబడి నివాసం కల్పించుకొన్న ప్రదేశం! అహా! ధన్యోస్మి!

కుచేలరావు "నైట్ డ్యూటీ"లో వున్న ఇన్‌స్పెక్టరుగారి ముందు హాజరుపరచబడ్డాడు

"ఏమయ్యా రాత్రి పదకొండు దాటిన తరువాత కూడా రోడ్లమీద తిరగటమే గాక వీధిఅరుగుల మీద పడుకోటంలో నీ వుద్దేశ్యం ఏమిటి? నీకక్కడ ఏం పని? సిటీ అనుకొన్నావా? మరే మనుకొన్నావ్?" ఏం చేయటం! తనకు తెలియని విషయంగాదు తప్పదు మరి! చేశాడు

తన మౌనాన్ని భరించలేని ఇన్‌స్పెక్టరు చిరాకుతో "ఏయ్ టూనాట్ వన్ లోపలికి తీసుకెళ్ళి వుదయాన్నే పంపించేయ్!" అన్నాడు

బ్రతికాను భగవంతుడా! ఇంకా నయం చాలుగు ప్రహరించారుగారు! అనుకొంటూ టూనాట్ వన్‌ను అనుసరించాడు కుచేలరావు ఒక బల్ల చూపించి "పడుకో!" అన్నాడు టూనాట్ వన్ పడుకోబోతూ జేబులో చిల్లర డబ్బులున్నాయేమో తడుముకొన్నాడు టూనాట్ వన్ కళ్ళు విచ్చారినయ్! ఒట్టి చేతులు బయటకు రావటంతో తిరిగి ముడుచుకుపోయినయ్

"లేవయ్యా లే! మహా యింకా నిద్రపోతున్నావ్! ఇదేం అత్తారిల్లనుకొన్నావా యేం!" అంటూ లేపాడు తెల్లవారుతుండగా మిస్టర్ టూనాట్ వన్!

బదకంగా ఒళ్ళు విరుచుకొని, బయటికి వస్తూ నైట్ డ్యూటీలోంచి రిలీజవబోతున్న ఇన్‌స్పెక్టరుకు 'థ్యాంక్సు' చెప్పకుండా వుండలేకపోయాడు, కుచేలరావు చిరాకుగా వున్న ఇన్‌స్పెక్టరు మొహాన్ని మననంచేసుకొని నవ్వుకుంటూ రైలు స్టేషను వైపుకు దారితీశాడు కవి కుమారుడు కుచేలరావు

# శరత్ చెప్పిన కథలు

తెనిగింపు — సాంబశివరావ్ బొబ్బిలి

## 'చరిత్రహీనులు'



ఓ శనివారం శివపురంలో ఉన్న యింట్లో శరత్ బాబు సావిత్రీ ప్రసన్న చటోపాధ్యాయులవారితో సరదాగా కబుర్లు చెబుతున్నాడు.

"సావిత్రీ! నేను రాసిన 'చరిత్ర హీనులు' నవల వుంది చూశావా దాంతో ఓ గమ్మత్తయిన ముచ్చట జరిగిందిలే—ఈమాటు కాశీ వెళ్లినప్పుడు దాన్నక్కడ చెప్పొచ్చాను. అదే నీకూ చెప్తా విను" అంటూ శరత్ బాబు యిలా అన్నాడు—

"కాశీలో మన "ఉత్తర" సంపాదకుడు సురేశ చక్రవర్తి లేడూ? ఈపర్యాయం ఆయనింట్లో బస చేశాను. ఓనాడుదయం కొంత మంది బెంగాలీ సోదరులు నా దగ్గరకొచ్చి 'అయ్యా—ఇక్కడి బెంగాలీలంతా మిమ్మల్ని చూడాలని యెంతగానో వుబలాట పడుతున్నారు. కాబట్టి ఓ చిన్న మీటింగు పెట్టుకోవాలనుకుంటున్నాం. అందుకు తమరు తప్పకుండా దయచేయా'లంటూ చిన్న కాగితం అందించారు. "అయ్యా! మీరు మా సభ అధ్యక్షత వహించి కొన్ని వుపన్యసించాలి" అని చెప్పివుంటే, నేను కరాఖండిగా రానని చెప్పేసి వుండేవాణ్ణి ఘటాన్నని బహుశా వాళ్ళకి తెలుసేమో మరి! అందుకనే, తన్నెదో వాళ్ళ మీటింగుకి రమ్మన్నారే తప్పించి, అక్కడ మాట్లాడమని గానీ, అధ్యక్షులుగా వుండమని గానీ అన్లేదు.

కానీ పాపం యింతగా ప్రాధేయపడుతున్నారే అని, "సరే" నంటూ తలూపాను. తప్పకుండా వొస్తానని మాటకూడా యిచ్చాను.

ఇహపోతే ఆ సభలో సంగతి చాలదు. కేవలా యెటుచూసినా పువ్వు దండల మయం ధూపదీపాలతోనూ, అత్తరు గంధాల పరిమళాల ఘుమ ఘుమలతోనూ సుభాళించి పోతోంది. వాళ్ళు చేసిన ఏర్పాట్లంతో ముచ్చట గొలిపాయి. అక్కడ అడుగు పెట్టి పెట్టడంతోటే నాలో ఏదో ఆనందానుభూతి కలిగింది.

సభ బాగానే ముగిసిపోయింది. అందరూ యెవరిళ్ళకు వాళ్లు వెళ్ళిపోయారు. నేనూ లేచి పోదామనుకుంటున్నా. అంతలో యిద్దరు విధవాడబడుచులు నా ముందరకొచ్చి నుంచున్నారు. వాళ్ళిద్దరిలోను ఒకావిడ వయసు మళ్లింది, రెండో ఆవిడ యింకా వయసులో వున్నదీను. అంటే యిరవయ్యో, ఇరవై రెండో యేదో వుంటుంది.

కాలంలో వున్న విధవావిడ నాకు నమస్కరించి, నేనేదో ఆమెకి చాన్నాళ్ళ యెంతో పరిచయమైనట్టు నాకేసి చూట్టం మొదలెట్టింది. స్ఫటికల్లా ఆమె తెలుపు కళ్ళని గొంతువిప్పి నింపాదిగా, తియ్యగా,—"మీరు నన్ను కాపాడారు స్వామీ! మీరు నాకు గురువులు. నేను మీ ఋణం యెలా తీర్చుకోవాలో తెలీకుండా వుంది" అంది.

ఆమె అలా అనడం విని నేను నిశ్చేష్టుణ్ణయిపోయానంటే నమ్మ. ఆవిడకి నేనేం సాయం చేశానో నాకే పాలుపోలేదు,—"నేనేంటీ?—నిన్ను కాపాడ్డమేమిటీ?—ఎప్పుడో, ఎక్కడో, యేమిటో నాకేమీ అర్థం కావటంలేదే! అసలు నిన్నిదివర కెక్కడా చూసినట్టే జ్ఞాపకం లేదు" అన్నా విస్తుపోతూ.

ఆ అమ్మాయి వితంతువు అన్నమాటే గాని అందంలో జగన్మోహనే, తెల్లటిపాల తరగ లాంటివొళ్ళు ముద్దొచ్చే మొహం. అవలీలగా ఆమె నన్నో వారకిపిలిచి తన కథ యిలా చెప్పుకుపోయింది:

"మా నాన్నగారు బెంగాలు కవతల యేదో కాలేజిలో లెక్చరరుగా వుండే వారు. నే చెప్పేదీ నాన్నగారి దగ్గిరే వుంటూండేదాన్ని లెండి. నాకు యేణ్ణర్థం వయసప్పుడు మా అమ్మ పోయింది. అప్పట్నుంచీ మా నాన్నగారే పెంచి, పెద్దదాన్ని చేశారు. పదిహేనేళ్ళ ప్రాయమప్పుడు నాకు పెళ్ళయింది. కాని యిదే కాశీ నగరంలో మూడే మూడునాళ్ళ జబ్బుతో మంచం పట్టి మా ఆయన గుటుక్కుమన్నారు. ఆయన చచ్చిపోయాక మళ్ళీ మా నాన్నగారి పంచకే చేరుకున్నా. ఆయనకి మరోవారు మరోవారు యెవరూ లేరాయెను. ఉన్న సంతానమల్లా నేనొక్కర్తినే! నన్ను కాస్త [illegible] చేయాలని ఆయన నన్ను మళ్ళా చదివించడం ఆరంభించారు.

నాన్నగారి కాలేజీలోనే ఓ అబ్బాయి చదువుకుంటూండేవాడు. అతగాడెప్పుడూ మా యింట్లోనే మసుల్తూండేవాడు. నాన్నగారి కతనంటే అలవిమాలిన అపేక్ష. సొంత కొడుకన్నా యెక్కువగా చూసుకుంటూండే వాళ్ళు. క్లాసులో ఏ వేళ, ఏయే విషయాలపై ఏమేమిటి చెప్పాలో ఆ సరుకూ, సరంజామా యావత్తూ అతగాడిదగ్గిరే వుండేది. కావాల్సిన పుస్తకాలూ, నోటుపుస్తకాలూ సమస్తం అతనే యేర్చి కూర్చుతూండే వాడు. ఆ అబ్బాయే నాకు లెక్కలూ, సాహిత్యం ట్యూషన్ చెప్తుండేవాడు. ఇలా యేణ్ణర్థం గడిచిపోయింది.

అయితే మేం యిద్దరం యిలా రోజూ పొద్దాలపాటుతో ఓ చోట కూచుని కులాసాగా కబురు చెప్పుకుంటూ వుండటంతో మా యిద్దరిలోనూ చిన్న మార్పొచ్చి పడింది. ఈ వ్యవహారం కనిపెట్టి ఓనాడా అబ్బాయి నాన్నగారితో ఖచ్చితంగా చెప్పేశాడు నాకిహ ట్యూషన్ చెప్పలేనని, దాంతో నేను సరిగ్గా చదవటం లేదేమోనని చాలా విసుక్కున్నారు నాన్నగారు. అందుకని ఆ కోపంలో నన్ను కొన్నాళ్ళపాటు కలకత్తాలో వుండమని అమ్మమ్మగారింటికి పంపించేశారు.

# ★ చరిత్రహీనులు ★

కలకత్తా అయితే వొచ్చేశానుగాని నామనసంతా అటుకేసే వుంది. మరికొన్నాళ్ళకి మా యిద్దరి మధ్యా ప్రేమ లేఖలు కూడా నడిచాయి. ఒకనాడా అబ్బాయి ఉరుములేని పిడుగులాగ గబుక్కున కలకత్తా వచ్చేశాడు. ఇహ మాకే అడ్డూ, అపూ లేదు. ఏదో పలానా చోట గుట్టుగా కలుసుకుందామనుకోవటం, అక్కడ యిరం కులాగాసొద్ద కాలక్షేపం చేయటం-యిలా గడచిపోతూంది కాలం. అయితే యిన్నాళ్ళిలా లోకులకి అదురూ, బెదురూ ఏదో మహానేరం చేసిన వాళ్ళకి మల్లే నక్కి నక్కి తిరుగుతూండటం? – ఆఖరికి బిఱుకు బిఱుకుమనే అతుకులబతుకు మాకు ససేమిరా నచ్చలేదు. అందుకే ఏది యేమయినా సరే, యిద్దరం యిక్కణ్ణుంచి యెక్కడికేనా లేచిపోయి యే చీకూ, చింతా లేకుండా సుఖంగా కాపరం చేయాలని నిర్ధారణ చేసుకున్నాం.

సరే, ఆ రాత్రంతా నేను పడుకోకుండా వుండాలనీ, ఆ యబ్బాయి రెండు గంటల రాత్రప్పుడు ఓ జట్కా తీసుకొచ్చి మా సుర్యానికి దగ్గరగా నిలబెట్టాలనీ, కింద నేను పడుకునే గది కిటికీ టకటకలాడించి, తట్టిన వెంటనే నేను పెట్టే, బేడా పట్టుకు బయలుదేరి బయటికొచ్చేయాలనీ మేం ఇద్దరం కూడబలుక్కున్నాం.

ఆ వేళ సంగతి నిజంగా జన్మజన్మాలకూ అంత సులాగ్గా మరచిపోలేను సుమండీ. ఆ వేళంతా యేదో గాబరా, ఏదో భయం, ఏదో పరాకుతోనే గడిపాను. సాయంకాలం మా మావయ్యని లైబ్రరీకెళ్ళి నవలేదైనా తెచ్చిపెట్టమన్నాను. ఎందుకంటే యేదో పుస్తకమైనా చదువుకుంటూ రాత్రంతా పడుకోకుండా జాగారం చేయచ్చుగదా అని.

మావయ్య గ్రంథాలయంనించి ఓ పెద్ద నవల తెచ్చి నాపైని గిరవాటేశాడు. ఆ నవల పైని "చరిత్ర హీనులు" అని వుంది. ఆ పేరు చదవగానే నా గుండెలు దడదడమని కొట్టుకున్నాయి. అసలు నేనే ఓ చరిత్ర హీనను. నాకుతగ్గ నవలే దొరికిందనుకున్నాను. బలే గమ్మత్తుగా వుందీ సంగతి.

భోజనాలవీ అయాయి. ఎవళ్ళ పక్కల మీదికి వాళ్ళు సర్దుకున్నారు. నే నా నవల పట్టుకుని నా గది తలుపులూ కిటికీలూ అన్నీ మూసేసుకున్నాను.

ఆ నవల చదవటం పూర్తయేసరికి గోడ మీదనున్న గడియారం ఠంగున రెండు కొట్టింది. ఆ అర్ధరాత్రి వేళ నేనేం చేయాలో అప్పటికే ఖరారు చేసుకున్నా. ఆ సమయంలో మీ నవల తాలూకు కథానాయిక 'కిరణ్మయి' నన్ను కాపాడిందంటే నమ్మండి,

సరిగ్గా అదే వేళకు అనుకున్న మాస్తరుగా నా గది కిటికీని టకటకమని తట్టున్న చప్పుడయింది. ఆ అబ్బాయి వొచ్చేశాడని నింపాదిగా వెళ్ళి కిటికీ కొస్త వోరగిలా తీశాను. అతను నా కళ్ళకేసి గబగబా రమ్మని ఆహ్వానిస్తున్నట్టు ఆత్రుతగా చూస్తున్నాడు. కానీ 'నేను రాలేను. మన్నించ'మని అతగాణ్ణి బతిమాలుకున్నాను.

ఈ మాట ఆలకించేసరి కతని మొహంలో అవుపించిన నిరాశ, నిస్పృహా నే నీనాటికీ మరిచిపోలేను. అత నేవేవో గాలిమేడలు కట్టుకొచ్చినట్టుంది. వాటినన్నిటినీ నేనో తుఫానుగాలిలా వొచ్చి యెగరగొట్టేశాను. పాపం తెల్లారకముందే ఎటో పారిపోయేందుకతను యేర్పాట్లన్నీ చేసుకునే వొచ్చాడు. రైలుటిక్కట్లు కూడా కొనుక్కుని మరీ వొచ్చాడు.

నేనాఫళంగా చేతులు జోడించి–"ఏదో నిన్ను ఆశపెట్టి మోసగించాను. అన్యాయమే చేశాను. నన్ను మన్నించు" అంటూ వేడుకున్నా.

అతను పాపం అలాగే కొయ్యబొమ్మకి మల్లే కొరడుబారి కొంతసేపు నుంచుని, ఓ పెద్ద నిట్టూర్పు వదిలి అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత నేను మా అమ్మమ్మతో కాశీ వొచ్చేశాను. ఈ ముచ్చట సరిగ్గా ఏడాది కిందట ఈ వేళే జరిగింది. ఇప్పటికీ అనుకుంటూంటాను. మీ కిరణ్మయే నన్నారాత్రి కాపాడింది. చరిత్ర హీనులు చదివే వేళ మిమ్మల్ని చూడాలని ఎంతో వుబలాటపడేదాన్ని. ఆ విశ్వేశ్వరుడి కరుణా కటాక్షం వల్ల నే నా కోరిక ఇంత తొందరగా తీరింది.

ఆ వేళ గాని మీ 'చరిత్ర హీనులు' చదవకుండా వుంటే ఈనాటికి నే నెక్కడుండేదాన్నో, ఎలాంటి అధోగతి పాలయేదాన్నో ఊహించేందుక్కూడా వీల్లేకపోయేది. మీరే నన్ను కాపాడారు. మీ మేలెన్నటికీ మరిచిపోలేను.

ఇలా తన కథని చెబుతూ తనలో తనే ఎంతో మురిసిపోయిందని ఆ వితంతు యువతి ముచ్చట వివరిస్తూ శరచ్చంద్రుడు, "ఇదుగో సావిత్రీ! నేను 'చరిత్ర హీనులు' నవల రాసిన కొత్తలో నా మీద అభాండాలు బ్రహ్మాండమంతా మునిగిపోయేట్టు వచ్చాయి. ఇహ తిట్లూ, చీవాట్లకి లెంపూ తరవాయి లేనేలేదు. ప్రతివాళ్ళూ నామీద ఓ విమర్శో, లేకపోతే ఓ సమీక్షో, లేదా ఓ దండయాత్రో, ఏదో ఓ తుఫాను లేవదీయకుండా వుండేవాళ్ళు కారు. అయితే ఆ దుమారా లిప్పటికీ అప్పుడప్పుడు ఉండుండి లేస్తుంటాయనుకో. అయినా ఆ విమర్శక శిఖామణులంతా నన్నెంత తిట్టినా-యిబ్బంది పెట్టినా నాకేం లెక్కలేదు. నేను రాసిన ఆ నవల ఇల్లాంటి వెర్రిబాగుల అమ్మాయిని ఒక్కదాన్నయినా కాపాడిందిగదా అన్న సంతృప్తే నాకు చాలు. అదే పదివేలు!" అన్నాడు. ★

# ఆమె సౌందర్యవతి...
# ఆమె పాండ్స్‌ను ఉపయోగిస్తుంది



**మీ ముఖమును మృదువుగా మరియు మనోహరముగా ఉంచుకొనుటకు**

## పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌ను వాడండి

తేలికైన మరియు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీము చర్మమునకు రక్షణనిచ్చి దానిని చక్కగా మరియు మనోహరముగా ఉంచుతుంది. అది జిగురుగా ఉండదు మరియు రాసుకొన్న మరుక్షణము లోనే కనపడకుండాపోతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును పౌడరు అద్దుకొనే ముందు వాడితే పౌడరును గంటలతరబడి అంటుకొని ఉండేలా ఉంచుతుంది.




చర్మమును శుభ్రపరచే క్రీమ్
ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును రుద్ది రాసుకోండి. అది చర్మమును శుభ్రపరుస్తుంది మరియు మీ లావణ్యమును కాపాడుతుంది.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

# బంగారం సింగారం

బాపు బొమ్మల కథ 9






















లాభం లేదు - ఎలాగో శాంతి చెయ్యాలి - పోనీ తవ్వబోయే పెట్టెకి తాళాలు కావద్దూ?
కావాలి కావాలి!
ఛప్! నోర్మూయ్!


పెట్టెని గునపంతో పగల గొడితే పెట్టె నాశనం కాదూ - అంచేత -
మావద్దిర తాళం చెవులున్నాయ్ వెల సరసం - ఫలమధికమ్!


అప్పారావూ మామూవ మంచి వాడు - తాళం చెవి చవగ్గా [illegible]
మరేం! పాపం — మూడొందలు దాటనీకు --


మూడొందలే! బాబోయ్! డబ్బోయ్! నేనోయ్! నాయనోయ్!
కాను మావా! తాపోతే కుట్ర చేసి చంపే-స్తారు


ఇంద - [illegible]!


ఇహ తప్పదండి!


అదిగో పొదిగో - మాలక్ష్మి - దణ్ణం పెట్టండి అంతా!


మొత్తం మీద పెట్టె తవ్వి పైకి తీశారు -


నిజంగానే పెట్టె వుందే! - కాదు సుమా తెల కాదు సుమా
[illegible] చెదరలేదు సుమా!


తప్పుకో మావా! తుప్పు తాళం ఏం చేస్తుంది గాని -


పెట్టెమూత తెరిచారు దాంట్లో ......

# అన్వేషణ

### పోతుకూచి సాంబశివరావు

[గత వారం తరువాయి]

రైలుస్టేషన్లు కదిలిపోతున్నాయి గిరగిరా. రైలు వరంగలు దాటి ఖాజీపేటకు వచ్చింది. ఒక కప్పు టీ త్రాగాలని రైలుదిగి ప్లాటుఫారంమీద అడుగుపెట్టాడు శివరాం. వచ్చే వెళ్ళే ప్రయాణీకులతో ప్లాటుఫారం క్రిక్కిరిసి ఉంది. అరటి పళ్ళు, ద్రాక్ష పళ్ళు, బిస్కట్లు చుట్టాబీడీ సిగరెట్లు, కిళ్ళీ అమ్మేవాళ్ళు హడావడిగా రైలు పెట్టెలోని జనాన్ని చూస్తూ కేకలేస్తున్నారు తమ వస్తువుల ప్రచారం చేస్తూ. ఎదురుగా ఉన్న ప్రదేశమంతా రైలుపట్టాలతో నిండిపరుచుకుంది. రైలు ఇంజను కొన్ని డబ్బాలు ఒక చోటి నుంచి మరోచోటికి రవాణా చేస్తున్నాయి. రైలు బొగ్గుతో మాసిపోయిన నల్లటి అసహ్యమైన దుస్తులతో రైలులో పని చేసే వారు తమ పనులసందడిలో ఆలోచనలతో కదిలిపోతున్నారు. టిక్కట్టుకలెక్టరు తనబాధ్యత నిర్వహించడానికి ఠీవిగా రైలుపెట్టెలు ఎక్కి దిగుతున్నాడు. ప్రయాణీకులు కంగారుగా ఫలహారాలు తినడం ముగించి మళ్ళాయి నీరుత్రాగి పొట్టలు నింపుకొని రైలుపెట్టెలోని తమ స్థలాలు చేరుకుంటున్నారు. ప్లాటుఫారానికి ఒకవారగా పేకజీపెట్టెలు, గోనెమూటలుపడి ఉన్నాయి. ఒక రైల్వే ఉద్యోగి అది తనిఖీ చేస్తున్నాడు. ఏదో రైలు ప్రక్క పట్టాల మీదకు వచ్చింది. రెండు రైళ్ళలోని ప్రయాణీకులు పరస్పరం ముఖాలు అవలోకించుకుంటున్నారు.

చుట్టూరా మారుతున్న జీవితం...మారుతున్న ప్రదేశాలు...మారుతున్న మనుష్యులు... మనస్సులోని భావాలు కూడా కొద్దిగా మార్పు చెందనారంభించాయి. వాతావరణంలోని మార్పు తప్పనిసరిగా మనస్సులోని పాత ఆలోచనలుమాపి క్రొత్త ఆలోచనలకు తావిస్తుంది. విచిత్రంగా కనిపిస్తున్న ప్రస్తుతం కలగా ఊహించుకుంటున్న భవిష్యత్తు తన జీవితంలో ఏం మార్పులు తేగలవో అనుకుంటూ రైలు ఎక్కాడు శివరాం. కాఫీ త్రాగి రైలుమళ్ళీ ప్రయాణానికి సన్నద్ధమయ్యింది.

సికింద్రాబాదు, హైద్రాబాదు నగరాలు శివరాం ఎప్పుడూ చూడలేదు. గోదావరి ప్రాంతంలోని చిన్నపట్టణాల జీవితానికి అలవాటుపడిన శివరాం మహానగరంవాతావరణం గూర్చి ఏదో విచిత్రంగా ఆలోచించసాగాడు. పెద్దనగరం విశాలమైన వీధులు... గబగబనడిచే జనం...అందమైన భవనాలు అంతులేని కార్ల ప్రవాహం...జాడతెలియని సందుగొందులు...పూర్తిగా క్రొత్తయైన ఓకమహానగరంలో జీవితం క్రొత్తగా ప్రారంభించాలి...ఎన్నో అనుభూతులు, అపాయాలు...అవస్థలు...ఎదుర్కోవాలి.

ఆకాశంలో పిట్టలు ఎగురుతూ పిల్లిమొగ్గలు వేస్తున్నాయి. ఒక వంతెనక్రింద సెలయేరు వంకరటింకరలుగా వయ్యారంగా ప్రవహిస్తోంది. సందడిగా చివరిగమ్యం తెలియకపోయినా, లేతచిగురుటాకులతో చిటారుకొమ్మలు ఆనందంగా ఊగిస్తూ వివిధ వృక్షాలూ విరామంగా గాలిపీల్చుకుంటున్నాయి. సేద్యంకాని ఎర్రభూములు ఎదురుగా విస్తృతంగా వ్యాపించి ఉన్నాయి. తనసాహస ప్రయాణం విఫలంకాదని తీర్మానించుకున్నాడు శివరాం.

తలుపులు మూయబడివున్న రైలుపెట్టెకు రైలు కిటికీలోంచి కనిపిస్తున్న అనంతమైన ప్రపంచానికి వున్న వ్యత్యాసమే సంకుచిత జీవితానికి, విశాలదృక్పథాలతోడి జీవితానికి మధ్యకూడావుంటుంది. మానవజీవితము సంకుచిత మనస్తత్వంలోంచి విశాలదృక్పథంలోకి మారాలంటే నాలుగోడల గృహవాతావరణంలోంచి బయటపడి ప్రపంచ పరిస్థితులు అవలోకన చెయ్యాలి. అటువంటి అవలోకనకు ప్రయాణం నాంది. సాహసమైన ప్రయాణాలు, బ్రతుకుల గతులు, విలువల్ని పూర్తిగా మార్చగలవు. ఏదో మసక తెరలోంచి గొప్ప భవిష్యత్తు కలలాగా కనిపిస్తున్న శివరాంకు తన ప్రయాణమే ఒక సాహసకార్యమైంది. బ్రతుకులో క్రొత్తదనం, గొప్పదనం చవిచూడగలనే ఆకాంక్ష, ఆశ, అతనిలో స్పందించాయి. శారదవల్ల ఎదురుదెబ్బ తగలకపోతే యీ సాహస ప్రయాణం రూపొందేదికాదేమో! శివరాం ఒకవిధంగా సంతృప్తిపొందాడు. ఏమైనా జీవితంలో స్థిరపడడానికి ముందు యువకుడు కొంత ప్రపంచాటనం చెయ్యవలసిన అగత్యం ఎంతో వుందనే నమ్మకం గట్టిగా ఏర్పడింది శివరాంకు. ముందుముందు తను చేయబోయే మహా సాహసకార్యాల గురించి ఏదో కమ్మని పగటికలలు కంటూ కొంతసేపు తన్మయుడయ్యాడు శివరాం.

ఆలేరు.. భువనగిరి ... ఘటికేశ్వర్ మౌలాలి...స్టేషన్ల నల్లటిఅక్షరాలబోర్డులు కదిలాయి గబగబా.

'వచ్చేది సికింద్రాబాదు!' ఒక తలనెరిసిన పెద్దమనిషి ఒక గ్రామీణ రైతుకు చెబుతున్నాడు.

ఏమీ తెలియకపోయినా, అంతా తెలుసుకున్నట్లు క్రొత్తవాతావరణంలో ఒకవిధంగా నటించవలసిన అగత్యం ఒక్కొక్కసారి ప్రతిమనిషికి ఏర్పడుతుంది. ఇతరుల దృష్టికి తన అవివేకం, తెలియనితనం, కనిపించకుండా, హుందాగా వుండాలనే స్వభావం కలిగిన శివరాం, తోడి ప్రయాణీకులను ఏమీ ప్రశ్నించకుండా, ఎన్నోసారులు ఆ వైపు ప్రయాణాలు చేసిన యాత్రికుడులా, ఆ వాతావరణం తనకు పాతదే అని ఇతరులకు స్ఫురించేటట్లుగా గంభీరంగా మొహంపెట్టి ప్రయాణీకులవైపు మౌనంగా చూస్తూ కూర్చున్నాడు. ముభావంగావున్న శివరాంను ప్రక్క ప్రయాణీకులు ఎక్కువగా పలకరించ సాహసించలేకపోయారు.

జేబు తడుముకున్నాడు శివరాం. సరిగ్గా ఎనిమిది రూపాయలున్నాయి. భోజనానికి, ఇతర అవసరాలకు పై రెండు రూపాయలు ఖర్చయిపోయాయి. ఏదైనా ఒక ఉద్యోగం సంపాదించుకొని జీవితం ఒక దరిచేరేదాకా ఆదుకోవలసిన ఆ డబ్బును పదిలంగా పట్టుకున్నాడు. రైలులో రాత్రి నిద్రపోయినప్పుడు తన చిన్న నిధికి విపత్తు రానందుకు సంతోషించాడు.

గజ్జెల మోతల చప్పుడులతో, ఏనుగు ఘీంకారంలా కూతలతో వడివడిగా రైలుబండి పరుగిడుతోంది. రైలుపట్టా కిరువైపుల

ఇళ్ళు, తోపులు, రోడ్లు కనిపించసాగాయి. టెలిగ్రాఫు తీగలు, ఇనుప స్తంభాలు ఒంటరిగా నిలుచున్న గూడ్సుబండి పెట్టెలు, పట్టాలమధ్య రాతిని బొగ్గుతో నల్లబారిన విదురుచెక్కలు, నడుస్తున్న రైలుఇంజన్లు, రాబోయే పెద్ద రైల్వేస్టేషను సందడిని ఒక విధంగా చూపిస్తున్నాయి. నిప్పులగుత్తుల్లా ఎండలో మెరుస్తూన్న ఎర్రపూలతో నగరం పొలిమేరలోని సీమతంగేడు వృక్షాలు క్రొత్త బ్రతుకుకోసం వెదుకుతున్న శివరాంను ఆహ్వానిస్తూ స్వాగతం చెబుతున్నట్లు పూలకొమ్మలతో ఆడి నృత్యం చేశాయి.

ఉత్సాహంతో రైలుపెట్టెలో లేచి నిలుచున్నాడు శివరాం. రైలుపెట్టెలో బెంచి క్రింద పదిలపరిచిన తన పెట్టె, బెడ్డింగు వెతికాడు. కనిపించిన బెడ్డింగు గట్టిగా బిగించుకుని సర్దుకున్నాడు. ప్రక్కన ట్రంకుపెట్టె లేదు. ఏమైంది? ... ముచ్చెమటలు పోశాయి. ఏదో భయం కలిగి, చుట్టుప్రక్కల ప్రయాణీకుల సామాన్లు పరిశోధించాడు. అందర్నీ అడిగాడు. కాని ట్రంకుపెట్టె జాడకనిపించలేదు.

నల్లటి చిన్న ట్రంక్ పెట్టె—బ్రహ్మయ్యగారు, తన చిన్నతనంనుంచి వాడుకుంటున్న ట్రంకుపెట్టె శివరాంకు అభిమానంగా, యిచ్చారు. తరతరాల చిహ్నంగా. ఈనాడు ఎవరో ఆపెట్టెను దొంగిలించారు. తాను యీ మధ్యచేసిన పొగాకు కంపెనీ ఉద్యోగంతో కుట్టించుకున్న రెండుకోట్లు, చొక్కాలు, పుస్తకాలు - అంతకన్న పదిలంగా దాచుకున్న శారదఫోటో, బి. ఏ ప్యాసయినప్పుడు బ్రహ్మయ్యగారు ఆనందంగా బహుమతిగా యిచ్చిన బంగారు ఉంగరం...అన్నీ పోయాయి. శివరాం హృదయం ఏదో కలతలతో చికాకుపడింది.

ఇంతవరకు క్రొత్తనగరపు వాతావరణం, నూత్న జీవితం గురించి చేస్తున్న ఆలోచనలు చెల్లాచెదరై పోయాయి. ఇది తన భవిష్యత్తుకు అపశకునమేమో అనుకుని ఖేదపడ్డాడు శివరాం.

ట్రంకుపెట్టె పోగొట్టుకున్నాడని విన్న ప్రయాణీకులు శివరాంపై అపారమైన సానుభూతి చూపించారు. కొందరు ప్రయాణాల్లో జరిగే దొంగతనాలు గూర్చి సణిగారు కోపంగా రైలుపెట్టెలోని జనమంతా కంగారుగా తమ సామానులు జాగ్రత్తగా ఉన్నాయా లేదా అని పరిశీలించుకోసాగారు.

'కొంచెం సామాన్లు చూస్తూ ఉండండి. ఇప్పుడే కాఫీ త్రాగివస్తా!' అంటూ కాజీపేటలో తను రైలు దిగినసంగతి జ్ఞప్తికి వచ్చింది. నాటు వేసుకొని సిగరెట్టు కాలుస్తూ ప్రక్కనే కూర్చున్న మనిషి ఎక్కడ దిగిపోయాడో తన ఆలోచనల్లో గమనించకుండా ఉండిపోయాడు శివరాం



"కళ్లూ ముక్కూ తల్లివేగాని ఆ క్రాపింగు మటుకు అచ్చుగుద్దినట్టు తండ్రిపోలికే నంటారండి అంతా"

'ఊహాగానాల ఫలితం ఉన్నది పోగొట్టుకుని మళ్ళీ శూన్యంలోకి నడవటం. తరతరాల పాత చిహ్నాలు తననుంచి దూరమౌతున్నాయ్ అనుకున్నాడు శివరాం.

రైలు దిగి పోవాలనే కంగారులో ఉన్న ప్రయాణీకులకు శివరాం స్థితి ఆలోచించే సావకాశం లేకపోయింది. గుండె నిబ్బరం చేసుకుని తలలేని మొండెంలా పాదాలవద్ద పడిఉన్న పాతబెడ్డింగు దుమ్ముదులుపుకుని ప్రయాణం బడలికతో, మాసిపోయిన బట్టలతో, జనం త్రోపుడులో దగ్గరున్న ధనం పోకుండా జేబు గట్టిగా పట్టుకుని, లోపలికి సామాన్లు అందుకోడానికి కేకలతో ఎగబడుతున్న రైల్వేకూలీలను త్రోసుకొని, కోలుపోతున్న ధైర్యం బలవంతంగా తెచ్చుకుంటూ, నీరసపడిన శరీరంలోకి క్రొత్త శక్తి కృత్రిమంగా యిముడ్చుకుని, క్రొత్త దేశంలో అడుగుపెట్టిన యాత్రికుడిలా రైలుపెట్టె దిగి ప్లాటుఫారం మీద ఒక నిమిషం నిలుచున్నాడు శివరాం. పెద్ద రాతిపలకల పెట్టెలా

(43-వ పేజీ చూడండి)



# సంఘటన

మంజీర

భీమయ్య పగలు ప్రయాణం వక్షిలా పనిచేసి యింటికొచ్చేసరికి, యీ మధ్య యెప్పుడు చూసినా తన పెళ్ళాం మూలగడమో, మూల్గడమో జరుగుతూ వుండేది. అరడజనుమంది పిల్లలతో, అమితంగా ఆయాసపడుతూ, సరయిన తిండిలేక, నిస్సత్తువతో, నిరాశతో నిస్పృహతో, కొట్టాడే ఆమెముఖం చూడగానే, ఆ మూలుగులకు మూల్గులకు కారణం స్పష్టంగా గోచరించేది. అపార విచారంతో కుంగిపోయేవాడు భీమయ్య నోట మాట పెగలక. తను తండ్రి అయినందుకు పిల్లలకు యే విధమయిన సౌఖ్యం కలిగించలేక పోతున్నానన్న, చింత అతనికి అడుగడుగునా అడ్డు తగులుతోంది.

తన జీవిత సర్వస్వమైన ఉద్యోగంలో ఎన్నేళ్ళు గడిచినా, ఎదుగూ బొదుగూ లేకుండా పోతోంది. అలాగే బ్రతుకుతున్నాడు పెల్లురులో నడిచే గ్రుడ్డివాడిలాగ. తన పనిలో యెదుగూ, బొదుగూ ఉందా, లేదా, అని ఆలోచించడానికి కూడా భీమయ్యకు తీరిక చిక్కడికాదు. ఉన్న ఉద్యోగమే మహాభాగ్యం.

అతని పరిసరాల్లో ఉన్న ప్రతివ్యక్తీ పూర్తిగా అతనిలాంటి పరిస్థితులలోనే ఉండడంవల్ల, తనబాధ, కష్టం, దిగమింగి ఊరుకోడం అలవాటయింది అందరిలాగే. జబ్బుతో, నీరసంతో మూల్గుతూన్న తన భార్యనూ, సరయిన తిండి, బట్టా, కైనా నోచుకోని పిల్లలనూ, చూచినప్పుడు అతని మనస్సు సముద్రంలా క్షుభితమవుతూంటుంది.

భీమయ్య భారంగానే దించినతలయెత్తకుండా, మౌనంగా క్రిందికిమాస్తూ నేలపైనే అడుగు లొక్కొక్కటే లెక్కపెడుతూ నెమ్మదిగా నడిచొచ్చాడు యింటికి రోజూలాగే. తన్ను దూరాన్నించే చూసి గుమ్మంవద్దకు "నాన్నా నాన్నా" అంటూ స్వాగతమిచ్చే పిల్లలనెత్తుకుని యింట్లో కెళ్ళాడు.

మూలుగుతూ జ్వరంతో పడుకుంది భార్య. "వచ్చారా" అంది అడుగుల సవ్వడివిని కాబోలు. భీమయ్యకేమి ఎలా. మాట్లాడాలో పాలుపోయిందికాదు. ఆమె మంచం దగ్గరగా వెళ్ళాడు. ఆమె శరీరం నిప్పులు గ్రక్కుతోంది.

"యేం, యెలా ఉంది" అన్నాడు.

"మామూలుగానే" అందామె తను పడుతూన్న బాధను కప్పిపుచ్చుదామన్న వ్యర్థ ప్రయత్నంతో.

"జ్వరం బాగానే వచ్చిందే," అన్నాడు ఆందోళనతో.

"యెప్పుడూ వున్నదేగా" అందామె నీరసంగా.

"పోనీ, డాక్టరుని పిలవనా?" అంటూ నేలమీద చతికిలబడ్డాడు.

"మరి ఆయన కియ్యడానికి ఫీజో" అందామె తాపీగా. డాక్టరుని పిలిస్తే బాధ కొత్త తగ్గుతుందేమోనన్న ఆమె ఆశ మసగ్గా ఆమాటల ముసుగులోంచి కనిపిస్తోంది, వెల్లవేసినా కనిపించే అక్షరాల్లాగ.

"డబ్బేటి. అదు మనగురించే ఉన్నాట్ట"

"డబ్బియ్యకపోతే మందియ్యడటగా."

"అది బాబుగారిమందేటి? మన కోసమే పెట్టారుట ఆసుపత్రి" అన్నాడు భీమయ్య ఉద్రేకంతో.

పేదవాడి కోపం పెదవికి చేటు.

"యేమో, అందరూ అలా అంటారు", అందామె అటునుంచి యిటు తిరిగి.

"మరి మా వర్కుషాపులో ఆఫీసరు అలా సెపుతాడు. అదంతా మన బాగుకేనట."

"ఏమో మరిపిలు" అంది.

భీమయ్య ఆ బట్టలతోనే బయలుదేరాడు డాక్టరు వద్దకు. ఆ డాక్టరు యింట్లో అరుగు మీద కూర్చున్నాడు తలవంచుకుని భీమయ్య.

ఒక గంట గడిచాక డాక్టరుగారు వచ్చారు. భీమయ్యను చూచీచూడ్డంతోనే,

"వచ్చావా అప్పడే. యేం కొంప మునిగి పోయింది. దొంగ జబ్బులూ మీరూను. పని యెగేయడానికి," అంటూ అతని వద్దకు వచ్చి అతనిచేయి పట్టుకున్నాడు. భీమయ్య నిర్ఘాంతపోయాడు.

"నీకు జబ్బేమిటోయి. ఈదొంగవేషాలు వెయ్యకపోతే తిన్నగా పని చెయ్యరాదూ" అన్నాడు.

"నాకుగాదండి బాబూ జబ్బు" అని నసిగాడు భీమయ్య.

"ఆ!...నీకుగాదూ. అలా చెప్ప వేం పెండట. డాక్టరుతో మాట్లాడ్డానికిగూడ భయం అయితే యెలాగచ్చేది చెప్పూ"

భీమయ్య సంగతి వెల్లడించాడు.

"మీ యిల్లెక్కడ" అన్నాడు డాక్టరు.

"కూలీలపేటలో చివరియిల్లు"

"తెలుస్తుందా అక్కడ యెవర్నైనా అడిగితే."

"కష్టంబాబూ. తమరు నాకూడా దయ చేయించండి."

"అయితే పద" అంటూ డాక్టరుగారు తన సైకిలు తీసుకున్నారు.

భీమయ్యయిల్లు చేరారు యిద్దరూ. డాక్టరు భీమయ్యభార్యను పరీక్ష చేశాడు. జబ్బు చాలా పెద్దదని, జాగ్రత్తగా వుండాలని సలహాయిచ్చాడు. పండ్లూ, పాలూ హెచ్చుగా యివ్వాలన్నాడు. ఎక్కడనుంచి యెలా తేవాలో భీమయ్య ఆలోచిస్తున్నాడు. డాక్టరు ఏదో కాగితంమీద రాసి యిచ్చాడు. భీమయ్య ఆనందంతో అందిపుచ్చుకున్నాడు. డాక్టరు ఆ కంపుపాకలో నిలబడలేక వీధిలోకొచ్చేశాడు. పాకవైపు చూస్తూ నిలబడ్డాడు. భీమయ్య లోపలనుంచి యింకా పైకిరాలేదు. డాక్టరు విసుగ్గా సైకిలుబెల్లు గణగణమ్రోగించాడు. భీమయ్య గబగబా పరుగున పైకివచ్చాడు. చేతులు నలుపుతూ డాక్టరుముందు నిలబడ్డాడు.

"నా ఫీజుమాట యేమిటు" అన్నాడు డాక్టరు మెల్లగా అతనిమీదున్న అసహ్యాన్ని దిగమ్రింగుతూ. భీమయ్యకేం చెప్పాలో తెలీడంలేదు. డాక్టరు తనగురించి ఉన్నప్పడు తను ఫీజెందుకివ్వాలో అర్థమవలేదు.

అయినా డాక్టరు డాక్టరే. ఆయన ఫీజు యిచ్చితీరవలసిందే. రోగంకుదిరినా, కుదరకపోయినా, రోగి బ్రతికినా బ్రతక్కపోయినా, డాక్టరు డాక్టరే మరి.

"బాబూ ప్రస్తుతం నాదగ్గర దమ్మిడీకూడా లేదు. తరువాతిచ్చుకుంటాను" అన్నాడు చాలాబాధతో క్రుంగిపోతూ.

"అంతలేనప్పుడు యీ వైద్యాలన్నీ యెందుకోయి? డాక్టరుకు డబ్బివ్వకుండా మందుకొనకుండా, పళ్ళూ పాలూ రోగికివ్వకుండా జబ్బులు కుదురుతాయా? యీ గొడవంతా యెందుకు? ఊ అలో అలవా వేసేయి అంతలేనప్పుడు" అంటూ సైకిలెక్కాడు డాక్టరుగారు.

భీమయ్య విచారంగా ఆ అశ్వినీదేవత అదృశ్యమయినదిక్కు రెప్పవాల్చకుండా చూస్తూ నిలబడ్డాడు కొన్ని నిముషాలు. కొంతసేపయాక మందుకు పెద్దపిల్లాణ్ని పంపి, తను వంట మొదలు పెట్టాడు. భీమయ్యభార్య



# ★ సంఘటన ★

ఆ జ్వరంలోనే పిల్లలనూరడిస్తోంది.

వీధిలోనుండి "భీమయ్యా! భీమయ్యా" అని కేకలు వినిపించాయి. చటుక్కునలేచి వీధిలోకిపోయాడు. "అరె యమదూతలా ప్రత్యక్షమయాడు" అనుకున్నాడు లోలోపల. "యేం. ఏం ముంచుకొచ్చింది" అని ప్రశ్నించాడు.

"యేయీముంచనేదు. దీనిమీద సంతకం సెయ్యి" అన్నాడు పుల్యాను ఓ పుస్తకం అందిస్తూ.

"ఆ సంతకమే చెయ్యడంవత్తే యీ బ్రతుకెందుకులే? అసలు యిసయంసెప్పు" అన్నాడు భీమయ్య.

"యేటుందిలే. మామూలే. ముందు నిశానీ సెట్టు"

"అసలుసంగతి సెప్పవోయి" అన్నాడు ఆందోళనగా.

"యేంవోయ్. యీయాళ అంత సిరాగ్గా వున్నావు" అన్నాడతడు భీమయ్య ముఖంలోని విచారరేఖలు వీక్షిస్తూ.

"యింట్లో ఆడదానికి బాగోనేదు. సానా జొరంగావుంది. డాకటేరువచ్చి సూచిపోయిండ్రు కోపంతో."

"కోపం ఎందుకు"

"ఫీజు యివ్వనేదుట! ఫీజు."

"ఓహో అదా సమాచారం. అసలాళ్ళు డబ్బు యివ్వకపోతే సూడనేసూడరు. ఆ మందునీళ్ళన్నా యిధిలేక యిత్తున్నారు గాని."

"అయితే ఆడిచ్చేమందు మంచిదిగాదా?" అన్నాడు సందేహంతో.

"డబ్బు సేతిలోపడకపోతే ఆడు మందని, నీళ్ళె యిత్తాడు. వట్టినీళ్ళు! అళ్ళకెంత గడించినా సరిపోదు."

"అరె మరయితే యెనాగ? ఎంత పెద్ద జొరమొచ్చిందనుకుంటున్నావు."

"మరేటిసేత్తాం? ఆమద్దిన నా పిల్లోడికి జబ్బుచేత్తే యినాగే అయినాది. ఆడిచ్చిన మందుతాగి, పిల్లాడిపాణాలమీదికి తెచ్చాం. ఆఖరికి అప్పోసొప్పోచేసి డబ్బిత్తే సెమ్మదిగా బాగుచేసిండు. డబ్బు యెంతిబాగా గుంజుకున్నాడనుకున్నావ్. ఆ పని ఆళ్ళకు బాగా తెల్సునుల్నే, ఆ అప్పు యింకా తీరనేలేదు. కాబూలీ వోడికి వడ్డీ కడుతూనే వున్నాను. యేటోవడ్డీ కట్టడమే గాని అసలు తీరే యిసయమేతోచదు.

"అయితే యెనాగ. మాకూ నీళ్లే యిత్తాడంటావా?"

"నీకు నీళ్లిత్తే ఆడికేవన్నా నట్టమాయేటి, సెప్పు. తప్పకుండా నీళ్ళె యిత్తాడు. డబ్బిత్తేమందిత్తాడు. అప్పుచేసి యియ్యి డబ్బు."

"యేదో సెయాలమరి. అసలు యేటి సంగతి సెప్పు."

"యీ పక్కూరులో బండి బాగుసెయ్యాలట. అర్జంటు. పెట్టునిశానీ. యీ మొదటి బండికే పోవాల" అన్నాడు తను వచ్చిన పని మరచిపోయినందుకు కొంత ఆందోళన పడుతూ.

"యింటిదగ్గరసూత్తే యిదీ వరస. అయితే యెళ్ళక తప్పదంటావా" అన్నాడు భీమయ్య వేలిముద్ర వేస్తూ.

"తప్పుద్దా. యెళ్ళి తీరాల. నేకపోతే సాన సిక్కొచ్చిపడతాది. యెళ్ళక తప్పదు" అంటూ పుస్తకం మడిచి తనదారిన తనుపోయాడు.

భీమయ్య వేగంగా వంట ముగించి బండి వేళకు సరిగా తనతో రాబోయే పనివాళ్ళను స్టేషనులో కలుసుకున్నాడు. ఇంత ఆలస్యం అయిందేమంటూ ఉరిమాడు మేస్త్రీ. భీమయ్య కిక్కురు మనకుండా నిలబడ్డాడు. అందరూ బండి యెక్కారు పనున్న వూరు పోవడానికి. ఎవరికి తోచిన కబుర్లు వాళ్ళు చెపుతూన్నారు. భీమయ్య మనస్సంతా యింటిమీదనేవుంది. బండిలో ఓమూల కొదిగి కూర్చున్నాడు. పనివాళ్ళు రెండు మూడు సార్లు హెచ్చరించినా ముభావంగా ఊరుకున్నాడు. వాళ్లు కూడా యితని సంగతి అట్టే పట్టించుకోలేదు.

బండి సెమ్మదిగా రాత్రి పదిన్నరకు చేరుకుంది ఆ ప్రదేశం. అందరూ దిగారక్కడ. మేస్త్రీ ఉత్తర్వు ప్రకారం, అచ్చట చేయవలసినపని చురుకుగా సాగించేరు, భీమయ్య కూడా అందరితోపాటు ఎలాగో ఓలాగ పనిని లాగేస్తున్నాడు. చేయవలసిన పని రెండు గంటల రాత్రికి ఆఖరు అయింది. అప్పుడేవున్న తిరుగు బండిలో అందరూ యింటికి తిరుగు ప్రయాణం అవుతున్నారు.

మేస్త్రీ భీమయ్యాను పిలచి తెల్లవారే వరకూ అక్కడేవుండి, ఆ బండి బాగయినట్లు చూపించే కాగితాలు, తాఖీదులూ స్టేషను మాష్టరుగారివద్దనుండి పుచ్చుకుని తీసుకురమ్మన్నాడు. భీమయ్య తన పరిస్థితి తెలియజేసి మేస్త్రీని బ్రతిమాలుకున్నాడు. మేస్త్రీ భీమయ్య మాటలు నమ్మలేదు.

భీమయ్య మేస్త్రీకన్న చిన్న ఉద్యోగస్థుడు. పెద్ద ఉద్యోగస్థుడు తన క్రింద ఉద్యోగస్థునిమాట నమ్మడు. నమ్మలేదు. నమ్మబోడు.

బ్రతిమాలినకొద్దీ యితన్నే ఉండమని




మేస్త్రీగారి ఉత్తర్వు. తన ఊరివైపు పోయే బండిని, అందులో పోతూన్న తనతోటి పని వాళ్ళనూ చూస్తూ బాధగా నిలబడ్డాడు రాతి బొమ్మలాగ.

ఆకలి కొరుచిచ్చులా దహించేస్తోంది. చుట్టూ కారు చీకటిగా వుంది.

చీకటి నల్లదనాన్ని చూచి కొబోలు నవ్వు తున్నాయి, చుక్కలు తెల్లగా. రెండు మూడు సార్లు నక్కల మొఱుగులు, స్టేషను లోని ఉద్యోగుల సందడి తప్పించి అంతా నిశ్శబ్దం.

భీమయ్య బీడీ ఉండేమోనని జేబు తడుము కున్నాడు. బీడీ అయితే దొరికిందిగాని, అగ్గిపెట్టెలేదు. స్టేషనుకి పోడానికి వీల్లేదు. అధికారులుచూస్తే ఆ బండి వదలి వెళ్ళి నందుకు మందలిస్తారు. ఓ సారి లేచి నుంచు న్నాడు. తన బండికి ప్రక్కగా కొన్ని బళ్లు ఉన్నాయి. ఆ బళ్ళమధ్య సందుల్లో చీకటి మరింత భీభత్సంగా నాట్యమాడు తోంది.

భీమయ్య అటూ యిటూ పరికించి చూశాడు. అంతా అయోమయంగా, శూన్యంగావుంది, మరో రెండడుగులు ముందుకు వేశాడు. ఏదో నీడ తనవైపే వస్తూన్నట్లుంది ఆ చీకట్లో. భీమయ్య వళ్ళు జలదరించింది.

"ఎవరారు?" అన్నాడు భీమయ్య బిగ్గ రగా

"యెవరా. నేను చాకీదారుని." అని వినపడింది. అదేమాట ప్రతిశబ్దం దూరం నుండి మళ్ళీ వినపడింది.

"నిప్పుందాభాయీ" అన్నాడు రెండడు గులు ముందుకు వేసి భీమయ్య.

"ఎవరు నువ్వు" అన్నాడు గదమాయిస్తు న్నట్లు.

"నేనా? యీ ప్రక్క పాడై పడున్న బండి బాగుచేయడానికి వచ్చిన మణిషిని."

"ఓహో, యిందు, అగ్గిపెట్టె" అంటూ అగ్గిపెట్టె అందిచ్చాడు. భీమయ్య బీడీ ముట్టించాడు. భీమయ్య అగ్గిపుల్ల వెల్తురులో చాకీదారుముఖం చూశాడు. అతని వయస్సు సుమారు ముప్ఫయి అయిదు, నలభై సంవత్స రాలకి మధ్యలో వుంటుంది. అప్పటికప్పుడే ఆ ముఖాన్ని ముసలితనం ఆవరించింది.

రెండు గ్రుక్కల పొగపీల్చి ఆ నుంచున్న చాకీదారుని "కూర్చోభాయీ" అంటూ హెచ్చరించాడు భీమయ్య.

"ఏం కూర్చోడం! కూర్చుంటే పని జరుగుతుందా యేం?" అన్నాడతను పొర టుగా.

"అరే భయ్యా, యెప్పుడూ ఉన్న పనేగా మనకి. ఆ పని కంతూ లేదు. మనకు అన్నమూ లేదు" అన్నాడు భీమయ్య తన ఆకలి జ్ఞాపకం చేసుకుంటూ.

"యేటనుకుంటే ఏం లాభంలే. మన బతు కులు మనవే" అన్నాడు చాకీదారు నేల మీద చతికిలబడుతూ.

"అవున్లే! నామాట నూడు. నలభై మైళ్ళ నుండి రాత్రిరికి రాత్రి ఇక్కడికొచ్చి సచ్చి పడున్నా. యిది నా పనే. ఐతేమా త్తరం!" అన్నాడు భీమయ్య కూర్చుంటూ.

"ఎక్కడనుంచొచ్చావు?"

"ఈ పక్క రెండు టేషన్ల తర్వాతపూరు. మన బడాసాబు లుంటారు అడే. ఆ పక్క మూడో బండి నూడు అది చెడింది. దాన్ని బాగు సేయడానికి పదిమంది వచ్చాము. నా దరిద్రం కొద్దీ నన్నిక్కడుండమని మా మేస్త్రీ హూకుం. సచ్చినట్టున్నాను."

"మరి పని వున్నపు డుండాల్సిందే"

"పని సెయ్యడానికి భయపడతా ననుకున్నావేటి. పాణాలొగ్గేసి పనిసేత్తా. నా బతుకు బాగోలేదు భాయీ. యేనాంటి సిక్కులొచ్చాయో యేటి సెప్పడం," అన్నాడు భీమయ్య చీకట్లోకి చూస్తూ.

"ఏమైంది సెపుదూ" అన్నాడు చాకీ దారు.

"ఇంట్లో ఆడది సచ్చిసావులో వుంది. ఏదో జబ్బులు. అది కుదిరేట్టున్నట్టు కని పించడం లేదు. నూత్తే అంతా సినొళ్లు. ఆ డాకటరు డబ్బివ్వకపోతే మందివ్వడుట. వడ్డీకి డబ్బు తెత్తే, మనబత్తెం కాస్తా వడ్డీకి సరిపోతే ఆకలి కడుపూ, అప్పుతెచ్చిన అసలూ మిగుల్తాయి. అంతేనా," అన్నాడు మెల్లగా నవ్వుతూ భీమయ్య.

"మన బతుకులంతే."

"నిన్న మద్దేన్నం నుంచీ సరిగా తిండి లేదు. ఆకలి సంపేత్తోంది."

"యీపక్కనే దుకాణంవుంది ఏమన్నా కొనుక్కో."

"కొనుక్కోడానికో కాణీ వుంటేగా" అన్నాడు భీమన్న సిగ్గుతో.

"ప్చ్! నువ్వెందుకూ పనికిరావల్లే వుంది."

"ఏం" అన్నాడు భీమయ్య తెల్లబోయి.

"రాత్రల్లా యిక్కడే వున్నావా?"

"ఆ! యిక్కడేన్నె వున్నా."

"అరె నువ్వయితే పెరటిదారినే వున్నావు."

"ఏం" అన్నాడు భీమయ్య ఆశ్చర్యంతో.

"అంత ఆకలేత్తుంటే అలా వూరుకోవడ మేటి? ఎవడి నడిగినా యింత పడేత్తురు."

"వంట్లో యింత శక్తివుండి, ఆకలిగురించి అడుక్కోడం యేంటి. అది నావల్ల కాదు భాయీ."

"అరె భయ్యా, దీన్లో అడుక్కోడం యేటి? మేమంతా ఎవళ్ళం యేటి? నీతోటి పనోళ్ళమవునా? ఒక భాయిని మరోభాయీ అడగడం తప్పేటి?

"నిజం, తెలివితక్కువ సేశా. పోనీలే ఏం సేత్తాం."

"అయితే ఓ పని సెపుతా."

"యేంటది?"

"ఇదిగో ఆ రెండోలైనుంది నూడు."

"ఆఁ" అన్నాడు భీమయ్య.

"దాల్లో నాలుగోబండిలో సీని వుంది."

"సీనియా."

"ఆ సీనీ—సక్కెర. ఆ బండి క్రిందకు దూరు. ఆబండి అడుగున కన్నం వుంటుంది.

# ★ సంఘటన ★

దాన్లో నూలు కుక్కారు. ఆ," అన్నాడు చౌకీదారు.

"ఆ!" అన్నాడు భీమయ్య భయంతో. భీమయ్య గుండె దడదడ కొట్టుకుంది.

"కాస్త తీసుకుని యీ పక్క కొట్లో అమ్ముకుని 'చా' తాగు. యీ కొత్తపని నా బీటుండగానే సెయ్యి సుమీ. మరో డొచ్చీదారో వుంటే జైల్లో పడతావు. మరి ఎవరైనా పట్టుకుంటే నా పేరుసెప్పకేం?"

"అయ్యో బాబో అంతపనే" అన్నాడు భీమయ్య.

"అరె! ఇది అందరూ చేసేపనే. కొందరు అందరి ఎదురుగ్గా సేసినా బయంలేదు. కొందరు రహస్యంగా సేసినా పట్టుకుంటారు. పట్టుకోనంతవరకు భయం నేదు. నేనున్నా ఎళ్లు. యిలా బయం. బయం అని పడున్నావంటే నీ బతుకంతే."

"అరె బాబో! దొంగపనే" అన్నాడు భీమయ్య బెంబేలుపడి.

"లోతుకుపోయి సూస్తే అన్నీ దొంగపనులే. అధికారాన్ని బట్టి ఉంటుంది.

"అమ్మో నావల్ల కాదు."

"అరె భయ్యా! నీవల్ల కానిపను లెన్నో చేత్తున్నావు. సూడు—రోగంతో పడున్న పెళ్లాన్నొదిలి రావడం నీవల్లయ్యే పనే! ఎలా సేశావు. ఈ అర్ధరాతిరి యీ సీకట్లో దెయ్యంలా కాసుక్కూచోడం నీవల్లయ్యే పనే? అదే చేశావు. ఏం యెందుకు సేత్తున్నావు? తిండికోసం అవునా!

"ఆ" అన్నాడు భీమయ్య సందేహంగా.

"ఆ తిండికోసమే యీ పనీ సెయ్యి. నీకేం బయం నేదు. నువ్వేం మేడలు కట్టడానికి దొంగతనం సేయడం లేదు. ఎళ్లు బయం లేదులే" అన్నాడు చౌకీదారు.

భీమయ్య మాట్లాడకుండా వూరుకున్నాడు.

"ఏదీ, ఓ బీడీ యియ్యి" అని చెయ్యి చాచాడు చౌకీదారు. భీమయ్య యిచ్చిన బీడీ ముట్టించి "ఆ మరేం బయం లేదులే. యెళ్ళు యిదిగో యిలా సూడు. యెవరైనా వచ్చేనాగుంటే 'యీల' వేత్తాను. నువు నీ గాడీదగ్గరకు సల్లగా జారుకుని పడుకున్నట్టుండు. అంతే. మిగతా యిసయం నేజూసుకుంటాలే. నేపోతున్నా నీపని నువ్వు కానియ్యి" అంటూ చేతిలో లాట్టకర్ర వూపుకుంటూ పోయాడు.

భీమయ్య కాస్తసేపు అలానే కూర్చుండిపోయాడు. లైనావలకు వెళ్ళి అక్కడ కొట్టుతెరచి ఉందా అని చూశాడు. దూరానున్న పాకలోనుండి చిన్న దీపం మినుకు మినుకు మంటోంది. మెల్లగా రెండో లైనులోని నాలుగో బండిదగ్గరకు వచ్చాడు. లేని మొండి ధైర్యం తెచ్చుకుని దాని క్రింద దూరాడు. చౌకీదారు వర్ణించినట్లుగా ఉందో కన్నం నూలు కప్పబడి. పంచదార పట్టుకోడానికి తన దగ్గర సంచేదీ. "అరె ఏలాగ" అనుకున్నాడు. నిరాశగా యిటూ అటూ చూశాడు.

తను కప్పుకున్న గుప్పటి మాట జ్ఞాపకమొచ్చింది. తన తెలివి తక్కువ విచారానికి తనే ఆశ్చర్యపడ్డాడు. క్రింద దుప్పటి పరచి కన్నంలో ఉన్న "నూలు ఉండ" లాగాడు. బళ్ళున పెద్ద ధారకారింది. పట్టుమని పది నిముషాలలో ఆ దుప్పటి పట్టేటంత పంచదార పోగయింది. మళ్ళీ ఆ నూలు కుక్కాడా కన్నంలో పంచదార దుప్పట్లో మూటగట్టి. రెలు లైనులుదాటి దూరానున్న పాకవైపు చీకట్లో మాయమయ్యాడు.

భీమయ్య ఆ పాకదగ్గరకు పోయాడు. తలుపులు వేసున్నాయి. కాని కిటికీ సందులోనుండి దీపం కనిపిస్తోంది. ఆ కిటికీకి ఆ సందు ఆ దీపం కనిపించడానికే వదిలి ఉంటారనడాని కేమీ సందేహం లేదు. నెత్తిమీద బరువుతో క్రుంగుతూ వెళ్ళి తలుపుతట్టాడు. లోపల ఏవో గుసగుసలు వినపడుతున్నాయి. కొంచెం గట్టిగా తట్టాడు మళ్ళీ. లోపలనుండి "యెవరది" అని ప్రశ్నించారు.

"ఏవరూ లేదు. నేనే" అన్నాడు భీమయ్య వణకే గొంతుకతో. తలుపు తీయక ముందే.

"ఏమయినా తెచ్చావా" అని మళ్ళీ ఓ ప్రశ్న వినిపించింది.

"ఆ తెచ్చాను తలుపు తియ్యి ముందు" అన్నాడు భీమయ్య ధైర్యంచేసి.

తలుపు తెరవబడింది. భీమయ్యలోనికి అడుగుపెట్టాడు. తలుపు మూయబడింది కథలోలాగ. భీమయ్య ఖంగారు చూసి ఆ తలుపు తీసిన వ్యక్తి నవ్వుకున్నాడు. వాడు ఆ గదిలోనుండి మరో గదిలోనికి భీమయ్యను తీసుకుపోయాడు. ఓ మూల గోడకానుకుని ఉన్న ఓ పెద్ద బల్లమీద యిద్దరు వ్యక్తులు కూర్చున్నారు. భీమయ్యను చూడగానే ఒకతను చిరునవ్వు నవ్వుతూ "కొత్తవాడిలా వున్నావు" అన్నాడు. భీమయ్య నెత్తినున్న మూటదించి యిద్దరివైపు తేలిపారజూచాడు. "కొత్తవాణ్నే కాని పాతోణ్ణే పంపా డిక్కడికి" అని జవాబిచ్చాడు.

అంతలోనే తలుపు తీసిన వ్యక్తి, ఆ మూటను తీసుకుపోయి తూచేసి, పంచదార ఖాళీచేసి, గుప్పటిని భీమయ్యకిచ్చి, భీమయ్యను పలకరించిన ఆసామీతో 'ఒక మణుగు రెండు సేర్లని" చెప్పాడు. అతడు ప్రక్కనున్న డెస్కుపెట్టె సొరుగునుండి, రెండు పదులూ, ఒక ఐదు రూపాయీల నోట్లు తీసి భీమయ్యకు యిచ్చాడు.

బజార్లో పంచదార సేరు రు-౧-౦. భీమయ్యకే లెక్కలన్నీ తటలేదు.

పాతిక రూపాయిలు చేతిలో పడగానే బొడ్డులోతోసేసి ఆనందంలో పడ్డాడు. డబ్బుయిచ్చిన ఆసామీ ప్రక్కనున్న వ్యక్తి "యింకా యేమయినా తెస్తావా" అన్నాడు.

"మాత్తాను" అన్నాడు భీమయ్య ఆశ మనస్సులో పీకుతూంటే.

"యిదిగో చూడు తెచ్చేలావుంటే వేగం తెచ్చేయి. తెల్లారిపొతే లాభంలేదు. అప్పుడే నాలుగు అవుతోంది" అన్నాడు.

భీమయ్య మాట్లాడకుండా బయటకు నడిచాడు. మరో పడి అమ్మితే మరో పాతికవత్తాయనుకున్నాడు.

ఆకాశంలో బుధుడు బాగా ప్రకాశిస్తున్నాడు.

గబాగబా మళ్ళీ ఆ బండివైపు నడిచాడు. మొదటి కన్న ధైర్యంగానూ, మొదటికన్న యెక్కువగానూ పంచదార పట్టుకెళ్ళాడు.

(41-వ పేజీ చూడండి)

# శకునం

ఇందల లింగమూర్తి

నిన్న ఆవూళ్లో కొత్తసినిమా కొత్తగాకట్టిన హాల్లో రిలీజైంది. రాత్రి సినిమా చూచాడేమో చాలా బద్ధకంగా ఒళ్లు విరుచుకుని, కళ్ళు నులుపుకుని దిగాడు మంచంమీద నుండి ప్రసాద్. ఆరోజు తను మంచంమీద నుండిదిగగానే ప్రతిరోజూ తన యిల్లాలు యింటిపనంతా చక్కబెట్టి సంతోషంగా నవ్వుతూ కనిపించేది. కాని ఆనాడు 'మ్యావ్...మ్యావ్'మంటు భయంకరంగా మెరిసే కళ్ళతో "సుస్వాగతం" అంటూఎదురైంది పిల్లి. ప్రసాద్ పిల్లిని చూసి ఒక్కమారుగా వులిక్కిపడ్డాడు. ఏ ఆపద సంభవిస్తుందోననే భయం అతన్ని వెంటాడింది. చదువుకున్నవాడు అవడంచేత ఇటువంటివి అంతగా పట్టించుకోనకపోయినా ప్రశాంతంగావున్న అతని హృదయం నూరుమణుగుల బరువుతో నిండివుంది.

ఆరోజు క్షురకర్మ కావించుకుని, తలంటి పోసుకుని, గాలికిరేగే వెంట్రుకలతో ఆఫీసుకు త్రోవతీశాడు. అతడు గడపదాటగానే ప్రక్కవాకిట్లో పొరుగింటావిడ నిలుచుంది. ప్రసాద్ ఆమెను చూచి తలవంచుకుని "ఏమండీ! మారత్నం తెల్లవారుతూనే వాళ్ళ అన్నయ్యగారింటికి వెళ్ళినట్లుంది. రాగానే ఈ తాళాలు యివ్వండి" అంటూ ఆమెకిచ్చి వెళ్ళిపోతున్నాడు. ఆవిడ యితన్ని చూచి విరగబడి పకపకా నవ్వింది. ఆమె ఎందుకు నవ్విందో అర్థంకాలేదు. తను అసందర్భంగా మాట్లాడలేదే! ప్రసాద్‌కి ఆమెనవ్వు పిడుగుపడ్డంత భయంవేసింది. ధైర్యం తెచ్చుకుని ఆమెవంక చూశాడు. ఆమె ఆపుకోవాలన్నా సాధ్యంకానట్లు పకపకా విరగబడి నవ్వుతూనేవుంది. ఇదంతా అతనికి వింతగా కనిపించింది. ఆమెకు తనంటే ఎంతో అభిమానం, వీధిన వెళ్ళేప్పుడుకూడా తన్ని మన్మధుణ్ణి చూసినట్లుగా చూసే ఆవిడ, ఆరోజు అలా ఎందుకు నవ్విందో అర్థంకాలేదు. ప్రసాద్ మాట్లాడకుండా సాగిపోయాడు.

త్రోవలో ఎవరో కుర్రవెధవలజట్టు అవుపించింది. మామూలుగా తనను తప్పించుకొని గౌరవంగా వెళ్ళేవాళ్ళల్లా, ఆవేళ ప్రక్కనే నిలబడి ఎగాదిగాచూసి వడివడిగా పోతున్న ప్రసాద్‌కు వినిపించేట్లు చప్పట్లు చరిచారు. మెయిల్‌బండిలా వేగముగా టకటకలాడే గుండెతో, బరువుగా ఆఫీసుకువెళ్ళి పడ్డాడు. తను వచ్చేటప్పటికే ఆరోజు శెలవు కావడంవల్ల గుమాస్తాలంతా వాకిట్లో నిలుచునివున్నారు. రెవిన్యూమంత్రిగారు చనిపోయారు. శెలవు ఇవ్వాలని వైరువచ్చినదని అనుకుంటున్నారు. అంతా ఒక్కమారు ప్రసాద్‌నుచూసి తలఎత్తారు. ప్రసాద్ అందరికీ పరిచితుడే అయినా ఒక్కరూ వెంటనే మామూలుధోరణిలో పడలేదు. ఒకరి ముఖాలు ఒకరుచూసుకొని ప్రసాద్‌గురించి సాంకేతికంగా ఏదోచెప్పుకొని, లేనినవ్వు తెచ్చుకొని ఒక్కసారిగా చూశారు.

'నావైపు ఇంత ఇదిగా అంతమంది ఎందుకు చూస్తున్నారా?' అని తికమకపడి అర్థంకాక పరాసరి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. బంట్రోతుని పిలిచాడు. బంట్రోతు వచ్చి ప్రసాద్ చెయ్యమన్న పని చెయ్యకుండానే అతనిముఖంలోకి చూస్తూ నిలబడ్డాడు. వాడికి నవ్వటానికి మటుకు ధైర్యం చాలలేదు. లేకపోతే నవ్వునేమో?...

ఖాళీగావున్న ఆఫీసులో ఫైల్సుచదివి ఆచనల్లోవున్న బుర్రకి ఏమీతోచక, రేపు రాసుకుందాములే అనే ఉద్దేశంతో సాయంత్రం నాలుగింటికి వంటరిగా బీచ్‌రోడ్డుకు బయలుదేరాడు షికారుకు. త్రోవలో ఎవరో వెనకనుంచి చప్పట్లుకొట్టి పిలిచి విచిత్రంగా చూశారు. కాని ప్రసాద్ తన్ను కాదన్నట్లు ఒక్కక్షణంకూడా ఆగకుండా వెళ్ళిపోయాడు.

మంగలిషాపుదాకా వెళ్ళేటప్పటికి వాకిట్లో మామూలుగా తనకు క్షురకర్మచేసే మంగలి నిలుచుని సగౌరవంగా, 'ఎక్కడికి వెళ్లుతున్నారు?' అన్నాడు. ప్రసాద్ సమాధానం చెప్పేలోగానే అతని ముఖంలోకి చూసి మంగలి నాలిక కొరుక్కుని "రహస్యం చెప్పాలి, లోపలికిరండి"... అంటూ సంజ్ఞచేశాడు. ప్రసాద్ తడుముకోకుండా వెళ్ళాడు. మంగలి కళ్ళనీళ్ళపర్యంతమై,

"మీరు క్రొత్తగా ఉదయం ఫ్రెంచికటింగ్ మీసాలు పెట్టమన్నారు. పొరపాటున పనితొందరలో ఒక్కప్రక్కమాత్రం కత్తిరించాను" అన్నాడుభయంతో.

ప్రసాద్‌కు అతను చెప్పే మాటలు వింటూంటే తల తిరిగినట్లయింది. ఒకప్రక్క కోపం అగ్నిజ్వాలలా రేగుతోంది. ఆరోజు తన్ను చూసి అంతమంది ఎందుకునవ్వారో ఇప్పుడు తెలుసుకున్నాడు. ఆవేశం ఆపుకోలేక పళ్లుబిగపట్టి అవమానంతో క్రుంగిపోయి ఉదయపు పిల్లిశకునం తలుచుకుంటూ షాపులోకి దారిదీశాడు మీసంసరిచేసుకునేందుకు.





# ఆంధ్ర మహాభారతము

## ఆదిపర్వము - సప్తమాశ్వాసము

ఉ. ధరణీపతి ప్రతాపబలదర్పమునన్ విన సేన పెద్ద నె
వ్వారికిని నున్ భయంపడని వాఁడ భయార్త్తుఁడ నైతి నిన్ను నం
బురుహదళాయతాక్షి దయఁ గావుము నన్ను భవన్నిమిత్తదు
ర్భరతరపంచబాణహతిఁ బంచతఁ బొందక యుండునట్లుగాన్.

వ. నన్ను గాంధర్వవివాహంబున వరియింపుమనిన సంవరణునకుఁ దపతి యిట్లనియె.

క. భువనైకదీపకుం డగు, సవితృనకుఁ దనూజ నతియు సావిత్రికి నే
ననుజ నవినయవర్జిత, నవనీశ్వర వినుము తపతి యనుసురకన్యన్.

వ. నాయందు నీకుం బ్రీతి గలదేని మదీయజనకు నడుగుము నన్నిచ్చు నింతులకు స్వాతంత్ర్యంబు లేమి నీవెఱుంగుదువు గావె కావున ననవరతజపనియమప్రణిపాతంబుల నాదిత్యు నారాధింపుమని చెప్పి తపతి యాదిత్యమండలంబున కరిగె నంత సంవరణుండు మూర్ఛాగతుండయి పడియున్న నాతనియమాత్యుండు వచ్చి శీతలజలపరిషేచనంబు సేసిన మూర్ఛదేఱి యమ్మహీపతి మహాభక్తి నప్పర్వతంబున నుండి సూర్యు నారాధించుచు.

ఉ. ప్రతిహతరాగలోభభయుఁ బంకరుహప్రభవప్రభావు దూ
రితదురితున్ మునీశ్వరుఁ దరిష్ఠు వసిష్ఠమహామునిం బురో
హితు నతిభక్తితోఁ దలఁచె నిష్ట మెఱింగి వసిష్ఠుఁడున్ సమా
హితమతి నేఁగుదెంచి కనియెం బ్రభు సంవరణుం బ్రియంబునన్.

వ. ఇట్లు దలంచినమాత్రం దగుదివసంబునకు వచ్చి వసిష్ఠుం డవిరతవ్రతోపవాసకృశశరీరుండయి యున్నసంవరణుం జూచి యాతండు తపనసుత యయినతపతియందు బద్ధానురాగుండగుట తనయోగదృష్టి నెఱింగి.

ఉ. జగదభివంద్యుఁ డాఘృణిని సమ్మతి సంవరణప్రయోజనం
బాగ నొనరింపఁగా నియుత యోజనముల్ చని లోకలోచనుం
డగుదిననాథు నాతతసహస్రకరుం గని సంస్తుతించె న
త్యగణిత వేదమంత్రముల నమ్మునినాథుఁ డతిప్రియంబునన్.

వ. సూర్యుండు వసిష్ఠమహాముని నతిగౌరవంబున సంభావించి భవదాగమనప్రయోజనంబు సెప్పుమనిన వసిష్ఠుం డిట్లనియె.

సీ. అలఘుండు పౌరవకులశేఖరుండు సంవరణుఁ డన్వాఁ డనవరతకీర్తి
విదితుండు ధర్మార్థవిదుఁడు నీపుత్త్రికి, నగణితగుణములఁ దగువరుండు
గావున నతనికిఁ దేవిగాఁ దపతి నీ, వలయుఁ గూఁతులఁ గన్న ఫలము దగిన
వరులకు సద్ధర్మచరితులకీఁ గాన్ప, కావె నావుడు సూర్యుఁ డాదరించి

ఆ. వరుఁడు రాజవంశకరుఁడు సంవరణుండు, యనుగుణుండు దీని కని కరంబు
గారవమున నిచ్చె యాబుపిలోడఁ బుత్త్రిం జెఁ దపతి గురుకులాంచితునకు.

వ. ఇట్లొక్కనిమిషంబున మున్నూటయఱువదినాలుగు యోజనంబులు వఱచు నాదిత్యరథంబుతో నక్రమంబున నరిగి తపనదత్త యయిన తపతిం దోడ్కొనివచ్చి వసిష్ఠుండు విధివంతంబుగా సంవరణునకుం దపతి వివాహంబు సేయించెం గావున మహాత్ములయిన పురోహితులం బడసినరాజుల కభీష్టంబు లయిన శుభంబు లగుట నిశ్చయంబ యిట్లు సంవరణుండు మహోత్సవంబునం దపతి వివాహంబయి.

క. ఆతరుణియందుఁ జేతో,జాతసుఖప్రీతిఁ దగిలి శైలాటవులన్
వీతనృపకార్యధర్మ,వ్రాతుం డయి పదియు రెండు వర్షము లుండెన్.

వ. దానంజేసి మహీతలంబున కనావృష్టి యయిన నెఱింగి వసిష్ఠుండు శాంతిక పౌష్టికవిధు లొనరించి సంవరణుం దోడ్కొని హస్తిపురంబున కరిగిన నఖిలప్రజకు ననురాగం బయ్యె ననావృష్టిదోషంబునుం బాసె నంత సంవరణునకుం దపతికిం దాపత్యుఁడై కురువంశకరుండు కురుండు పుట్టె నదిమొదలుగా మీరును దాపత్యుల రయితి రని గంధర్వుండు సెప్పిన నర్జునుండు వెండియు నిట్లనియె.

క. నుతముగ నస్మత్కులభూ,పతులకు నాద్యులకుఁ బుణ్యభాగులకుఁ బురో
హితుఁ డయినవసిష్ఠుమహా,త్మతఁ జెప్పుము వినఁగ వలతు మది నేర్పడఁగాన్.

వ. అనిన గంధర్వుం డిట్లనియె.

క. ధృతి నెవ్వని నేని పురో,హితుఁగాఁ బుణ్యమునఁ బడసి యిక్ష్వాకు కులో
దితు లైనపతులు రాజ్యో,న్నతి నొప్పం జేసి రుర్వి నానాక్రతువుల్,

క. బల మఱి కామక్రోధం,బులు రెండు జయింపఁబడి తపోవీర్యబలం
బులఁ జేసి జేయునవి ని,చ్చలు నెవ్వని యేనిపాదసంవాహంబుల్.

సీ. శమహీనుఁ డైనవిశ్వామిత్రు చేసిన,యపకారమునఁ జేసి యాత్మసుతులు
యమసదనంబున కరిగిన వారలఁ, దనతపోవీర్య సత్త్వముల పేర్మిఁ
గ్రమ్మఱింపఁగ శక్తి కలిగియు వేల న,య్యంబుధి గడవని యట్ల శాంతుఁ
డయి యెవ్వఁ డేని కృతాంతకుఁ గడవంగ, నొల్లండ యట్టియత్యుగ్రతేజుఁ

ఆ. డగువసిష్ఠముని మహాత్మతఁ జెప్ప నా,యలవియయ్యె యనిన నవ్వసిష్ఠ
గాధిసుతుల కేమి కారణంబున నిట్టి, వైర మయ్యె నెఱుఁగ వలతు దీని.

## అంగారపర్ణుఁ డర్జునునకు వసిష్ఠుమహిమ సెప్పుట

వ. చెప్పుమని యర్జునుం డడిగిన గంధర్వుం డిట్లని చెప్పెఁ దొల్లి కన్యాకుబ్జంబున గాధిపుత్త్రుండు విశ్వామిత్రుండను రాజు నిరమిత్రంబుగా ధాత్రి నేలుచు నొక్కనాఁడు మృగయార్థం బరిగి యపారబలసమేతుం డయి ఘోరారణ్యంబునం గ్రుమ్మరి వడ వడి కడు డస్సి వసిష్ఠునాశ్రమం బాశ్రయించిన నమ్మునివరుండు విశ్వామిత్రు నతిప్రీతిం బూజించి వానికిని వానిసేనకు నభిమతంబు లైనయాహారంబులు గురియ నందిని యను తనహోమధేనువుం బంచిన నదియు.

క. ఘృతనదులును నోదనపర్వతములు దధికుల్యములు నవారితరసపూ
రితబహువిధోపదంశో,న్నతపుంజంబులును దక్షణంబునఁ గురిసెన్.

వ. ఇట్లు చతుర్విధాహారంబుల నందఱం దృప్తులం జేసి యున్న యానందినిం జూచి విశ్వామిత్రుండు విస్మితుం డయి యాత్మగతంబున.

మధ్యాక్కర. మృదురోమములును శంకునిభకర్ణముల్ మెత్తనివలుఁద
పొదుఁగును నిడుదచన్నులును గుఱుచ లై పొలుచుకొమ్ములును
సదమలశరదిందుశంఖనిభ మైన చాయయుఁ గలుగు
మొదవు విధి నిధి సేరినట్లు సేరె నిమ్మునికిఁ బుణ్యమున.

వ. అని పెద్దయుం ప్రొద్దు చింతించి తత్పరిగ్రహకుతూహల హృదయుండయి విశ్వామిత్రుండు వసిష్ఠున కిట్లనియె.

తే. దీనికంటెను నొప్పెడి వాని నొక్క,లక్ష మొదవుల నిచ్చెద నక్షయముగ
రాజ్య మయిన నిచ్చెద జగత్పూజ్య నాకు,నిమ్మునీహోమధేనువు నెమ్మితోడ.



# అత్తగారూ - జెట్ విమానయాత్ర

## భానుమతీ రామకృష్ణ

ఆ రోజే ప్రప్రథమంగా "జెట్" విమానంలో బొంబాయినుండి మద్రాసు వచ్చాం మావారూ, నేను. ప్రొద్దుటే ఏడింటికి బొంబాయిలో బయల్దేరిన వాళ్ళం పదింటికల్లా మద్రాసు వచ్చేశాం. ఇంటి కొస్తూనే మమ్మల్ని చూసి మా అత్తగారు ఆశ్చర్యపోయారు. తెల్లవారి ఆరుగంటలకు బొంబాయినుంచి ఫోనులో మాట్లాడిన మేము పదింటికల్లా యిల్లు చేరామంటే ఆవిడ నమ్మలేకపోయింది. ఇంకా అంతకంటేకూడా త్వరగా వచ్చే విమానాలు రాబోతున్నాయని చెప్తే "నిజంగానా!" అంటూ వివరాలు కొక్కుతున్నారు. ఆ తర్వాత మేం వచ్చిన ఆ కొత్తవిమానం ఎట్లా వుంటుంది, ఏమిటి, మొదలయిన వివరాలన్నీ ఒక్కొక్కటే అడిగి తెలుసుకున్నారు మా అత్తగారు.

"పోనీ నేనూ ఓసారి ఆ కొత్త విమానంలో రావా ఏమిటే" అన్నారు, మా అత్తగారు ఎంతో సరదాపడుతూ. వాళ్ళబ్బాయీ, మనవడూ ఒక్కసారి గొల్లున నవ్వారు.

"ఏమిట్రా నవ్వుతారు! ఏం నే ఎక్కలేననుకున్నారా విమానంలో?"

"ఎక్కొచ్చు. మళ్ళీ దిగిరావాలిగా!" అన్నారు మావారు.

"ఏం దిగిరాక? క్షేమంగా దిగిరావచ్చు. మీరంతా రాలా?"

"మా సంగతి వేరమ్మా. వయసు వాళ్ళం. భయ్యాలేదు. నీకు వయసయిపోయింది మామా. విమానంలో కొత్తగా నే సరా! విమానం పైకెళ్ళేప్పుడు ఒక్కొక్కసారి మాకే కడుపులో తిప్పుతుంది."

"ఎట్లాగూ! కడుపులో తిప్పుతుందీ! నేనప్పుడే అనుకున్నా. మరి తిప్పకేంజేస్తుందీ, గరుడ పక్షిలాగా అంతెత్తున ఎగుర్తూంటే."

"అది గరుడపక్షికంటే చాలా ఎత్తులో వెళుతుందమ్మ. యీరోజు మేం వచ్చిన విమానం పదినిమిదివేల అడుగులపైన వచ్చింది. యింకా ఎత్తుకెళ్ళే పెద్ద విమానాలున్నాయి," అని మావారు చెప్తూవుంటే మా అత్తగారు హడిలిపోయారు.

"ఓయమ్మ నాయనోయ్ ఎట్లాగూ! అన్నివేల అడుగులే! అంటే ఆకాశానికి దగ్గర దగ్గరన్నమాటా. యింకా అంతెత్తున వెళ్ళే విమానం కిందున్న వాళ్ళకేం కనిపిస్తుందిరా"

"కనిపించదు. మేఘాలపైన వెళుతుంది."

"ఎట్లాగూ! మరి మన యింటిపైన వెళుతున్నప్పుడు గరుడపక్షిలాగా కనిపిస్తుందేంరా" అన్నారు, సందేహం తీరని మా అత్తగారు.

"నాయనమ్మ, గరుడపక్షిని విడిచిపెట్టిలేదు నాన్నా "ప్లేన్" గరుడపక్షి" అని మా వాడు గరుడపక్షిమీద జాలి పడుతూ బొంబాయినుంచి మేం తెచ్చిన బొమ్మలు తీసుకుని మేడమీదికెళ్ళాడు.

"అసలు విమానం మన యింటిమీద వెళ్ళే ఎత్తుకు రావడానికి, యిక్కడికి యేర్పోర్టు [illegible] వుండుకుంచీ కొత్త కొత్తగా [illegible] వస్తుందట్రా కిందికి?" అన్నాను.

"అసలంతపైకి వెళ్ళమన్న దెవరు! కొత్త కొత్త మళ్ళీ దిగిరమ్మన్న దెవరు! మన యింటిమీద వెళ్ళినట్టు సొంతం [illegible] ఎత్తులో వెళ్ళకూడదూ!" అని నన్ను దబాయించారు మా అత్తగారు.

"ఎట్లాగమ్మా, మన యింటిమీద వెళ్ళంత కిందుగానే, దారో వచ్చే కొండలమీదకూడా వెళితే [illegible]" అన్నారు మావారు నవ్వుతూ.

"మరి అంతెత్తున పోతూంటే మరి కడుపులో తిప్పదుట్రా!" అన్నారు మా అత్తగారు.

"అచ్చే బాగా ఎత్తుకు వెళ్ళింతర్వాత ఏమీ వుండదు. కడుపులో తిప్పినా, వాంతులైనా ఎక్కేప్పుడూ, మళ్ళీ దిగేప్పుడే— పైకి వెళ్ళియతర్వాత మనింట్లో సోఫాలో కూర్చున్నట్లుంటుంది. విమానం వెళ్ళేది కూడా మనకు తెలీదు," అని మావారు చెప్తూంటే 'ఆ' అంటూ నోరు తెరుచుకుని విన్నారు మా అత్తగారు.

"ఒరేయ్—వినె నాయనా—నా [illegible] వగానే ఎక్కాలా విమానంలో..." అన్నారు మా అత్తగారు తెగించి.

# అత్తగారూ - జపాను యాత్ర

"ఆ, ఈ సంవత్సరం పరీక్షకెళ్ళకపోతే పై సంవత్సరం వెళ్తాడులెద్దూ. ఇంత పసితనంలోనే పెద్దచదువులు చదివి వాడేం చేయాలీంట" అన్నారు మా అత్తగారు, మనవణ్ణి వెనకేసుకొస్తూ.

"ఆ మాట మీ అబ్బాయి ఎదటనకండి. పూర్వకాలంవాళ్లు పిల్లల్నిట్లాగే చెడగొడతారంటూ ఉపన్యాసం మొదలెడతారు," అన్నాను.

"ఆ,వాడి ముఖంలెస్తూ. వాడికేం తెలుసు— ఒంటరిగా జపాను వెళితే వాడి తిండీతిప్పలూ చూసే వాళ్ళెవరుంటారక్కడ? ఎంతయినా పెళ్లాం పక్కన వెళ్ళినట్లుంటుందా!" అన్నారు మా అత్తగారు. నాకు నవ్వొచ్చింది.

"జపాన్‌లో చాలామంది ఆడవాళ్ళు వుంటారట. ఇక్కణ్ణుంచి వెళ్ళేవాళ్లందరి సౌకర్యాలూ వాళ్ళే చూస్తారట" అన్నాను.

"ఎట్లాగూ!" అంటూ మా అత్తగారు కీచుకీచుమంటూ నవ్వారు. "ఏమేవ్... జాగ్రతేవ్" అన్నారు నవ్వుతూనే.

"అబ్బే మీ అబ్బాయిని ఎక్కడికైనా నమ్మకంగా పంపించవచ్చులెండి. అక్కడి ఆడవాళ్ళు ఎవరూ నాలాగా పొరపాటు పడరు. తీరా అక్కడికి వెళ్లింతర్వాత మీ అబ్బాయి గుణమే మారకుండా వుండాలి," అన్నాను నవ్వుతూ.

"ఛీ నోర్ముయ్. వాడట్లాంటి వాడు గాడు. బంగారుతండ్రి. యింతకూ అక్కడి ఆడవాళ్లు మంచివాళ్లయి వుండాలిగాని"

"మంచి వాళ్ళే అంటున్నారు. మన దేశంలోలాగే సంసార స్త్రీలంతా భర్త ఏమన్నా అణిగీ, మణిగీ వుంటారట. యింగ్లీషువాళ్లలాగా అదేమంటే విడాకులిచ్చుకోరట."

"అట్లాగా! అయితే అంతా మన వూళ్లాగే నన్నమాట. చూడాల్సిన వూరే పోనీ నువ్వు వెళ్లకపోతే నన్నన్నా పంపవే జపానుకూ. అబ్బాయితో కూడా వెళ్లి చూసొస్తాను" అన్నారు.

"మీరా!" అన్నాను. నా గొంతులో ఏదో అడ్డు పడ్డట్లయింది ...."



"ఏమే నేను జపాను వెళ్ల గూడదా!"

"అబ్బే, వెళ్లగూడదని ఎవరన్నారు? వెళ్లచ్చు. కాని, ఒక్కటే చిక్కు. మీరు వెళ్లేటట్లయితే కొన్ని నెలలముందే 'పాస్‌పోర్టు'కు 'అప్లయి' చేసివుండాలి. దానికి చాలా గొడవ వుంది. ఎప్పుడంటే అప్పుడు, మన యిష్టంవచ్చినట్లు వెళ్ళడానికి లేదు. దూరాభారం," అన్నాను.

'అదేమిటే దూరాభారం అంటావూ!" అదేం ఇంగ్లాండు గనకనా!.. ఢిల్లీదగ్గర ఆగ్రావుందనీ, దానిపక్కనే జపాననీ అబ్బాయి నీతో చెప్తూంటే విన్నానుగా! అసలిన్నాళ్ళూ ఢిల్లీపక్కనే జపానుందని నాకు తెలీదు తిక్క మొత్తుకోళ్ళు," అంటూ పడీపడీనవ్వారు మా అత్తగారు. నేనెట్లా నవ్వేది! ఎట్లా నవ్వకుండా వుండేది!।

"ఢిల్లీపక్కనే జపానుందని మీఅబ్బాయి అంటుండగా విన్నారా, లేక మీరే అనుకుంటున్నారా,"అని అడిగాను.

'నేననుకోడం ఏమిటే నాతలకాయా. రేపు వాడు ఢిల్లీ వెళ్ళేముందో, ఢిల్లీనుంచో సిలోపూర్ వెళ్లాలన్నాడుగదూ!"

నామతిపోయింది. "సిలోపూర్ ఏమిటీ! సింగపూరా!" అన్నాను నవ్వాపుకుంటూ.

"ఆ, అదే అదే...ఇంకో పేరేదో చెప్పాడమ్మా" అంటూ తిలగొక్కున్నారు మా అత్తగారు.

"సిలోనా?" అన్నాను నేనే మళ్ళీ.

"ఆ ఆ... సిలోనా—సిలోనా...

"'సిలోనా' గాదు...సిలోన్"అన్నాను.

"ఆ ఏదోలే. మరి ఆ వూళ్లన్నీ చూడాలంటేకూడా 'ప్యాస్‌పోర్టు' కావాలంటే!" అన్నారు మా అత్తగారు. నవ్వాపుకోలేక చచ్చాను.

"ఆ. కావాలి" అన్నాను.

"అయితే మరట్లాగే. ఎట్లాగోట్లా రేపు వాడితోకూడా నన్ను జపాను పంపించే ఏర్పాటు చేయవే" అన్నారు నా చేతులు పట్టుకుని మా అత్తగారు. పాపం అనిపించింది.

"ఒకళ్లు పంపించడానికేముంది! మీరు అడగండి మీ అబ్బాయిని" అన్నాను.

"అబ్బే నా మాట వాడికోలక్ష్యమా! న్చ" అన్నారు మా అత్తగారు.

"మరి నామాటా అంతేగా!" అన్నాను.

"అదెట్లాగే! నీవిచ్చిగానీ. యీ కాలంలో తల్లిమాట ఎవరే ఖాతరుచేస్తారు. నువ్వు కాస్త గట్టిగా చెప్పకపోతే నేను జపాను వెళ్తాననడం వాడింకా ఎగతాళిగానే అనుకుంటున్నాడు," అన్నారు మా అత్తగారు. ఏం చెప్పేది.

యీ లోపుగా మావారే మళ్ళీ మేడ దిగొచ్చారు. ఆయన్ను చూడగానే నాకు నవ్వాగిందికాదు. అబ్బాయొచ్చాడు అడగమన్నట్లు మా అత్తగారు నాకు సౌంజ్ఞ చేస్తూ, నా చేతిమీద పొడించింది.

"ఏమండీ! ఢిల్లీ దగ్గిరున్న జపానుకట మీఅమ్మగార్ని తీసుకెళ్తారా!" అన్నాను.

"ఢిల్లీ దగ్గిరుండేమి జపానేటి!" అన్నారు మావారు.

"అదేరా యిందాకనువ్వన్నా!.. ఢిల్లీ వెళ్ళి ఏకంగా ఆగ్రామీదుగా జపానెడతాననీ," అని మా అత్తగారంటూంటే మావారు నవ్వుతూ, వాళ్లమ్మను కాసేపు ఏడిపించడానికి, "ఆ...అవునవును. అన్నాను," అన్నారు మావారు.

"మరింకేం! తిక్కముండనిజేసి మరీ ఏడిపిస్తావేమిటే" అంటూ నాబుగ్గ పొడిచింది మా అత్తగారు...నా అవస్థచూసి మావారు నవ్వారు...

"మీరేదో 'సిలోపూర్' వెడతారట!" అన్నాను కోతిలాగా పూరుకోకుండా.

"సిలోపూరేమిటే! సింగపూరు"

"అదేలెండి. మరి సిలోన్ మాటేమిటట? అందుకే రెండూకలిపి'సిలోపూర్ 'అన్నారు మీఅమ్మగారు 'షార్టు'కట్‌లో అన్నాను. మావారు నవ్వలేక ఆయాసపడిపోయారు.

"అబ్బ చాలు. చంపకండి. అసలు జపాను ఎటెళ్ళాలో ముందు నేనే మర్చిపోయానిప్పుడు" అన్నారు మావారు.

"అదేమిట్రా! అట్లామర్చిపోతే ఎట్లాగూ? ఆ వూరెటెళ్ళాలో బాగా తెలిసినవాళ్ళను అడిగి, జాగ్రతగా కనుక్కోరా. ఫలానా చోట దిగుతానని ముందుగానే విమానం తోలే డ్రైవర్‌తో చెప్పిపెడితేసరి. ఆవూరొచ్చేసరికి చచ్చినట్టు విమానం కిందికి దింపుకొస్తాడు" అని మా అత్తగారు చెప్తుతూంటే మావారు మళ్ళీ కడుపుబ్బనవ్వారు.

"ఏమిట్రా తిక్కన్నా, అంతచెటు నవ్వుతున్నావ్. అది సరేగానీ జపానిక్కడికెంత దూరంరా?" అన్నారు మా అత్తగారు.

"అబ్బే, దగ్గిరేనమ్మా - ఢిల్లీ పక్కనేగా" అన్నారు నన్ను చూసి నవ్వుతూ.

"మరి టిక్కెట్టెంతరా జపానుకూ?"

వలభైరూపాయల నాలుగు నయాపైసలు."

"నలభై రూపాయలే. అవున్లేమరి-ఢిల్లీ నగ్గరాయె. మాటలా. పైగా విమానం తోలేవాళ్ళు, విపరీతంగా టిక్కెట్టు ధర పెంచేసుంటారు. రైలుకంటే ఎక్కువ కావాలంటూ—కాస్త డబ్బున్నవాళ్ళని తెలిస్తే 'టిక్కెట్టు ధర మరి కాస్త ఎక్కువ జేస్తారేమో గూడా— అది సరేగానీ, నేను జపాను రావాలంటే అదేదో 'ప్యాసు' కావాలంటే. ఎమిట్రా

అదీ' అన్నారు మా అత్తగారు.

"అదా—గేటుపాస్సు—" అన్నారు మా వారు నవ్వుతూ—

"మరి ఆ 'పాస్సు' లేకుండా రానివ్వరా! ముసల్దాన్నిగా. నాక్కూడా ఎందుకురా పాస్సూ పూసూనూ! నువ్వు చెప్తే వింటా లేరా. ఎట్లాగోట్ల నన్ను కూడా జపాన్ తీసి కెళ్లరా చూస్తానూ!"

"నువ్వెందుకమ్మా జపానూ!-" అన్నారు మావారు నవ్వుతూ—

"చూట్టానికిరా! ఏం ఆడవాళ్ళు రాగూడదా ఏం!"

"రాగూడదు—అసలక్కడే ఆడ వాళ్ళెక్కువయి వస్తున్నారు—యింకా యిక్కణ్ణుంచికూడా ఎందుకూ!" అన్నారు మావారు.

"పోనీరా. ఆడవాళ్ళెక్కువుంటేనూ కళకళలాడుతూంటుంది—ఆడవిలేని యిల్లి ట్లాగే ఆడవాళ్లులేని దేశంగూడా అంతే—ఏమో నాయనా చూద్దామనుకున్నాను—ఎటూ నీ పెళ్ళాంగూడా రావడంలేదు గనక, తల్లిని నన్ను యినా తీసుకెళ్తే కాస్త దేశం నీ తిండీ తిప్పలూ చూసింపాన్నవు తాను. అట్లాగే జపానూ చూసొచ్చినట్లవు తుంది—" అని మా అత్తగారంటూంటే మా వారు యింక నవ్వలేక కుర్చీలో చేరబడ్డారు.

"యింతకూ జపానుకు రెల్లో వెళ్ళాలా! విమానంలోనే వెళ్ళొచ్చా!—" అన్నారు మా అత్తగారు.

"నీ యిష్టం అమ్మా—ఎందులోనైనా వెళ్ళొచ్చు—"

"రెల్లో ఎందుకురా ఎన్నోసార్లు వెళ్లాను గా!—విమానంలోనే ఒకసారి జపాను తీసికెళ్లరా—" అన్నారు మా అత్తగారు సంబరపడిపోతూ—

"సరే అట్లాగేలేమ్మా—రేపు ఢిల్లీ వెళ్లి తిరిగి యింటికి రావాల్సిన పనుంది—మళ్ళీ వెళ్ళేప్పుడు నిన్ను తీసుకెళ్తాలే—యీ లోపుగా నీ వంటసామాను అంతా గోతానికి వేసుంచు"—అన్నారు మా వారు భోజనానికి లేస్తూ—

"ఆ—అదెంత వంట సామాన్లా—గోతాంలో వేసి కట్టడం క్షణం పని—యింతకూ మరి కోడల్ని, అబ్బాయిని ఎప్పుడు తీసుకెళ్తావురా జపానుకూ!" అన్నారు మా అత్తగారు మున్మల్ని వెక్కిరించేస్తూ...

"యిదుగో...రేపు నువ్వు జపానువెళ్ళి వస్తానే వాళ్ళిద్దర్నీ తీసికెళ్తాను...దప్పి లేగా!..."

"ఆ...అదేమరీ...అపాటికి పిల్లవాడి పరీక్షలుకూడా అయిపోతాయిలే...మరి నువ్వుగూడా లేవ్వే భోజనానికి..." అన్నారు మా అత్తగారు లేస్తూ...

"అబ్బాయి భోంచేశాడా!" అన్నాను.

"ఆహా వాడూ నేనూ మీరొచ్చేముందే భోంచేశాం ... యింతసేపా!—మీరే పెంద రాళే ఓముద్దతినండి..." అంటూ వంటింటి వేపు వెళ్ళారు మా అత్తగారు...ఆమె అట్లా లోపలికి వెళుతూనే,

"యిదేమిటే మాఅమ్మకు జపానువెళ్ళాలనే పిచ్చిపట్టుకుంది!..." అన్నారు మా వారు నవ్వుతూ...

"అవునండీ పాపం...ముఖ్యంగా విమానంలో ప్రయాణంచెయ్యాలని ఆమె చాలా కాలంగా కలవరిస్తోందండీ.. పోనీ మీరు వెళ్ళేటప్పుడు తీసుకెళ్ళగూడదూ!..." అన్నాను చివాట్లుతింటానని తెలిసీ...

"నీకేం మతి, గితి పోలేదుకద! అన్నీ తెలిసివుండి నువ్వుకూడా మా అమ్మలాగా అడుగుతున్నావేమిటే" అన్నారు మా వారు నామీద కోప్పడుతూ...

"మరి పాపం ఆమెను తీసుకెళ్తానంటూ అబద్ధాలెందుకు చెప్పారు! నిజంగానే జపాను మనయింటిపెనకాల వుందనుకుం టోందండీ ఆవిడా..."

"ఆమె అట్లాఅనుకోడమే మనకు క్షేమం.. ఎందుకంటావా! జపానెక్కడుందో, ఎంత దూరంలోవుందో, తెలిస్తే ముందు నన్ను వెళ్లోద్దంటుంది...ఆమెకు తెలీనంతవరకూ మనం అదృష్టవంతులం...మనవాడు పుటి క్కిన చెప్పేస్తాడేమో కానప్పుడు... నేను వెళ్ళిందాకా జపాను ఢిల్లీ దగ్గిర అంటూండు..." అన్నారు.

"మరి అవిడొస్తానంటున్నారే మీతో కూడా..."

"కపటికి తప్పించుకున్నాగా! అట్లాగే జపానువెళ్లేరోజు యీలాగేఆలోచిద్దాంలే." అని మావారంటూండగానే భోజనానికి కేకేశారు మా అత్తగారు......

ఆరోజు అర్ధరాత్రివూట మావారూ నేనూ ఖంగారుపడుతూ లేచాం. పక్కగదిలో మనవడి మంచంపక్కన పరుపేసుకుని పడు కున్న మాఅత్తగారు గోలగోలగా కేకలేస్తూ ఏడుస్తోంది నిద్దట్లో—మాకంటే ముందే మా వాడు లేచి "నానమ్మా-నానమ్మా" అంటూ తట్టి లేపుతున్నాడు...యింకా ఏడుస్తూనే వుంది...మావారు వెళ్ళి ఆపళంగా వాళ్ళమ్మను లేవదీసి కూర్చోబెట్టారు.

"అమ్మా...అమ్మా.. ఏమైంది! ఎందుకట్లా కలవరించావు!" అంటూ వాళ్ళమ్మ భుజంపట్టి కుదిపారు. అప్పటిగ్గాని మాఅత్త గారు యీలోకంలో పడ్డారుకారు—ఒకసారి మాముగ్గుర్నీ ఎగాదిగాచూసి కండ్లు నులుపుకుంటూ—'ఛీ ఛీ వెధవకల' అన్నారు. మాఅత్తగారు ముఖం తుడుచుకుంటూ...

'ఏం కలొచ్చింది నానమ్మా!-రాత్రి నీకు 'టార్ జాన్ కామిక్స్' చదివి వినిపించానే అందులో 'టార్ జాన్'తో పోట్లాడిన సింహం ఏమన్నా కల్లో ఒచ్చిందా!..." అన్నాడు మావాడు వాడికొచ్చిన కలలాంటి కలే వాళ్ల నానమ్మకూడా వచ్చిందేమో ననుకుంటూ...

"అబ్బే-లేదురా. పగలంతా జపాను, జపాను అంటూ మాట్లాడుకున్నాంగదూ... నేనొక్కత్తెనూ విమానంలోకూర్చుని జపాను వెడుతున్నట్టే కల."

'ఎవరూ!...నానమ్మే!-జపానే! వెళ్ళడమే!...కంగ్రాచ్యులేషన్స్ నానమ్మా... కంగ్రాచ్యులేషన్స్" అంటూ మావాడు చప్పట్లుకొట్టి నవ్వుతూ వాళ్ల నానమ్మకు షేక్హేండిచ్చాడు...

"నువ్వుండు నాన్నా-అది సరేనమ్మా... విమానంలో వెళ్ళడం నీకిష్టమేగా!...మరి కేకలేసి ఎందుకు ఏడ్చావూ!..." అన్నారు మావారు.

"అదా...నేవెళ్ళే విమానానికి ఎదురుగుండా యింకోవిమానం ఒచ్చిందిరా...అదీ యిదీ ఒక్కసారిగా ఢీకొట్టుకోడం ఏమిటి కూర్చున్న కుర్చీలోసహా నేను బోర్లాబట్టం ఏమిటి...ఓయమ్మ తల్చుకుంటేనే భయంగా వుందిరా...అంతెత్తునుంచి, నేను కూర్చున్న విమానం రెక్కలు తెగిన జటాయువులా ఒక్కసారిగా కిందపడ్డదిరా.. యిహ చచ్చిపోతున్నాననే అనుకుని అట్లా కేకలేసి ఏడ్చారా..." అని మా అత్తగారు చెప్తుంటే మావాడు పొట్ట చెక్కలయేట్టు నవ్వుతూ,

# ★ అత్తగారూ - జపానుయాత్ర ★

"నానమ్మ యింతవరకు ఒక్కసారిగూడా ప్లేనెక్కలేదు యింతలోనే 'ప్లేన్ క్రేష్'... 'వాటే వండర్ ఫుల్ డ్రీమ్' నానమ్మా..." అన్నాడు.

"మరి యింక విమానంలో ఎక్కవన్న మాటేగామ్మా!" అన్నారు మావారు యీ దెబ్బతోనైనా వాళ్ళమ్మ విమానంలో జపానొస్తాననటం మానేస్తుందేమోనన్న ఆశతో...

"ఆ. పింగినాదంరా...ఏమిటో - కలలో వచ్చింది యిలలో జరుగుతుందా ఏమిటి!... అయినా ఎదురుగా విమానాలు రాకుండా కాస్త జాగ్రతగా చూసుకుని వెళ్తే సరి... అన్నారు మా అత్తగారు నిర్లక్ష్యంగా చప్పరిస్తూ...యింకేం మాట్లాడుతాం!...మావారు తెల్లబోయి నావైపు చూశారు...నాకు నవ్వొచ్చింది...

"సరే యిహవెళ్లి పడుకోండ్రా...పాపం అనవసరంగా మిమ్మల్నందర్నీ నిద్రలేపాను తిక్కముండని..." అంటూ నవ్వారు మా అత్తగారు...

"'నాన్నమ్మా' గోస్ టు జపాన్' అని ఒక పిక్చరు తీయాలి నాన్నా..." అంటూ మావాడు అల్లరి మొదలెట్టాడు...

"చాల్లే పడుకోరా తిక్కనాన్నా...పొద్దున్నే లేచి ప్రైవేటు మాస్టరింటికి వెళ్ళాల్లా వుంది" అంటూ మంచినీళ్ళు తాగడానికి లేచారు మా అత్తగారు...

అర్ధరాత్రి ఒకసారి మెలుకువొస్తే మళ్ళీ ఓపళంగా నిద్రబట్టడం కష్టం. అందుకు తగినట్టే మా అత్తగారి కల నన్ను హడలగొట్టింది...తెల్లవారి మావారు ఢిల్లీ ప్రయాణం పెట్టుకున్నారే అని మనసులో పిక్కుపిక్కుమంటం మొదలెట్టింది...ఆరాత్రంతా భయంతోనూ, దిగుల్తోనూ, కంటిమీద కునుకులేకుండా చేసింది మా అత్తగారి కల...

తెల్లవారి ఢిల్లీ వెళ్ళే ప్లేనుకు బయల్దేరారు మావారు. "ఎదురుగా వచ్చే విమానాల్ని కాస్త జాగ్రత్తగా చూసి పక్కకు తప్పుకుని వెళ్ళమని ఆ విమానం తోలే డ్రైవర్ తో చెప్పరా"...అంటూ కొడుక్కు భద్రం చెప్పింది మా అత్తగారు.

"విమానం తోలడం ఏమిటి నానమ్మా!... అదేం బట్కా అనుకున్నావా తోలానికి!" అంటూ మావాడు విరగబడి నవ్వుతూంటే మావారుకూడా నవ్వుతూ వెళ్ళి కార్లో కూర్చున్నారు.

ఢిల్లీ వెళ్లివచ్చిన మర్నాడే జపాన్ బయల్దేరారు మావారు..."మరి సామానేమిట్రా!" అన్నారు...పాత గోతానికి వంట సామానూ, మడిబట్టలూ వేసి మూతి కట్టిపెట్టి సిద్ధంగావున్న మా అత్తగారు. మావారు చిక్కులో పడ్డారనుకున్నాను.

"ఇదుగో నేనువెళ్ళి పంపిస్తానమ్మా విమానం...ఇప్పుడు నేనువెళ్ళే విమానంలో బొత్తుగా చోటులేదని నాకుమాత్రం ఒక్క టిక్కెట్టిచ్చారు" అంటూ తప్పుకున్నారు దొంగ. మా అత్తగారు పాపం నిజమేనని నమ్మింది.

"మరి ఒంటరిగా ఎట్టారా విమానంలో రావడం!" అన్నారు కాస్త విసుగ్గా మా అత్తగారు.

"మొన్నరాత్రి కల్లో వెళ్ళావుగదమ్మా ఒంటరిగా విమానంలో" అన్నారు మావారు నవ్వుతూ.

"ఛీ ఛీ. ఛీడకల...అట్టా ఎందుకు జరుగుతుందిలే".. అంటూ తనకొచ్చిన పీడకల తల్చుకొని భయపడిపోయారు మాఅత్తగారు.

"మరి ఎట్టారా, నేరావడం!" అన్నారు మా అత్తగారు.

"ఏముందమ్మా ... ఇక్కడ విమానంలో కూర్చుంటే జపాన్లో దిగడమే. దగ్గిరేగా. పైగా విమానంలో చాలామంది మనుషులుంటార్లే" అన్నారు మావారు నావైపు చూసి నవ్వుతూ.

"అయితే ఇంకేం!" అన్నారు కొడుకు మాటలకు తృప్తిపడ్డ మా అత్తగారు.

"అయితే మరి నానమ్మను తీసుకెళ్ళడం లేదా నాన్నా" అంటూవచ్చాడు లోపల్నుంచి మావాడు.

"ఇదుగో నేను జపాన్లోదిగి ఈ విమానం ఇట్లాగే పంపించేస్తారా నానమ్మకోసం."

"అరెరె! నానమ్మ క్వీన్ మేరీలాగా స్పెషల్ విమానంలో వెడుతుందన్న మాట."

"వెళ్ళకేంరా!...రేపు నువు పెద్దవాడివైనాక నాకోసం 'స్పెషల్' విమానంకొంటావేమో 'ఎవరు చూశారు'" అంటూ మనవడి బుగ్గలు సాగదీసి ముద్దు పెట్టుకుంది మా అత్తగారు...

"నేను పెద్దవాడిని అయిందాకా ఎందుకు నానమ్మా! యిందా - నీకోసం యిప్పుడే ఒక 'స్పెషల్' విమానం ప్రజంటుగా యిస్తున్నా తీసుకో..." అంటూ జేబులోంచి ఆడుకునే విమానం ఒకటితీసి వాళ్ల నానమ్మచేతులో పెట్టాడు...

"ఓరి తిక్కనాన్నా యిందులో ఎట్టారా వెళ్లేది..." అంటూ పడీ పడీ నవ్వారు మా అత్తగారు."

"మరి టైంఅయింది రా...బయల్దేరదాం" అంటూ లేచారు మావారు కారుదగ్గిరికి వెళ్ళడానికి."

"నేను రెడీనాన్నా..."అంటూ మావాడు వాళ్ళనాన్న వెనకాలే బయల్దేరాడు..."

"అదేమిట్రా పిల్లవాణ్ణిగూడా తీసుకెళ్తున్నావా జపానుకూ-!" అన్నారు మా అత్తగారు ఆశ్చర్యంగా.

"అవున్నానమ్మా - నాన్నతో నేనూ వెళ్తున్నా...మళ్ళీ రేపు నీకోసం 'స్పెషల్' విమానం పంపుతాడుగా నాన్న!... అందులో తిరిగి వచ్చేస్తాలే...వెళ్ళొస్తా నానమ్మా...టా-టా-చీర్ యో..."అంటూ వెళ్ళి కార్లో కూర్చున్నాడు వాళ్ళ నాన్నమ్మను ఏడిపిస్తూ..."

"నిజమేనా ఏమిట్రా!" అంటూ ఖంగారు పడ్డారు మా అత్తగారు."

"అబ్బే లేదమ్మా - నన్ను విమానం ఎక్కించి వాడొచ్చేస్తాడు- అందాకా తీసుకెళ్తున్నా...అంతే-" అంటూ మావారువెళ్ళి కార్లో కూర్చున్నారు...

మావారు జపానువెళ్ళిన వారంరోజుల తర్వాత ఒకరోజురాత్రి మళ్ళీ మా అత్తగారికి కలొచ్చింది... ఆమెకు కాస్తదగ్గర్లో పడుకున్న నేను వులిక్కిపడి లేచాను... నిద్దట్లో మా అత్తగారు పక పక పక నవ్వుతున్నారు...అత్తా అత్తా అంటూ తట్టిలేపాను...చివాలున లేచి కండ్లు నులుపుకుంటూ నన్ను చూశారు...యీ సారి మావాడు నిద్రలేవలా...మంచివేళ.

"ఏమిటత్తా నవ్వుతున్నారునిద్దట్లో!— మళ్ళీ ఏదైనా కలొచ్చిందా! అని అడిగాను.

"ఆ మళ్ళీ ఆ జపానే కల్లో వచ్చింది—" అన్నారు మా అత్తగారు ఆవులిస్తూ.

"అయితే యీ సారి కల్లో జపానువెళ్ళారన్నమాట...ఎట్లావుందత్తా జపానూ!..."

"ఆ-నా మొఖం నేనెప్పుడైనా చూశాను గనకనా!... నేనిప్పుడు కల్లోచూసిన జపాను మనకావలిదగ్గిర చాకిచెర్లలావుంది. చిన్నవూరే...మనుషులుమాత్రం మనం ఆ మధ్య బెంగుళూరునుంచి తెచ్చిన జపాను బొమ్మల్లాగానే వున్నారు."

"మరి ఎందుకట్లా పకపకనవ్వారు!" అన్నాను.

"అదా-" అంటూ మళ్ళీ నవ్వడం మొదలెట్టారు. "ఆ జపాను వాళ్ళంతా గోచీపెట్టి చీరకట్టుకున్న నన్ను విచిత్రంగా చూట్టం మొదలెట్టారే...అందులో 'కొందరా

(42-వ పేజి చూడండి)

# నక్షత్ర ఫలితాలు

[ 3-6-59 మొదలు 9-6-59 వరకు ]

## బి. నరసింగరావు

### గ్రహస్థితి.

| శ | | ర బు | |
|---|---|---|---|
| | తే 8 దీని బుధుడు మిధునములో ప్రవేశించును. మృగశిర కార్తె ప్రవేశము. మేష, వృషభ, మిధున కర్కాటకములలో చంద్రుడు. | | కు కే |
| శు | గు | | రా |

### * అశ్విని [చూ, చే, చో, లా] *

ఈవారము అనుకూలతకన్న ప్రతికూలత యెక్కువ. యత్నకార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తాయి. కోర్టుదావాలు అనుకూలిస్తాయి. పరోపకారానికి ప్రయత్నపడి పోగక నిందలు పొందుతారు. భార్యకు అనారోగ్యము కలుగుతుంది. ఇచ్చి పుచ్చుకునే పట్ల వివాదాలు ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడివున్నా తోటివారి సహకారము లభిస్తుంది. వారమంతా వర్తకులకు నిరాశ అయినా వారాంతమందు స్వల్ప అనుకూలత.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈవారము ఎన్ని అవాంతరములువచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. ఆశించినడబ్బు అందక అప్పు చేస్తారు. సోదరసహాయము కలుగుతుంది. ఆత్మీయులవల్ల నిందలు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, భూస్వాములకు, ఇంజనీరింగు శాఖ ఉద్యోగులకు, లోహపు సామానుల వ్యాపారస్తులకు కష్టముతో కూడినలాభము. 9 ప్రమాదసూచన.

### * కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ] *

ఈవారము మీకు యోగప్రదము. బంధువుల సహాయముతోనూ, అధికారుల సహాయముతోనూ, ఆటంకములను గడిచి ఫలంపొందుతారు. ఆదాయము అభివృద్ధి అవుతుంది. వైద్యజ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్యదిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది గణితశాస్త్రజ్ఞులకు కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. 3,4 తేదీలలో ధనలాభము, కార్యసిద్ధి.

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈవారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించిన సొమ్ము చేతికివస్తుంది. నూతనకార్యములు ప్రారంభిస్తారు. కోర్టుదావాలలో అనుకూలత వుంటుంది. పండితగోష్టి జరిపి నూతన విషయాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగములతో కూడి వుంటుంది. 3,4 తేదీలలో ధనలాభము. కార్యసిద్ధి, పుత్రులలాభాభివృద్ధి. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకూ మేలుగా వుంటుంది.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈవారము వినోదములలో పాల్గొనుట, దధిక్షీర మధురపదార్థయుక్త సుభోజనము రజతపాత్రములలో భుజించుట, నీటిపై ప్రయాణము చేయుట, తలచిన కార్యములలో జయము, తెల్లటి వస్త్రములు కొనుట మొదలగు యోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, బియ్యము, వెండి, ద్రవపదార్థ జనిత వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది. 5, 6 న అధిక ఖర్చులు, ఆందోళన.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము ధనధాన్యవృద్ధి, యత్నకార్యలాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తులాభము, పరోపకారమువల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. ఆప్తులతో విందు, వినోదము.

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

మీకు ఈ వారము కార్యభారముఎక్కువ. రాబడి తక్కువ. గృహావసరములు తీరనందున కలతలు, ఆరోగ్యము చెడుచున్నట్లు సూచనలు కనపడగానే ఔషధ చికిత్స పొందవలె. క్షేమే కాకుండా గ్రహరాజైన రవికి శాంతి చేయించుటమేలు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. రాజకీయవాదులకు స్వల్పానుకూలత. 5, 6 న అనారోగ్యము. 7, 8 పితృవర్గ సహాయము, ధనలాభము, ప్రయాణము.

### * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారముమీకుమిశ్రమయోగం. మొదట్లో నిరాశగావున్నా మిత్రసహాయంవల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువు సాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములున్నా మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, విచిత్రవస్తు సంపాదనవంటి శుభయోగములుకూడా కలవు.

### * ఆశ్లేష [డీ, డూ, డే, డో] *

ఈ వారము మీరు సహాయము పొందదలుచుకున్న వ్యక్తిమూలముగా కార్యహాని అవుతుంది. ధనాభావము ఎక్కువగా వుంటుంది. ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. ఆధ్యాత్మిక చింతవల్ల దైవముపై భారమువేసి కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వ్యాపారస్తులకు నిరాశ. విద్యార్థులకు మంచికాలము కాదు. పుణ్యక్షేత్ర సంచారము. దేవతాదర్శనము, విచిత్రములను చూచుట జరుగును. వారమంతా అవయోగ శుభయోగ మిశ్రమముగా వుంటుంది.

### * మఖ [మా, మీ, మూ, మే.]

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. యత్నకార్యములు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టుదావాలు అనుకూలిస్తవి. ఇతరులకు సహాయముచేయబూని సఫలముగాక నిందలు పొందుతారు. ఇచ్చి పుచ్చుకోవడములో వివాదములు వస్తాయి. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ; తోటివారి సహకారము వర్తకులకు వారమంతా నిరాశ. వారాంతమున మేలు. విద్యార్థులకు చదువు బాగా సాగదు. భార్యకు అనారోగ్యము.

 

# నక్షత్రఫలితాలు



### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### [మో, టా, టీ, టూ,]

ఈవారము ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యసాధన పొందుతారు. ఆశించినసొమ్ము సమయానికి అందక అప్పుచేస్తారు. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు లోహ, ఖనిజ, వ్యాపారస్తులకు కష్టముతోకూడిన యోగము, గనుల యజమానులకు, యంత్రములునడుపు నిపుణులకు ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు మేలు కాలము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

మీకు ఈవారము యోగకాలము. బంధువుల సహాయము, అధికారుల సహాయము కలుగుటచేత వచ్చిన ఆటంకములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. శాస్త్రప్రసంగాలలో బంధువులక్షేమవార్త తెలిసి సంతోషము పొందుతారు. విద్యార్థులకు ఉత్సాహముగా ఉంటుంది. గణిత శాస్త్రజ్ఞులకు కవులకు శిల్పులకు నటీనటులకు మేలుకాలం.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీకు మంచి భాగ్యయోగం. అనుకున్నడబ్బు చేతికివస్తుంది. ఇబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపు పొందుతారు. పిల్లల అభివృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము. ఉద్యోగస్తులహోదా పెరుగుతుంది.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము మీకు యోగదాయకము. ధనయోగము వుంటుంది. సంగీతసభలు, కవితాగోష్ఠివంటి వినోదములలో బంధుమిత్రులతో కలిసి పాల్గొని మృష్టాన్న భోజనము వెండి పాత్రలలో చేస్తారు. శుభకార్యములలో కూడా పాల్గొంటారు. నీటిమీద ప్రయాణము చేయవలసి వస్తుంది. నూలు, బట్టలు, బియ్యము, వెండి వర్తకులకు లాభము. విద్యార్థులకు వుత్సాహముగా చదువు సాగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలం.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారముకూడా గతవారము వలెనే యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభదాయకముగా ముగుస్తాయి. శుభ పుణ్యకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహ నిర్మాణమునకు ప్రయత్నాలు చేస్తారు. వాహనయోగము కలుగుతుంది. వుద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు విలంబగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగములతోకూడి వున్నా కుటుంబ కలహముచే ఆందోళన కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగం.

### * విశాఖ [తీ, తూ, తే, తో] *

ఈ వారము రాబడి తక్కువ, ఖర్చులు ఎక్కువ. కార్యభారముచే తీరుబడి వుండదు గృహావసరములు తీరక స్పర్థలు వస్తాయి. ఆరోగ్యము చెడుతున్న చిహ్నాలు కనపడగానే ఔషధచికిత్స పొందడము, రవికి శాంతి చేయించడము మంచిది. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు, వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. వారమంతా భయాందోళనలతో కూడివున్నా పితృవర్గ సహాయము కార్యలాభం ప్రయాణము కలుగును.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈ వారము నిరాశగా వున్నా అజ్ఞాత మిత్ర సహాయమువల్ల కార్యలాభం అవుతుంది. ఇంట్లోవున్న వారి ఆరోగ్యము చెడుటచే ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమందు లాభము వారమంతా ఉద్రేకంతోకూడి వుంటుంది. విదేశీయుల పరిచయము, అపురూపవస్తుసంపాదన వుంటవి. ఆత్మీయుల అనారోగ్యముచే వ్యధ, అధిక ఖర్చులు. విద్యార్థులకు చదువు బాగాసాగదు.

### * జ్యేష్ఠ [నో, యా, యీ, యూ,] *

ఈ వారము మీకు మిశ్రమ యోగము.

### —ఈ వారము ధరలు:—

నూలు, వస్త్రములు:– మార్పు లేదు.
నూనెదినుసులు:– తగ్గుదలలో వుండును.
ఆహారధాన్యములు:– సమస్థాయినుండును
బెల్లము, పంచదార:– చింతపండు:– మార్పు లేదు.
పప్పుదినుసులు:– తగ్గుదలలో వుండును.
వెండి, బంగారము:– స్వల్ప తేడాలో వుండును.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమును, కృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

ఆశించిన సహాయము లభించక, అవసర ములు తీరక అశాంతి కలుగుతుంది. అయిననూ ఈశ్వరానుగ్రహమువల్ల కష్టములు గడిచి కార్యసిద్ధిపొందుతారు. వర్తకులకు చాలాకాలంనుండి నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ. పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతివున్నా నష్టద్రవ్యలాభము పొందుతారు.

## * మూల [యే, యో, బా, బీ] *

ఈవారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ఇచ్చిపుచ్చుకునేపట్ల వివాదాలు వచ్చి మనోవ్యధ కలుగుతుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలించినా ఆ సంతోషము అమిత ఖర్చులవల్ల వుండకుండాపోతుంది. భార్యకు అనారోగ్యము కలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభయోగము. ఇతర జాతులవల్ల గౌరవము కలుగుతుంది. 9 న భార్య ఆరోగ్యభంగము. అధిక ఖర్చులు.

## * పూర్వాషాఢ [బూ, ధ, ఫా, డా] *

ఈవారము ఎంత ప్రయత్నించినా యత్నకార్యములకు ఆటంకములు కలుగుతునే వుంటవి. అయిననూ పట్టుదలతో కార్యలాభము పొందుతారు. సోదర సహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, లోహ, ఖనిజ, వ్యాపారులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు మేలు కాలము. 9 న ప్రమాదభయం అర్చులధిఖక.

## * ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ] *

ఈవారము మీకు యోగదాయకము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధనలాభము కలుగుతుంది. ఈశాన్యదిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది. శుభకార్యములలో పాల్గొంటారు. బంధుదర్శనము కలుగుతుంది. గణితజ్యోతిషశాస్త్ర చర్చలు జరుపుతారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచువర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలుకాలము. 5, 6 న అధికఖర్చులు, ఆపైన ధనలాభము.

## * శ్రవణము [జూ, జే, జో, ఖా] *

ఈవారము మీకు శుభయోగము. ఆశించినసొమ్ము చేతికివస్తుంది. ఇంట్లో శుభకార్యాలకు ప్రయత్నములుచేస్తారు. పుణ్యకార్యాచరణ, శాస్త్రచర్చలు, ప్రభుత్వసన్మానము వంటి యోగములు జరుగుతవి. విద్యార్థులు నూతనాంశాలను నేర్చుకుంటారు. ఇంట్లో వున్నవారి ఆరోగ్యము బాగుపడుటచే ఆందోళన తొలగుతుంది. పిల్లల క్షేమలాభముల కొరకు కొన్నియేర్పాట్లు చేస్తారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈవారము మీరు తలపెట్టిన పనులలో జయముపొందుతారు. బంధుమిత్రులతో మృష్టాన్నభోజనము చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. విద్యార్థులకు చదువు ఉత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి బియ్యము, ద్రవపదార్థజనితవస్తువుల వర్తకులకు లాభదాయకము. ఏటిమీద ప్రయాణము చేయవలసి వస్తుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలు కాలము.

## * శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈవారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధి వుంటుంది. వివాహాది శుభకార్యాలోచనలు ఫలప్రాప్తి పొందుతాయి. ఇష్టవస్తులాభము, పరోపకారమువల్ల కీర్తి కలుగుతాయి. విద్యార్థులకు చదువు చురుకుగ సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు ఎక్కువలాభము కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగదాయకము.

## * పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] *

ఈవారము కార్యభారము ఎక్కువ. వింతమాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ప్రయాణము, ధనలాభము వుండును. అకాల భోజనమువల్ల అనారోగ్యము కనపడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. విద్యార్థులకు చదువు బాగా సాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత. 5,6 న అనారోగ్యము, ఆపైన శుభయోగము, కార్యసిద్ధి.

## * ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

ఈవారము యత్నకార్యములకు అలస్యము. వర్తకులకు లాభము తక్కువ. ఆత్మీయుల ఆరోగ్యము చెడుటచే చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వనపర్వతప్రాంతములకు బదిలీ అయేసూచనలున్నవి. రహస్యములు కనిపెట్టుటకు వినియోగించబడతారు. వారమంతా చికాకుగావున్నా వారాంతమందు అజ్ఞాతమిత్రుని సహాయమువల్ల కార్యసిద్ధి జరుగుతుంది.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము ధనాభావము ఎక్కువ. ఎవరి సహాయమువల్ల కార్యసాధన చేదామనుకున్నారో వారివల్ల ఆటంకములు కలుగుతాయి. అయినా ఈశ్వరానుగ్రహంవల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వర్తకులకు, నిరాశ విద్యార్థులకు మంచి రోజులు కావు. వారమంతా ఆందోళనగావున్నా సజ్జన సాంగత్యము, పుణ్యక్షేత్రసంచారము, దేవతాదర్శనము, నష్టద్రవ్యలాభము కలుగును. ★

---

ఇంగ్లీషుమేష్టారు కోపంతో గజగజ వణికిపోతూ: "ఏ మాయ్ సుబ్బారావ్! ఏమిటి నీ ఉద్దేశం? ఈ ప్రశ్నకి ఇంత దారుణమైన ఇంగ్లీషులో సమాధానంరాశావ్?"

సుబ్బారావు భయంతో గజగజ వణికిపోతూ: "డిక్షన్నని మక్కీకి మక్కీ దింపేశానండి, అంతే."

మేష్టారు: "అఫ్ కోర్స్, చాలా మంచి స్టయిల్లో ఉందనుకో..."

---





# ‘ఆర్పే’ వారూ ఓదార్పేవారూ

“ఎందుకు తల్లీ! ఏడుస్తున్నావు?”

“పోనయ్యా, నీకెందుకు! ఆరుస్తావా! తీరుస్తావా! అక్కరకొస్తే మొక్కుతావా!”

“అదేమిటి పిల్లా! ఆరుస్తానూ, తీరుస్తానూ అక్కరకొస్తే మొక్కుతాను. చెప్పు”

పూర్వకాలంలో ఎప్పుడో ఏ యిద్దరి మధ్యనో జరిగిన సంభాషణాశకలం యిది. పాపం! ఓ చిన్నదానికి—అందులోనూ ఒంటరిపడుచు — కష్టాల మీద కష్టాలు వచ్చింది. స్వతహాగా శాంతమూర్తి. కాని భరించరాని కష్టం వచ్చింది. చెప్పుకుందాం అంటే నా అన్నవాళ్లు లేరు. ఏం చేస్తుంది! రోడ్డుకి ఓ ప్రక్కగా ఓ చెట్టుకిందచేరి సావకాశంగా మనసుదీరా ఏడుస్తోంది. అదారినే ఓ పుత్రాడు—మొగకెట్టేలాటివాడు పోతున్నాడు. అతడు మంచితనానికి మారుపేరు. లోకోద్ధారకుడు. అందులోనూ ఈ [illegible] కంజాతుడు. అందుకే కలకంఠి కంఠంనుంచి వెలువడ్డ ఆవేదనాపూరిత గానం వినేసరికి అతనికడుపు తరుక్కుపోయింది. ఇలాటి వాళ్ళని ఇంగ్లీషులో ‘ది గుడ్ సమరిటన్’ అంటారు. తెలుగులో దయాస్వరూపుడు అనుకుందాం. ఇది పూర్వకాలం సంగతి అని చెప్పేసుకదా! అదే ఈ కాలంలో అయితే కేమని హేండ్ బాగ్ లోంచి విజిల్ తీసి, అవసరంగా దుర్దశలో ఒంటరిగానున్న చిన్నదాన్ని పలకరించిన నేరానికి జైల్లో పెట్టించి ఉందురు. అమాటకొంగాని మొత్తం మీద పెనచెప్పిన చెంటన్న మనవాయాం వచ్చేసరికి సామెతగానూరి ఊరుకుంది. అందులో కొంకనూడా మార్చాయించబడ్డట్టు గా అనుమానం. దాని మనమేంచేస్తాం? కాలం అలా ఉంది. ఎవర్నీ నమ్మలేం. (నాకుమటుకు మనసులో నమ్మాలనే ఉంటుంది సుమండీ) తీరా నమ్మి మన రహస్యం చెప్పేశాక (ఓడ్-) ఆర్పడానికి బదులు (ఉన్న కొంపకూడా) ఆర్పేస్తే ఏంచేస్తాం చెప్పండి?

* * *

ఇంతకీ అసలే-బాధలు ఓదార్చేవాళ్ళని- నిజానికి ఈ ఓదార్పడం దశమష్టి కళల తరువాత రాదగినది. అరవై అయిదోది. అంటాం, ఆర్పేవాళ్ళు ఓదార్పేవాళ్ళని ఆర్పేస్తారు. సారిపోతే పేరుపోతుంది. అంచేత ఈ రెండిటికీ దూరంగా నిలబడి మధ్య నోటారి చేసుకుని జాగ్రత్తగా దాటెయ్యాలి ఈ వైతరిణి అందుకే నేనంటాను ‘ఓదార్పాంగశాల’ ఒకటి ప్రత్యేకంగా దీనికోసం పెట్టాలి. ‘ఓదార్ప

(వకుళవహాల-విశాఖపట్నం)

నీయం’ గ్రంథాలు వ్రాయబడాలి. ఈ విషయంలో నేనే పెద్ద ఉపన్యాసం యివ్వగలను కాని, అటువిమ్మట పత్రికలకీ, పత్రిక యజమానులకీ రాగల కోపం నేను ఆర్పలేను. రెండోకవోట ఈ ‘ఓదార్పడను’ నే క్రియా విశేషమే ఒక కష్టంగా రూపొందుతుంది. అప్పుడు మనకి “జగమెవ్వనిచే జనించునో” ఆ దీనావనుడే శరణ్యం.

## అర్హతలు

వల. ఈ విద్య మద్దార నేర్పిస్తే-నేర్వడానికి ఉండవలసిన క్వాలిఫికేషన్స్, అను గుణ గుణాలేమిటి? ప్రప్రథమంగా దీనికి కళాశాలా విద్యలనవసరం. మాస్టర్ ఆఫ్ ఆలోచనా వ్యాసంగం అయితే బెస్టు. అవంత సహృదయతకూడా ఉండొచ్చు, ముచ్చుకి. ఓర్పు లేకపోయినా ఫరవా లేదు. ‘ఆర్పే’ మాట సందర్భానుసారంగా వాడే నేర్పుండాలి. (ఈ మాట పైన పేర్కొన్న పాఠశాలలో నేర్పవలెను అండ్ నేర్పబడును-మరా.) ఈ ఛాప్టర్ లో ఇంతే సంగతులు.

ఇప్పుడు ఉదాహరణకి ఒకటో రెండో మచ్చులు వివరించుకుందాం, ఈ సీజనులో మనకి తాజా తాజాగా అచ్చులోంచి వచ్చే మచ్చు “పరీక్ష-యిచ్చిన-విద్యార్థి,” ఈ “పరీక్షార్థి” అయిదోక్లాస్ అయినా అవొచ్చు ఆనర్స్ ఫైనలియర్ అయినా అవొచ్చు, ఇవి చూడండి. లీలామాత్రంగా మీకు జ్ఞాపకంఉన్న ఒక పరీక్షార్థిని కనిపిస్తుంది. ఆ అమ్మాయి ఏ పరీక్ష కెళ్ళిందో సరిగ్గా జ్ఞాపకం లేదు. పైగా పరీక్షాఫలితాలు వచ్చేరోజులువచ్చేయి. ఆ అమ్మాయి ‘అంత బాగా వ్రాయ లేదని’ (అసలే ఎవరేజి స్టూడెంటు) అభిజ్ఞవర్గాలవారు అనుకుంటున్నారు. మీకుమటుకు ఏమీభయం అక్కర్లేదు. చూడగానే ఒక చిర్నవ్వు నవ్వండి. “ఎన్నాళ్ళకి ఎన్నాళ్ళకి” అని ఆప్యాయంగా అనండి. ఆ అమ్మాయి మొహంలో నీడలూ జాడలూ కనిపిస్తే పరీక్షలగురించే ఆలోచిస్తున్నట్టులెక్క. (ఈమధ్యకాలంలో ఎలాటి ప్రమాదమూ జరక్కపోతే-జరిగినట్టు మీకు తెలియకపోతే.)

## పరామర్శల పరీక్ష

అప్పుడు అడగండి “పరీక్షలు అయిపోయేయా?” అని (పరీక్షార్థులకి - మామూలు -

# బట్టలెలా ఉతకాలి?

"చాకలి వచ్చాడు పద్దు చూడవే" అంది అమ్మ. వాడు బట్టలు తీస్తూవుంటే నేను ఆదుర్దాగా నా చీర తీసిచూశాను. నాకు యిష్టమయిన ఆకుపచ్చచీర, రంగు వెలవెలబోతూ నల్లని జీడిమరకలతో ప్రత్యక్షమయ్యేసరికి, చాకలివాణ్ని నమిలిమింగేద్దామన్నంతకోపం వచ్చింది. వాడు ఎప్పుడు అంతే. వేయక, వేయక వేస్తే పాడుచేయటమో, పారేసుకురావటమో చేసుంటాడు. అసలు పాతవి, యింట్లోకట్టుకునే చీరలు తప్పిస్తే క్రొత్తవి వేయనేవేయను. సాధారణముగా అన్నీ యింట్లోనే వుతుక్కుంటాను. ఆచీర రైలుప్రయాణములో చాలా మాసిపోయిందని, వేసేటప్పుడు వాడికి చాలా చాలా చెప్పేశాను. కాని ఏం లాభం? పాడుచేసి తీసుకువచ్చాడు. ఆ రోజునుండి నా చీరలు చాకలికి వేయటం మానివేశాను.

అసలు చాకలికి బట్టలువేస్తే త్వరగా చినిగిపోతాయి. రంగు ఉన్నవి వెలిసిపోతాయి, లేనివి క్రొత్తరంగులతో వెలిగిపోతుంటాయి. రంగుబట్టలు, నూలు, సిల్కు, వులెన్‌బట్టలు వుతికేవిధము వేరువేరుగా వుంటుంది. చాకలివాళ్ళు ఏంచేస్తారంటే అన్నిరకముల బట్టలు ఒకేసారి భట్టీలోవేసి వుతికివేస్తారు. దీనివల్ల సిల్కు, వులెన్ బట్టలు త్వరగా చిరిగిపోవటం జరుగుతుంది. అంతేకాక బండలకేసి బాదుతారు. ఒక్కొక్కసారి యిస్త్రీ చేస్తూ బట్టలు అక్కడక్కడ కాల్చివేస్తుంటారు. కొందరు చాకలివాళ్ళు బట్టలు అద్దెకిస్తుంటారు. అందువల్ల క్రొత్తరకం వ్యాధిక్రిములు మన యింట్లో ప్రవేశించే అవకాశము గలదు. ఇంకొకవిషయము, చాకలికి వేస్తున్న బట్టలు చూడండి! మందముగావున్నవి రానురాను పల్చగా అయిపోతాయి.

ఈ బాధలన్నీ తప్పించుకోవాలంటే మన బట్టలు మనం యింట్లోనే వుతుక్కుంటేనే శుభ్రం. చాలాకాలం మన్నుతాయి. మురికి పోయి శుభ్రముగావుండటమేగాక మనం వుతుక్కున్నామన్న తృప్తికూడా వుంటుంది.

అయితే యింట్లో బట్టలెలా వుతుక్కోవాలి?

నూలు, సిల్కు, రంగుబట్టలు ఎలా వుతకవలెనో కొన్ని పద్ధతులు చెప్తాను. మొదట నూలుబట్టలు తీసుకుందాం. ఈ నూలు బట్టలు వుతకటం చాలా తేలిక. ఏవిధముగా వుతికినా పాడవవు. ప్రతిరోజు విడిచిన బట్టలు, ఒక్కొక్కదానికి సబ్బురాసి

## బాదబాధ

మనల్ని బాధించే మరోవ్యాధి ఎదుటివారి ఆరోగ్యం. ఇంగ్లీషులో "హలో" "గుడ్ మార్నింగ్"కి మనం వాడే తెలుగుపదం "ఏమండీ బాగున్నారా?" అని. "ఆఁ బాగున్నా. మీరో?" అంటే చిక్కులేదు. కాని, ఆ 'బాగున్నా'లో స్వరభేదం జాగ్రత్తగా పరీక్షించండి. అది నీరసంగా అనొచ్చు. ఆయాసంగా అనొచ్చు. విచారంగా అనొచ్చు.

"ఏం బాగులెండి. పెద్దవాడికి పడిశం. మూడోదానికి నాలుగురోజుల్నుంచి జ్వరం. నాకు 'బెడ్ ఫ్లైవర్' (!) ఆయనకి హార్ట్ సిక్ కేస......" ఇలాటిదానికికూడా జవాబేమీ లేదు—మొహం బాధగా పెట్టడమూ మనవే కదిలిస్తుందనుకోండి. "విపరీతమయిన తలనొప్పి తలబద్దలుచేస్తోంది. అప్పుడుఆస్ప్రీ దగ్గర్నుంచీ ఏపీసి టాబ్లెట్సదాకా నోటికొచ్చినట్టు చెప్పొచ్చు. ఇలాటి అవసరాల కోసమే మనకి పౌరశిక్షణక్లాసులో ఫస్ట్ ఎయిడ్—ప్రథమచికిత్స గురించి చెప్తారు. కాని ఇవన్నీ ఆ అమ్మాయికికూడా తెలుసు. ఇవన్నీ అప్లైచేసే ఉంటుంది. (నేనూ ఊరికే కాలక్షేపం కోసం చెప్పాను.)

## తిరుగుబాటు

ఈమాత్రం సలహాలతో ఆ అమ్మాయి టాపిక్ మార్చేస్తే సరేసరి. అలాకాకుండా ఇంకా మీ మొహంవేపేచూస్తూ వుంటుంది. అప్పుడు మీరుచెప్పండి—'భోజనం వేళకి చెయ్యకపోతే తలనొప్పివస్తుంది. అసలు ఆకలివేసే వస్తుంది. కళ్ళజోడు కావాలేమో లేక మార్చాలేమో, జలుబులుచేసినా తలనొప్పివస్తుంది...'ఆ అమ్మాయే అఖరికి అంటుంది."నాతలనొప్పికిమందు లేదులెండి." అని అప్పుడుమీదేవిజయం. ఇవన్నీ 'తలనొప్పి' అని మీరు అనుకుంట అప్పుడు వెంటనే 'అంతేనండీ. నాక్కూడా - తలనొప్పి వేసేస్తుంది. అంతేగాదు. మా యింట్లో మా తమ్ముడికీ, అమ్మకి, చిన్నన్నయ్యకి, చిట్టిగాడికీ, కమలకీ విమలకి....." కావలిస్తే పందెం వేస్తా, ఆ అమ్మాయి టాపిక్ చేంజ్ చేస్తుంది.

## డెడ్ ఎండ్

మరొకటి ముఖ్యమైన సమస్య ఉంది. ఈ సమస్యకి సొల్యూషన్ నాక్కూడా తెలీదు. ఉదాహరణకి మీకు దగ్గర చుట్టం ఆవిడ లేక ఆయన అంటే మీకు చాలా యిష్టం—ఆస్పత్రిలో ఉన్నారనుకోండి. మీకు ఎలా వెళ్ళాలో తెలీదు ఏ పట్టు చీరో కట్టుకుంటే 'పెళ్ళికొచ్చావా?' అని అడుగుతారు. సాదా చీరె కట్టుకుందాం అంటే మరోక బాధ. ఆ చుట్టం దగ్గరున్న వ్యక్తి అమంగళకరంగా కనిపించకూడదనే అభిప్రాయంతో కొత్త చీరతో మల్లెపూలతో కళ్ళకాటుకతో మీకు ఎదురుసన్నాహంవస్తుంది. సరే, ఎలాగోలాగ ఈ ఎదురుసన్నాహం పూర్తి అవుతుంది. ఇహ ఏమని పలకరించడం (నిన్న బాగులేదట) ఇవాళ ఎలా ఉంది? అంటే అవాచ్యం, "ఆయనని ఎప్పుడు డిశ్చార్జి చేస్తారు?" అంటే "ఇప్పుడప్పుడే చెయ్యరుట" అని జవాబు—అది చెప్పడానికి చాలా బాధపడడం. అందుకే తప్పనిసరి పరిస్థితులోనైతే "ఇలా చంద్రమ్మగారింటికి వెళ్తూ వచ్చేను. నిన్న డాక్టర్ కనిపించి సుళువుగానే ఉందన్నారు. అయినా పైవాళ్ళ గొడవలే కాని ఇలాటవేం చేస్తాయి (అది ఎంత పెద్ద జబ్బు అని తెలిసినా సరే)"—అని గబగబ అప్పచెప్పేసి వచ్చేస్తాను. మీకు తెలిస్తే చెప్పండి ఏదైనా దారి. ★

వుతకటానికి చాలా టైంపడుతుంది. ఎంత సబ్బయినా చాలదు.

వేడినీళ్లు ఎక్కువగానే ఒక బాల్చీలో తీసుకుని, తగినంత బట్టలసోడా అందులో వేసి బాగా కలిపి, నూలుబట్టలు ఆ నీళ్ళలో ఓ అరగంట నాననివ్వాలి. తర్వాత ఉతికి ఆరవేయాలి.

చాలా మాసిన బట్టలయితే ఒక పెద్ద వెడల్పాటి గిన్నెలో నీరు తీసుకుని పొయ్యిమీద వుంచి, సబ్బుపొడి, కొద్దిగా బట్టలసోడా వేసి మరగనిచ్చి, అందులో బట్టలు వేసి అరగంట తర్వాత దించాలి. పొయ్యిలో సన్నసెగ వుండాలి. సోడా వుపయోగిస్తే బట్టలు చిరిగిపోతాయంటారు. కాబట్టి సోడా వుపయోగము కొద్దిగా తగ్గించాలి. సోడా లేకుండా సబ్బు నీటిలో బట్టలు ఉడకబెట్టవచ్చు.

మామూలుగా సబ్బుపెట్టి వుతికే బట్టలు మొదట వేడినీటిలో తడిపి, సబ్బురాసి వుతికితే త్వరగా మురికిపోతాయి.

నూలుబట్టలు వుతికేటప్పుడు చొక్కాలయితే చేతులు, కాలర్ల దగ్గర చేతితో రుద్ది రెండు, మూడు, దెబ్బలు వేయవచ్చు. బొంబాయి, పూనాసైడు దెబ్బలు వేయటానికి చెక్క (మొద్దు) ఉపయోగిస్తారు.

వుతికిన తర్వాత తెల్లబట్టలకి నీలిమందు వేయటం మంచిది. నీలిమందువల్ల బట్టలకి ఓ విధమైన మెరుపు వస్తుంది. నీలిరంగు కలిపిన శుభ్రమైన నీటిలో వుతికిన తెల్లబట్ట ఒక ముంచుముంచి లేవనెత్తాలి. చాలాసేపు వుంచితే బట్టలకి రంగు అంటుకుంటుంది. అందుకని అంటీఅంటకుండా మాత్రము తీయకండి. బట్టలు ఆరవేయునపుడు, తెల్లని బట్టలు బాగా ఎండతగిలే స్థలములో రంగుబట్టలు నీడలో ఆరవేయాలి. రంగు బట్టలు ఎండలో ఆరవేసిన, రంగు వెలిసిపోయి, మెరుపు పూర్తిగా తగ్గిపోతుంది.

వాయిల్, ప్రింటెడ్ గాని, పల్చటినూలు చీరలు కట్టుకున్నప్పుడు వంటికి అతుక్కుపోయి, నడుస్తున్నపుడు కాళ్లకి బంధాలు పడుతుంటాయి. కాటన్ చీరలకి 'గంజి' పెట్టటం మంచిది. అన్నం వార్చినగంజి అరకప్పు తీసుకుని, సగం బకెట్టు శుభ్రమైన నీటిలోపోసి బాగా కలపాలి. ఏ చీరలు, శుభ్రముగా వుతికినతర్వాత, గంజినీళ్లలో ఒకొక్కటి ముంచి చీరఅంతట సమముగా అంటేట్లు, జాడించి తీయాలి. గంజిపెట్టిన చీరలు గట్టిగా పిండకూడదు. చీరలు, జాకెట్లు, పిల్లల బట్టలకి, గంజిపెడితే చక్కగా, క్రొత్తబట్టలవలె, నలిగిపోకుండా వుంటాయి. బట్టలకి గంజిపెట్టి, ఇస్త్రీచేస్తే బయటికి వెళ్లేటప్పుడు కట్టుకొన్న బావుంటాయి.

సిల్కు బట్టలు వుతుకునప్పుడు జాగ్రత్త అవసరము. మరచికూడ సిల్కు బట్టలకి సోడా వేయటం, దెబ్బలు వేయటం కూడదు. సిల్కు బట్టలకి లక్స్‌పొడి, లేక ఏదైన సబ్బుపొడి వుపయోగించటం మంచిది. బకెట్టులో వేడినీళ్లు తీసుకుని, అందులో సబ్బుపొడి వేసి, బాగా నురుగువచ్చేవరకు కలబెట్టి, అందులో బట్టలు 15 నిముషాలుంచి, గుంజి వుతికేయాలి. వీటినికూడ గట్టిగా పిండకూడదు. కొయ్యకు తగిలించి నీరు ఓడిన తర్వాత ఆరవేయాలి. ఖరీదైన జార్జెట్టు చీరలు అసలు పిండకుండా, కొయ్యకివుంచి ఆరగట్టితే ముడుచుకొనిపోవు, మామూలు జార్జెట్టయితే ఇస్త్రీ చేసేవరకు మామూలు సైజుకిరావు.

మరొకవిషయం బట్టలు వుతికేముందు రంగుబట్టలు, సిల్కు బట్టలు, నూలుబట్టలు వేరు వేరుగాచేసి వుతకాలి. మరచి పోకూడదు. ముఖ్యమైనది మరొకటి ఉంది. బట్టలు మరీ మాసి నాశనం అయేదాకా తొడుక్కోకూడదు. కొద్దిగా మాసిన బట్టగానే విడిచెయ్యాలి. అలా అయితే బాగా ఆటివస్తాయి.

బట్టలు ఇస్త్రీ చేయునపుడు జాగ్రత్త అవసరము. ఆరిన బట్టలమీద నీళ్లు చల్లి, నలిచి ఇస్త్రీచేయాలి. రంగుబట్టలకి నీళ్లు చల్లకుండా ఇస్త్రీ చేయాలి. లేకపోతే మరకలు పడినట్లు అవుతాయి.

ఇంట్లో ఇస్త్రీపెట్టె లేనపుడు, వుతికిన బట్టలు ముడతలు లేకుండా మడిచి, పరుపు క్రిందపెట్టి పడుకుంటే, చక్కగా ఇస్త్రీ అయిపోతాయి. రోజు యింట్లో కట్టుకునే చీరలకి ఇస్త్రీ అవసరములేదు.

స్వెట్టర్లు, వులెనువి మొదట కుంకుడు కాయరసములో నాననిచ్చి, తర్వాత సబ్బు రాసి వుతికితే శుభ్రపడుతవి. వీటిని పిండకుండా, ఆరగట్టాలి ఇస్త్రీ చేయకూడదు.

సి. రాధ.



# వనితా వాణి



బి. వి. కామేశ్వరిగారు వ్రాసిన "తిరిరి యిసుమున..." అన్న వ్యాసం చాల బాగుంది. మూర్ఖత అనే జబ్బులోపడి బాధపడుతున్న వారికి అది మంచి చిట్కాలా పని చేస్తుంది. సాధారణంగా మూర్ఖత్వం చదువు, లోకజ్ఞానం లేనివారిలో నేగాక మంచి మేధావంతుల్లోగూడ వుంటుంది. అట్టివారిమధ్య మసలుతున్న మనం, కామేశ్వరిగారు చెప్పినట్లు ఎంత నేర్పుగ వర్తిస్తే అంత మంచిది. లేకపోతే మనంకూడ వాళ్ళలో జమ అవుతాము.

మద్రాసు, నవనీతం.

* * *

"తిరిరి యిసుమున..." అను వ్యాసములోని విషయాలు బావున్నాయి. అవి చదువుతుంటే, మన పూర్వీకులు నిర్దేశించిన ఆచారాలను (కొన్ని మాత్రమే) అర్థం చేసుకోకుండా పాటించడంకూడా ఒక విధమైన మూర్ఖత్వమేనా అనిపించింది. మాకు తెలిసిన ఒక పెద్దావిడ వున్నారు. ఆవిడ వంటచేసేందుకు ఓ 80 సం॥రాలలో ఏనాడూ ఉతకని పట్టుబట్టను ధరించేది. అది చూడటానికి ఎంత అసహ్యంగావుండేదో చెప్ప లేము.

నెల్లూరు, అర్. మణి.

* * *

తిరిరి యిసుమున అను వ్యాసము బి. వి. కామేశ్వరీగారు చాలబాగా వ్రాశారు. వారికి నా ధన్యవాదాలు వనితాలోకముద్వారా తెలుపగోరతాను.

డోకిపర్రు, వి. శేషారత్నం.

ములమంచిలి, జి. జగన్నాథం.

* * *

చిలుకూరు శ్యామలాంబగారు 'మహారాజశ్రీ మామగారికి' అను వ్యాసములో చదువుకొనవలెనన్నడి ఉత్సాహముగల స్త్రీలు, 'నూతన విధానమున' తాము పెండ్లి చేసుకొనబోవువారు తమవిద్య సర్వనాశనము కాకుండా యుండుటకు తెలియజేసినారు. లేదా చదివినంతమాత్రమున, తన దురభిప్రాయమును మార్చుకొని, 'అతను' చదువుకొనుటకంగీకరించాడంటే, అతడు నిజముగ శ్లాఘనీయుడే..."తిరిరి యిసుమున" అన్న వ్యాసము సోదాహరణయుక్తముగ నున్నది. పెద్దవారిని మూర్ఖులని ఎప్పుడూ తిట్టుతూ వుంటే మన మూర్ఖత్వమును బూజువుపరచుకొంటూ వున్నామన్నమాట కొంతవరకు యదార్థము.

నెల్లూరు, .అర్. సీత.

* * *

శ్రీమతి భార్గవి (మద్రాసు) సన్నబడటానికి మార్గం... తెలుపుడుకూ పుణ్యం వుంటుంది" అన్నారు. ఈ వచనమెందుకో నా మనస్సులో నాటి, లావుపాటివారిమీద జాలి, అడిగిన తీరు నవ్వును పుట్టించినవి.

లావుగాగాని, సన్నగాగాని వుండడం వారివారి వంటితీరునుబట్టి వుంటుందని నా నమ్మకం. ఎందుకనగా నేను, మా అక్కలు నలుగురు స్వతహా సన్నగా వుంటాం. మేమంతా ఎంత ప్రయత్నించినా, ఎన్ని టానిక్కులు త్రాగినా, ఎంత ఆహారము బలవంతాన్న త్రింగినా లావుమాత్రం కాలేదు. సన్నటివాళ్ళు లావుఅవుట, పొడుగువాళ్ళు పొట్టిఅవుట కష్టము. (రెండోది నిజానికసాధ్యం అనుకోండి) లావాటివాళ్ళు గాలి త్రింగినా లావౌతారు. సన్నటివాళ్ళు కొండలు త్రింగినా బలవరు. అని మా చిన్నతనంలో ఒక టీచరు అంటూ వుండేవారు. కాని లావుగా వుండేవాళ్ళు కొన్ని వుపాయాలవల్ల కొద్దిగా పౌనులు బరువుతగ్గి, బలము మాత్రము తగ్గకుండా చూచుకొనవచ్చును.

లావుపాటివాళ్ళు చాలా కష్టపడి, తిండి తగ్గించి వుపవాసాలు చేస్తూవుంటారు. ఉపవాసాలవల్ల నీరసించెదరు కాని సన్నబడరు. వారు పాలు, నెయ్యి, పప్పు మొదలగు క్రొవ్వుగల పదార్థములను తగ్గించివాడుట రోజు సాయంత్రాలప్పుడు షికారువెళ్లి నడవగలిగినంతదూరం నడవటం మంచిది. లావుగానున్న వారికి కొద్దిదూరం నడవగానే ఆయాసంవచ్చి, చెమటలుపోయును. అందుచేత మానివేయుటగాని, ఒకరోజే బాగా 5, 6 మైళ్ళు నడిచి బాగా సన్నపడాలని ఆశగాని పడరాదు. రోజు, ఒకటి ఒకటిన్నర మైళ్ళు నడచి, క్రమముగా దూరం ఎక్కువ చేయుటం మంచిది. ఆటలు ఆడుట, ఆసనములు వేయుట చేయవచ్చునుగాని అవి మనలాంటివారికి సాగవని నా తలంపు.

భోజనములోకూడ మార్పు తేవలెను. రాత్రులందు గోధుమరొట్టెలు కాయగూరతోగాని, మాంసపుకూరలతోగాని తినుట మంచిది. (పూరీలు వద్దు) గోధుమ హెచ్చుగా వాడుటవల్ల శరీరమునకు బలముచేకూరి భుక్తాయాసము, కడుపునిండుగావుండి పనిచేయలేకపోవుట, బద్ధకము, తగ్గును. వళ్ళు తేలికపడును. మామూలు చేసేపనులుగాక, ఎప్పుడు అటు, ఇటు తిరిగేపనులు చేయుచుండవలెను. వీటివల్ల పూర్తిగా కాకపోయినా, కొద్ది లావుతగ్గి బలముగా వుండవచ్చును. ఈ విధముగా చేసిన మా స్నేహితురాలు యిప్పుడు కొద్దిగా సన్నపడింది.

కాని లావయ్యేమార్గం ఏదైనా వనితాలోకం పాఠకులకు తెలిస్తే తెలుపుదురూ, మీకు చాలా పుణ్యం ఉంటుంది!!

నాగార్జునసాగరు డాము, పి. సీతామదన్.

సంగీతం నేర్చుకోవాలంటే అనే వ్యాసం చాలా బాగుంది.

ఖరగ్ పూర్, క. లీల.



మద్రాసు - రాజా అన్నామలై హాలులో మే17వ తేదీ ప్రదర్శితమైన 'వరవిక్రయం'లో శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు రచించిన "బాధామయమే" అనేపాటతో ప్రేక్షకుల ప్రశంసలుపొందిన గాయకుడు శ్రీ యం. నరసింహం.



# ★ సంఘటన ★

(24 వ పేజీ తరువాయి)

ఈసారి మూడు పది రూపాయీల నోట్లు దొరికాయి. మరోసారి పట్టుకొడితేనప్పమేమి టనిపించింది. మళ్ళీ మరో మూట, మరో రెండు పదులు రొంటిని దోపాడు. రూపాయీలనోట్లు ఒత్తుగా మెత్తగా శరీరానికి తగుల్తున్నాయి.

భీమయ్య పాకలోంచిఅడుగు బైటపెట్టాడు. దూరాన్నుంచి కోడి అరుపు వినపడుతోంది. భీమయ్య భయంతో వణకుతూ నడుస్తున్నాడు. తప్పడయితే అటూ, యిటూ చూస్తున్నాడు. అనుమానం తట్టి దుప్పటి చాల్లసార్లు గట్టిగాదులిపాడు. మూతి మూడు సార్లు తుడిచాడు. తన బండి దగ్గరకువచ్చి రొంటునున్న రూపాయీలు లెక్కెట్టేడు. రెండు పదులు ఒక వైపూ మిగతా డబ్బు మరో వైపూ దోపాడు రొంటిని. దుప్పటి పరచిపడుకున్నాడు ఆకాశంలోకి చూస్తూ. ఈల వినిపించింది. కళ్ళుమూశాడు భీమయ్య. హృదయం దడదడ కొట్టుకుంటూంది.

చాకీదారు వచ్చాడు. మామూలుగా "ఎవరారు" అన్నాడు. భీమయ్య దొంగ చూపుచూశాడు. చౌకిదారు నిలబడ్డాడు తూకంగా. చుక్కల కాంతిలో అతని ముఖంలో చిరునవ్వు కనిపిస్తోంది.

"నేను" అన్నాడు భీమయ్యకూర్చుంటు.

"బాగుందా" అన్నాడు చాకీదారు.

"బాగుంది" అన్నాడు భీమయ్య రొంటిని విడిగాపెట్టిన రెండు పదుల కాగితాలు పైకి లాగుతూ.

"యేటి సంగతి"

"ఇయిగో నీసలవ్వల్ల రెండు పదులు సంపాయించా" అన్నాడు నవ్వుతూ భీమయ్య.



"అంతేనా" అన్నాడు చాకీదారు డబ్బంటే లెక్కలేనట్లు.

"అది చాలు భాయీ, అట్టే సెయ్యడానికి ధైర్యం చాల్లేదు."

"అరే! నువ్వెందుకు భయపోతావు. అంత భయందేనికి. నేనున్నాగా."

"యిరవై రూపాయలు! మాటలా" అన్నాడు భీమయ్య నెమ్మదిగా.

"అరె నీ పెళ్ళాం జబ్బుకే చాలదు. యేటింతభయం!" అన్నాడు చాకీదారు.

"యిదే చాలు. యీపదీనువు తీసుకో. ఈ పదీ నాకుంటాయి," అంటూ భీమయ్య చాకీదారుకి పది యియ్యబోయాడు. భీమయ్య అమాయక ముఖం చూసి చాకీదారు కొస్త చలించేడు.

"చూడు భాయీ, యీడబ్బు నువ్వు పాణాలమీద ఆశవదలుకు గడించుకున్నది. నాకొద్దు నీపెళ్ళాం జబ్బుకు దుర్చుకో దీంతోటి" అన్నాడు చాకీదారు. భీమయ్య యెంత బ్రతిమాలినా 'ససేమిరా' తీసుకోలేదు. భీమయ్యను మందలించాడు కూడా. భీమయ్య అతని ప్రవర్తనకి ఆశ్చర్యపడ్డాడు.

తెల్లవారుతోంది. వెలుతురు చీకట్లు మసకగా మాట్లాడుతున్నాయి. "తెల్లవారింది. నాడ్యూటీ అయింది. నేపోతా దయవుంచు" అంటూ పోయాడు చాకీదారు. భీమయ్య చేతుల్లో రూపాయినోట్లు అల్లాగే పట్టుకుని నిర్ఘాంతపోయి చూస్తున్నాడు. కొంత దూరంవెళ్ళి చాకీదారు వెనుదిరిగి చూచి భీమయ్యకు ఆరూపాయిలు దాచేయమని సౌంజ్ఞచేసి వెళ్ళిపోయాడు తనకూ అతనికీ యేమీ సంబంధంలేనట్లు చాకీదారు వెళ్ళిపోగానే భీమయ్య రూపాయినోట్లు దాచుకుని కూర్చున్నాడు.

బాగా తెల్లవారిపోయింది. మొఖం చేతులు కడుక్కుని ఎనిమిది గంటలకు స్టేషను మాష్టరు గదిలోకి వెళ్ళేడు. మాష్టరుగారికి తన సంగతిచెప్పి కావలసిన కాగితాలుయిమ్మన్నాడు. స్టేషనుమాష్టరుగారు అవసరమయిన కాగితాలు భీమయ్యకు యిచ్చేశారు. సరిగ్గా టైముకు భీమయ్య వూరుపొయ్యే పాశింజరు బండికూడా వచ్చేసింది.

భీమయ్య యివతలకు వస్తూండగా ఒక వ్యక్తి తోసుకుంటూ మాషరుగారి గదిలోకి వెడుతున్నాడు. తెల్లటి టోపీ, మల్లెపూవు లాంటి తెల్లటి వడికిన నూలుబట్టలు కట్టుకున్న ఆ వ్యక్తిని చూడగానే ఎవరికైనా గౌరవభావం కలుగకపోదు. అనుకోకుండానె భీమయ్య ఆయనకో నమస్కారం పెట్టాడు. ఆయనకూడా చిరునవ్వుతో ఆనమస్కారం స్వీకరించి లోనికిపోయాడు.

భీమయ్య సంతృప్తితో బండిలో యెక్కడానికి వెడుతున్నాడు. ఎదురుపడ్డ పోర్టరును "ఆబాబుగోరెవరు" అని వాకబుచేశాడు.

"అరె, అరిసెరగవా! ఈ వూరి కల్లా పెద్ద సాహుకారుగోరు. చాలా మంచోడులే. ఆయన్నెరగనోడు యీజిల్లాలో నేడు సాన గొప్పోడు" అన్నాడు ముందుకుపోతూ ఆగకుండానే.

భీమయ్య పొడుతడుముకుంటూ బండిలో యెక్కాడు. పొద్దున పెట్టిన రూపాయి నోట్లు ఒత్తుగా తగులుతున్నాయి." ఈసారి డాక్టరునే కాసేస్తా," అనుకున్నాడు మనస్సులో.

రైలు కదిలింది. కిటికీలోనుండి స్టేషను వైపు చూస్తున్నాడు భీమయ్య. స్టేషనుమాష్టరుగారూ, భీమయ్య నమస్కరించిన పెద్దమనిషీ మాట్లాడుతూ యివతలకు వచ్చారు. అంతా అతనికి నమస్కారాలు పెడుతున్నారు భక్తితో భీమయ్యకాయన చిరునవ్వుజ్ఞాపక మొచ్చింది.

"చాలా అందంగా నవ్వుతాడు. చాలా సోకుగా, దర్జాగా వుంటాడు. చాలా తియ్యగామాట్లాడతాడు. చాలా మంచోడుట కూడా" అనుకున్నాడు మనస్సులో.

రైలు నడుస్తోంది. ఆముఖం, ఆచిరునవ్వు మళ్ళీ జ్ఞాపకంవచ్చాయి భీమయ్యకు. డబ్బు పదిలంగా వుందోలేదో ఓసారి చూసుకున్నాడు. నడుంకి మెత్తగా, ఒత్తుగా ఒత్తుకుంటోంది. అప్పుడే రెండు స్టేషనులు పోయాయి.

ఆముఖం, ఆచిరునవ్వు మళ్ళీ జ్ఞాపకం వచ్చాయి. భీమయ్యకు యెప్పుడో, యెక్కడో చూచిన జ్ఞాపకం, యెప్పుడో? ఎక్కడో?

తనవూరు వచ్చింది. దిగితిన్నగా కార్ఖానాకుపోయి మేస్త్రీకి కాగితాలు యిచ్చేశాడు. మళ్ళీ ఆమొఖం, ఆచిరునవ్వు జ్ఞాపకంవచ్చాయి. డబ్బు జాగ్రత్తగానే వుంది. "ఎవడు చెప్మా" అనుకున్నాడు భీమయ్య తనలో. "హారినీ నువ్వా" అన్నాడు భీమయ్య ఆశ్చర్య సంభ్రమాలతో. భీమయ్యకు ఆపాకలో డబ్బిచ్చిన ఆసామీ ప్రక్కన నవ్వుతూ కూర్చున్న వ్యక్తి జ్ఞాపకంవచ్చాడు. "అదే ముఖం!" మేస్త్రీకి భీమయ్య అన్న మాటలు బోధపడలేదు.

"ఏంటు" దన్నాడు విసుగ్గా.

"మీ గురించి కాదు. యేంయీ లేదు" అంటూ యింటివేపు నడిచాడు.

"ఆడికీ మనకీ తేడాలేదు. అనవసరంగా నమస్కారం పెట్టానే" అనుకున్నాడు మనస్సులో. భీమయ్య మనస్సు చివుక్కుమంది.



# ★ అత్తగారూ - జపానుయాత్ర ★

(32-వ పేజీ తరువాయి)

బొండూ, కుర్రకుంకలూ నాగోచీపట్టిలాగి గోలచేయడం చూసి నవ్వొచ్చింది... ఏమిటో కల...నిజంగానే రేపు నేను జపానువెళితే నా గోచీచూసి అక్కడి వాళ్ళంతా నవ్వుతారో ఏం గోలో..." అన్నారు మా అత్తగారు.

"ఏం నవ్వరండి...అక్కడి వాళ్లంతా ఒంటినిండా ఒదులొదులుగా తగిలించుకునే లంబాడీబట్టలుచూస్తే మనకు నవ్వొస్తుండ్లా" అన్నాను మా అత్తగారి గోచీని సమర్థిస్తూ.

"అవును. అదేమిటే ఆ జపానుబొమ్మల్లో వుంటే ఆడవాళ్ళంతా నడ్డిమీద పరుపుచుట్టలాంటివేవో తగిలించుకున్నారు!" అన్నారు మా అత్తగారు.

"ఆ పరుపుచుట్ట బహుశా వాళ్లకు మీ గోచీలాంటిదై వుంటుందత్తా..."అన్నాను ఏం చెప్పాలో తెలీక.

"అంతే అంతే. అది వాళ్ళదేశపు గోచీ...అదిసరేగానీ అబ్బాయి విమానం ఎప్పుడు పంపుతాడే! యిట్టాదిగి అట్టాపంపుతానన్నాడే. మరినిన్నంతా రాలేదు విమానం...నా గుండె గతుక్కుమంది-తను సింగపూరువెళ్ళి జాబు వ్రాసిందాకా వాళ్ళమ్మకు నిజం చెప్పొద్దన్నారు మా వారు భయపడుతుందని.

"పంపుతారు రేపో ఎల్లుండో...వర్షాకాలంగదూ మధ్యమధ్య ఆగుతూ వస్తుంది విమానం..." అంటూ మెల్లిగా వెళ్ళిపడుకున్నాను.

"అట్లాగా!సరేలేకానీ తొందరేముందీ.." అంటూ మా అత్తగారుకూడాపడుకున్నారు. తెల్లవారిం తర్వాత మావాడు మొదలెట్టాడు అల్లరి......

"నానమ్మకోసం నాన్న యింకా స్పెషల్ విమానం పంపలేదే"...అంటూ.

"పంపుతాడు లేరా...వర్షాకాలం గదూ! తీర్న వర్షం కురుస్తూంటే మరి ఆకాశంలో విమానం తోలేవాడికి కండ్లు కనిపించొద్దూ! వర్షం వస్తే రోడ్లో వెళ్ళే కార్లే కనిపించవు... యింక మేఘాల్లో వెళ్ళే వాడికి దోవేం కనిపిస్తుంది!...వర్షాలు తగ్గాక పంపుతానులే"...అని మా అత్తగారంటూంటే "అయ్యొయ్యొ నానమ్మ నిజంగానే నమ్మిందమ్మా"...అంటూ విరగబడి నవ్వాడు మావాడు ... వాళ్ళనానమ్మకు చెప్పొద్దని సౌజ్ఞ చేసి చెప్పాను మావాడికి......కాని వాడా మాట అని నవ్వడం చూసి మా అత్తగారు పసికట్టేశారు.

"అదేమిటేవ్...అందరూ కలిసి నన్నాడించడం లేదు గద!...అబ్బాయి నిజంగానే విమానం పంపడా ఏం"...నేను జవాబు చెప్పేలోగానే మళ్ళీ మావాడు పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వుతూ...

"విమానం పంపడం ఏమిటి నానమ్మా... రోజూ వస్తున్నాయిగా విమానాలు!... నాన్న ఎగతాళి కంటే నువ్వు నమ్మావే నానమ్మా" అన్నాడు.

"అట్టాగా!...అయితే అదంతా ఎగతాళి కన్న మాటేనా!.. ఓరి నీ యింట పాన గురవ... నేనింకా నిజమేననుకున్నా తిక్కముండని...అయితే రోజూ రైళ్లు మాదిరిగానే విమానాలు జపాను వెళ్ళి వస్తుంటాయన్నమాట."

"రోజూ వెళ్ళవులే... వారానికోసారో రెండుసార్లో వెళతాయి. అదీ నేరుగా జపాను వెళ్ళడానికి లేదు—యిక్కణ్ణుంచి సింగపూరు వెళ్లాలి. ఆ తర్వాత 'బేంకాక్' వెళ్లాలి, ఆ తర్వాత 'హాంకాంగ్' వెళ్లాలి, ఆ తర్వాతనే 'జపాను' వెళ్ళాలి...ఏమనుకున్నావ్ 'మైడియర్' నానమ్మా!... జపానంటే యిక్కడుందనుకున్నావా" అంటూ మావాడు అమెరికన్ 'స్టయిల్లో' నవ్వాడు...

మావాడు చెప్పిందంతా విన్న మా అత్తగారికి నోటమాట రాలేదు.

"ఎట్టాగూ! అయితే అది మన దేశంలో వున్న వూరు గాదన్నమాట....అవును గానీ యిక్కడి కెంత దూరంరా జపానూ!"

"నియర్లీ త్రీ థౌజండ్ మైల్స్ నానమ్మా."

"యింగ్లీషులో చెప్తే నాకేం తెలుస్తుందిరా!—

"మరి నన్నేం చేయమంటావు నానమ్మా! —నీకు యింగ్లీషు ఎట్లాగో నాకు తెలుగట్లా...త్రీ థౌజండ్ మైల్స్ అంటే మూడువేల మైళ్లు గదమ్మా!" అని నన్నడిగాడు మావాడు...

"ఏమిటీ! మూడువేల మైళ్ళ!...ఓయ్ నాయనోయ్...అయితే యిప్పుడు మీ నాన్న అంతదూరం వెళ్ళాడన్న మాట..." అన్నారు మా అత్తగారు గుడ్లు తేలేసి...

"అవునన్నమ్మా... రేపు నువ్వుకూడా వెళ్తావుగా నాన్న పంపించే 'స్పెషల్' విమానంలో!..." అంటూ మావాడు నవ్వాడు—

"ఆ...యింకా నా తలకాయ నేనేం పడతా వంతదూరం...జపానంటే ఏదో మన దేశంలో వూరే అనుకున్నా...నాకేం తెలుసూ, అది యింగ్లాండులాగా యింకో దేశంఅనీ...యింతకూ ఆ జపాను పోవడానికి టిక్కట్టు ఎంతరా!..."

"కొన్ని వేల రూపాయలవుతుంది..."

"ఓరోయ్ నాయనో! వేలరూపాయలే! ...ఓసి మీ ఎగతాళి దొంగల్లోలా... మొగుడూ పెళ్లాం కలిసి ఎంత నాటకం ఆడారే!...యిప్పుడు నా మనవడు చెప్పకుండావుంటే నా గతేమిటింట!.. జపాను ఢిల్లీ దగ్గిరేనంటిరీ, టిక్కట్టు పదైదు రూపాయలే నంటిరీ..."

"ఓ...బ్యూటీ—బ్యూటీ..." అంటూ మావాడు కుర్చీలోంచి కిందికి దూకి పడీపడీ నవ్వడం మొదలెట్టాడు...

ఉక్రోషం వచ్చిన మా అత్తగారు మనవడి వీపుమీద ముద్దుగా ఒక్కటిచ్చి... "దొంగభడవా! అప్పుడే చెప్పివుండకూడదూ?...ముగ్గురూ కలిసి ముసల్దాని చెవులకు తాటాకులు కడతారా!..." అన్నారు.

"నానమ్మా నేనేం అబద్ధాలు చెప్పలా నాన్నే నిన్ను ఏడిపించాడు..."

"పోనీ మీ అమ్మయినా నిజం చెప్పొచ్చుగా!...అసలు వాడింత దూరాభారం పడతాడని తెలిస్తే వాణ్ణి వెళ్ళనిచ్చేదాన్నే కాదేంట!" అన్నారు మా అత్తగారు విచారపడుతూ ... "ఆ-అందుకనే మీ అబ్బాయి మీతో నిజం చెప్పలేదు. నన్ను చెప్పనివ్వలేదు..." అని నేను అంటూండగానే పోస్ట్ అంటూ బయట్నుంచి కేకేశాడు.

"నాన్న దగ్గిర్నుంచి లెటరొచ్చింటుందమ్మా..."అంటూ పరుగుతీశాడు మా వాడు "అవునమ్మా...నాన్న దగ్గిర్నుంచే.." అంటూ మా వాడు సంతోషంతో ఎగురుకుంటూ వచ్చాడు. "చూశావా నానమ్మా...జపాను వాళ్ళ పోస్టుకవర్లు ఎట్లా వుంటాయో..." అంటూ ఒట్టికవరు వాళ్ళ నానమ్మకిచ్చి లెటరు నాకిచ్చాడు...మా వారు క్షేమంగా జపాను చేరినట్లు వ్రాశారు టోకియోనుంచి ...భయపడుతుందని వాళ్ళమ్మతో అబద్ధం చెప్పినందుకు క్షమించమని కోరారు వాళ్ళమ్మను...జపాన్నుంచి వచ్చేప్పుడు కొడుక్కు బొమ్మలూ, వాళ్ళమ్మకు 'కీ' యిస్తే వెళ్ళే విమానం తీసుకొస్తానని వ్రాశారు ... అది వింటూనే మా వాడు వాళ్ళనానమ్మను గోలచేయడం మొదలెట్టాడు ... "భలే భలే నానమ్మా...నువ్వు జపాన్ వెళ్ళకపోయినా నాన్న నీకు జపాన్నుంచి స్పెషల్ విమానం కొనుక్కొస్తున్నాడు..." అంటూ చప్పట్లు కొట్టాడు...

"వూరుకోరా తిక్కన్నా ... పిల్లవాడి క్షేమం తెలిసింది నాకంతే చాలు...నాకే విమానం అక్కర్లేదు. మీ నాన్న తిరిగి చల్లగా యిల్లు జేరితే నేను విమానం ఎక్కి జపానుయాత్ర వెళ్ళినంతపుణ్యం..."అంటూ కొడుకు క్షేమంగా తిరిగిరావాలని తిరుపతి వెంకన్నకు వెంటనే ఒక ముడుపు గట్టేశారు మా అత్తగారు...



# ★ అన్వేషణ ★

(19 వ పేజీ తరువాయి)

అందంగా, నగిషీగా, బ్రహ్మాండంగా కట్టబడిన సికింద్రాబాదు స్టేషను, ప్లాటుఫారాలు, వంతెనలు, ఎదురుగా చేతులు చాచుకుని ఆప్యాయతతో పలకరించే గడియారం, సెలయేరులా కదులుతున్న జన ప్రవాహాలు, చూసి చైతన్యం పొందినవాడిలా, హృదయంలోని భయం, గుర్పాటు, అయోమయ భావాలు తగ్గించుకుని మామూలు స్థితికి వచ్చాడు శివరాం. జేబులోని టిక్కెట్టు తీసుకుని, ఒక చేత్తో బెడ్డింగు పట్టుకుని, జన ప్రవాహంలో దూరి, వంతెనపూర్తి తానడిచి స్టేషను బయటికి వచ్చాడు. టాక్సీలు, టాంగాలు, బస్సులు ఎదురుగా నిలుచున్నాయి. రైలుస్టేషను ఆవరణ కవతల పోస్టర్లు, కంచెనీల అడ్వర్టయిజ్‌మెంట్లు పెద్ద పెద్ద బోర్డులతో నిలబడ్డాయి. వాటికి పదింతల ఎత్తుగా హోటళ్ళ మేడలు వరుసగా ఎదురుగా కనిపించాయి. హిందీ, తెనుగు, తురకం, ఇంగ్లీషు మాట్లాడే ప్రజల భాషల శబ్దాలు గాలిలో తేలి ఆపట్టణ సాంఘిక వాతావరణం, సంస్కృతి కొంత తెలియజేస్తున్నాయి. మేడలా కనిపిస్తున్న ఒక పెద్దబస్సు ఉపద్రవమైన రోద చేసుకుంటూ తిక్క ఎక్కిన ఆంబోతులా దూసుకువచ్చి ఎదురుగా ఆగింది. శివరాం ఆ బస్సుచూసి కొంత చకితుడై సరదాపడి, ఒక మందస్మితం చేశాడు, తన భవిష్యత్తులోని వాహనం కాబోతుందిగదా అనుకుని. రైలుదిగిన ప్రయాణీకులను ఆప్తులు వచ్చి ఆహ్వానించి కార్లలో టాంగాలలో తోడ్కొని పోతున్నారు. 'నా' అనే వరుడు కనిపించని వాతావరణంలో అడుగుపెట్టిన శివరాం బంధువులకు దూరమైపోయిన ఏకాకితనం జ్ఞప్తికిరాగా, కొంత బాధపడి, తరువాత ఆ బాధ అణచుకొని, గంభీరంగా వదనం మార్చుకుని కలయచూశాడు.

'బాబూ! బెడ్డింగు తీసుకురావాలా?' ఒక కూలివాడు ప్రాధేయపడ్డాడు.

అప్రయత్నంగా ఆ కూలివాని చేతుల్లో ఆ బెడ్డింగు వదిలేశాడు శివరాం నీరసంగా.

తనతో రైలు పెట్టెలో ప్రయాణంచేసి, శారదను జ్ఞప్తికి తెచ్చిన అమ్మాయి ఒక టాంగాలో వెళ్ళిపోతోంది. శివరాం వైపు ఆమె జాలిగా చూసింది. ట్రంకుపెట్టె పోగొట్టుకున్న తన తెలివితక్కువకు ఒక స్త్రీ జాలిచూపి అవమానపరిచిందని బాధపడ్డాడు శివరాం. ఇంక ఆమె వైపు చూడలేదు.

ఏం చెయ్యాలి? ఎక్కడకు వెళ్ళాలి? ఈ ప్రశ్నలు ఎదురుగా నిలుచున్నాయి శివరాం కళ్ళముందు.

'ఎదురుగా ఉన్న హోటల్లోకి' తీవిగా కూలివాడి వైపు చూశాడు శివరాం.

రైలుస్టేషను ఉపరిభాగాన్ని చిన్న విద్యుచ్ఛక్తి బల్బులతో అలంకరిస్తున్నారు, రాత్రి వెల్గులతో నింపడానికి.

శివరాంకు జ్ఞప్తికి వచ్చింది. ఆ రోజు జనవరి ఇరువదిఆరో తేది. రిపబ్లిక్ దినం. తన జీవితంలో కూడ అది ఒక స్వతంత్ర దినం అనుకున్నాడు శివరాం.

ఎండ మిటమిట లాడింది. ప్రయాణం బడలికతో అలసిపోయిన శివరాంకు శరీరాన్ని ఎండవేడి అర్చివేసినట్లు చేసింది.

ముఖ్యావసరాలైన స్నానం, భోజనం కోసం ఎదురుగా ఉన్న హోటల్లో తాత్కాలికంగా ప్రవేశించడానికి వెడుతున్నా శివరాం మనస్సులో మాత్రం, ఏం చెయ్యాలి? ఎక్కడికి వెళ్ళాలి? అనే ప్రశ్నలు రోకలిపోటుల్లా ధ్వనిచేస్తున్నాయి.

కూలివాడు దారిచూపాడు. శివరాం అనుసరించాడు. క్రొత్త నగరంలోని నడివీధిలో ప్రథమంగా అడుగుపెట్టాడు శివరాం. నిండుగా ఊపిరి పీల్చుకున్నాడు తనకు ఏర్పడిన ఏకాంత స్వతంత్ర జీవితం తలుచుకుని.

ప్రయాణీకులను నింపుకుని, నిండుగా తీవిగా, వేగంగా, మలుపులో వయ్యారంగా ఒరుగుతూ, హుందాగా నడివీధిలో ఒక బస్సు దూసుకుని పరుగత్తింది. తన భావి జీవితపు ఆలోచనలు నిమిష మాత్రపుకలగా మళ్ళీ తిరిగాయి శివరాం కళ్ళముందు. ఆలోచన తగ్గించుకుని వడివడిగా నడిచాడు శివరాం ఆ నడివీధిలో.

[ఇంకా వుంది]

# బాల సాహితి

# కంచి మర్యాద

చల్లా రాధాకృష్ణశర్మ

మన దేశంలోని పుణ్యస్థలాలలో కాంచీపురం ఒకటి. అక్కడికి అనేకమంది యాత్రికులు దూర దేశాలనుంచి కూడా వస్తూ పోతూ వుంటారు.

కంచికి దగ్గరగా ఒక పల్లెటూరు ఉన్నది. ఆ ఊళ్లో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనిపేరు రామస్వామి.

రామస్వామి అంతగా చదువుకున్నవాడు కాదు. చిన్నతనంలో బడికి వెళ్లడమైతే వెళ్లాడు కాని. ఆయనకు చదువు సంధ్యలు అంటలేదు. ఎలాగైతేనేం నూరు శ్లోకాలను మాత్రం తనవిగా చేసుకున్నాడు. అవసరం వచ్చినప్పుడల్లా వాటిని ఉదహరించేవాడు. పాండిత్యం లేకపోయినా, ఆయనకున్నంత వ్యవహారజ్ఞానం ఆ ఊళ్లో మరెవ్వరికీ లేదు. అడపా దడపా ఆ ఊరిపెద్దలు ఆయనదగ్గిరికి సలహాలకోసం వస్తూ వుంటారు. రామస్వామి సలహా చెప్పాడంటే, ఎక్కడికి వెళ్లినా సరే దానికి తిరుగు ఉండదు. అంత వ్యవహారజ్ఞానం ఆయనకు!

మరో విశేషం కూడ రామస్వామిలో ఉన్నది. కొమ్ములుతిరిగిన పండితులైనా సరే ఆయన్ని మాటల్లో జయించలేదు. రామస్వామి చాల చమత్కారంగా మాట్లాడుతాడని ప్రసిద్ధి. అందువల్ల ఆయనంటే ఆ ఊరివారికి అంతులేని అభిమానం. ఆయన కనుక ఏ కారణంవల్లనైనా పొరుగూరికి వెడితే చాలు ఆ ఊరివారికి ఆరోజు ఒక యుగంగా గడుస్తుంది.

ఆనాడు ఉదయం రామస్వామికి ఏదో అవసరమైన పని ఒకటి తగిలింది. అందువల్ల ఆయన కంచికి వెళ్లవలసి వచ్చింది. కంచిలో ఆయనకు బంధువు లిద్దరు ముగ్గురున్నారు. కాని వాళ్ల యిళ్లకు పోవడం రామస్వామికి ఇష్టంలేదు. అందువల్ల ఇంట్లోనే భోజనంచేసి వెళ్లడం మంచి దనుకున్నాడు. అప్పటికి ఇంట్లోనేమో యింకా వంట కాలేదు. పని తప్పనిసరి కావడం మూలాన రామస్వామి భోజనం చేయకుండానే బయలు దేరాడు.

రామస్వామి కాంచీపురం చేరుకునేసరికి పదకొండు గంట లయింది. ఇష్టం లేకపోయినా ఆయన బంధు



## శ్రీ కృష్ణమాయ

శ్రీకృష్ణుని వద్దకు కలహాభోజనుడు నారదమహర్షి ఏదో పనిపై బయలుదేరినట్టున్నాడు! ఈ విషయం గోపికాలోలునికి తెలిసిందికాబోలు, నారదమహర్షిని కాస్త ఏడిపించాలని చిటికెలో చిక్కుదారులు కల్పించాడు.

పాపం, నారదమహర్షి లేడిపిల్లలా చిక్కుదారుల్లో చిక్కుబడి విసిగి వేసారి "ఓ శ్రీకృష్ణా! అనాథరక్షకా! నా మొరాలకించుము, నీవు సృష్టించిన ఈ మాయదారి దారుల్లో పడి దిక్కులేక మరచాను. దారి చూపవయ్యా నా స్వామీ," అంటూ ప్రార్థించాడు.

ఆ నారదమహర్షికి మీరైనా దారిచూపి— శ్రీకృష్ణునివద్దకు సాగనంపండి. ఏదీ ప్రయత్నించండి చూద్దాం!

చిత్ర రచన: శ్రీ కృష్ణ—మద్రాసు.

# ప్రాసక్రీడ

[మొదటి రెండు పాదాల్లో ఆఖరి మాటలు "నాళ్లు—మేళ్లు"అని ఉన్నాయి చూడండి. అలా ఒక లేమాదిరిగా ధ్వనించే మాటల్ని ప్రాసలు అంటారు. మిగతా పాదాల్లో కూడా ప్రాస మాటలు పూర్తిచేయండి.]

వృక్షకోటి ఉండినన్ని నాళ్లు
జీవకోటి పొందునెన్నొ మేళ్లు.
వేసవిలో బాటసార్లు వేడ
చెట్లిచ్చును కడు చల్లని...
కొమ్మలందు కలవుపక్షి గూళ్లు
మందులందు పనికివచ్చు...
మల్లె, మొగలి, సన్నజాజి పూలు
పెట్టుకొందు రందముగా...
చెట్లకలపతో కట్టుదురిళ్లు
జనులకెంతో ప్రీతి వాని...
దట్టముగా చెట్లు చేమలున్న
దిట్టముగా వానలుపడు...
అందువలన నిలువలేరు జనము
చెట్లులేని చోటనొక్క...

[జవాబులు 55 వ పేజీలో]

వుల యింటికే సరాసరి వెళ్లాడు. ఎన్నడూ రానిచుట్టం రావడం వల్ల ఆ యింట్లో ఉన్న పిన్నా పెద్దా అందరూ రామస్వామిని నోరార పలుకరించారు. వాళ్ల మాటలు వింటున్నంత సేపు ఒంటిమీద జెర్రులు పాకినట్లుగా తోచింది ఆయనకు. అవతల ముఖ్యమైన పని పెట్టుకొని కాలహరణం చేయడం మంచిది కాదనుకున్నాడు. భోజనం మేళం వదిలిపోతే తాను నిశ్చింతగా వచ్చిన పని చూచుకోవచ్చునని అనుకున్నాడు.

అంతలో ఒక ముసలావిడ వచ్చింది. వచ్చీ రావడంతోనే "ఏరా—రామూ! ఎంతసేపయింది వచ్చి? భోజనం చేసి ఎండలో వచ్చావు గదా! కొంచెంసేపు కన్ను మూసి ఆ తర్వాత మాటలు చెప్ప కూడదా? అన్నది.

ఆమెను మింగివేద్దామన్నంత కోపం వచ్చింది రామస్వామికి. 'కంచి మర్యాద' ఆయనకు తెలియంది కాదు. కంచి మర్యాద అంటే మరేమీ లేదు. అనేకమంది కంచికి వస్తూ వెడుతూ వుంటారుగదా. అలా వెళ్లినవాళ్లు సాధారణంగా బంధువుల యిళ్లకో, మిత్రుల యిళ్లకో వెడుతూ వుంటారు. వచ్చిన వాళ్లందరికి భోజనం పెట్టడం కొంచెం కష్టమే మరి. కనుక ఇంటికి వచ్చినవాళ్లను చూచీ చూడడంతోనే మొదటి ప్రశ్నగా ఆయింటి పెద్దలు "భోజనం చేసే వచ్చారుగా?" అని అడిగే వారు. దీనికే 'కంచి మర్యాద' అని పేరు.

రామస్వామి నవ్వుతూ "కొంచెం సేపు విశ్రమించే యిక్కడికి వద్దామనుకున్నాను. కాని నేను వచ్చిన పని చాలా ముఖ్యమయింది," అన్నాడు.

ఆ ముసలావిడ ఆదుర్దాగా "ఏమిటి నాయనా—అంత ముఖ్యమైన పని?" అని అడిగింది.

అప్పుడు రామస్వామి ఇలా అన్నాడు.

"మరో విషయమైతే నేనిక్కడికి రావలసిన పనేలేదు. మీ మనమరాలికి రత్నంలాంటి ఒక సంబంధం వచ్చింది. నువ్వు నిజమనుకో, అబద్ధమనుకో-దాని అదృష్టంపండింది..."

(47-వ పేజీ చూడండి)




"ఏమిటది? వాపా?"
"ఎబ్బే, కాదు. పచ్చివెలక్కాయ్"

## బాలల సంఘం
# కొందరు సభ్యుల పేర్లు

261 బోయిన శ్రీనివాసరావు (మచిలీపట్నం) 262 చేకుబోయిన రామచంద్రరావు (మచిలీపట్నం) 263 పూసర్ల చిట్టి వెంకటసున్నేశ్వరరావు (బొబ్బిలి - శ్రీకాకుళం జిల్లా) 264 ఆత్రేయపురపు వీరవెంకట సత్యనారాయణమూర్తి (రాజమండ్రి) 265 పూసర్ల సౌభాగ్యవతి (బొబ్బిలి, శ్రీకాకుళం జిల్లా) 266 గొరుపీర సూర్యప్రకాశరావు (పెద్దాపురం-తూ.గో.జిల్లా) 267 విస్సావఝుల విమలాదేవి (యర్రగుంటపల్లి - ప.గో. జిల్లా) 268 కందుల నారాయణ (తల్లంపాడు, ఖమ్మంజిల్లా) 269 పేరి కామేశ్వరశర్మ (సెల్లిపాక, తూ. గో. జిల్లా) 270 కటకం భానుమతి (చెయ్యేరు, తూ.గో. జిల్లా) 271 పావులూరి వెంకట్రామయ్య (శ్రీనగర్, నిజామాబాదుజిల్లా) 272 పాలడుగు ప్రకాశరావు (బలపాల, వరంగల్లుజిల్లా) 273 తాడిమేటి రామలక్ష్మి కృష్ణకుమారి (కొకరపర్రు, ప. గో. జిల్లా) 274 టి. నారాయణస్వామి (శ్రీ బొమ్మరాజుపురం, చిత్తూరుజిల్లా) 275 గుండ్లాపల్లి రాజేశ్వరి (కాళహస్తి, చిత్తూరు జిల్లా) 276 కోటాసిపోరమ్మ (గుండారావు పేట, గుంటూరుజిల్లా) 277 గోగులపాటి వెంకటసుధాకర్ (కర్నూలు) 278 గరిక హరినాథ్ బాబు (నెల్లూరు) 279 కొపవరపు శేషచల్లయ్య (విశాఖపట్నం) 280 వేంద్ర ఉదయశంకర్ (చినరంగనిపాలెం, ప. గో. జిల్లా)

281 చొప్పకట్ల శ్రీరామమూర్తి (నిజామాబాద్) 282 పి. బి. సీతారామ్‌గుప్త (మదరాసు) 283 తణుకు ఆనంద్ కుమార్ (రాజమండ్రి) 284 నవుడూరి వరలక్ష్మి (హైదరాబాద్) 285 సి. హెచ్. సత్యనారాయణప్రసాద్ (గుంటూరు) 285 పిడుపాటి సుందరంరాముడు (కె. సి. వర్కున్, గుంటూరుజిల్లా) 287 పుప్పాల రామస్వామి (సామర్లకోట, తూ.గో. జిల్లా) 288 గోష్టు రామప్రసాదరావు (బనగానపల్లి) 289 పి. రాజగోపాలరావు (పెదపారుపూడి, కృష్ణా జిల్లా) 290 కూచిభొట్ల మార్కండేయ శాస్త్రి (మచిలీపట్నం) 291 మొవ్వ లక్ష్మణరావు (నూజివీడు, కృష్ణాజిల్లా) 292 సొండూరు శ్రీపతినాయుడు (అనంతపురం) 293 చాడ చంద్రశేఖరశాస్త్రి (ఆగిరిపల్లి కృష్ణాజిల్లా) 294 చల్లారజని (నెల్లూరు) 295 ఎమ్. చెన్నకృష్ణయ్య (తిరుపతి, చిత్తూరు జిల్లా) 296 ఎస్. శ్రీనివాసులు (అనంతపురం) 297 పోలేపెద్ది వెంకటలక్ష్మి (విశాఖపట్నం) 298 జె. సంజీవాచారి (తిరుపతి చిత్తూరుజిల్లా) 299 గ్రంధి రాఘవేంద్రరావు (మదరాసు) 300 ఏలేశ్వరపు వెంకటరమణ (హైదరాబాదు)

301 పెమ్మరాజు జయలక్ష్మి (హైద్రాబాదు) 302 కొంగర మధుబాల (కోటాల, చిత్తూరుజిల్లా) 303 టి. ఎల్. సుందరరాజా (మోచంపేట, కడపజిల్లా) 304 కుమారి యేలూరి లలిత (సికింద్రాబాదు) 305 నేతేటి భారతలక్ష్మి (విశాఖపట్నం) 306 మగుపు రామచంద్రరావు (హైదరాబాదు) 307 దామరాజు ఉదయభాస్కరరావు (గుంటూరు) 308 బచ్చు జయశీలన్‌గుప్త (దోన్, కర్నూలుజిల్లా) 309 ప్రత్తిపాటి విమలాదేవి (కర్నూలు) 310 బి. కస్తూరిబాయి (కడప) 311 గుళ్ళపల్లి లలితాకుమారి (గుంతకల్లు అనంతపురంజిల్లా 312 యత్తపు పుల్లారెడ్డి (గోట్లూరు కర్నూలుజిల్లా) 313 జి. శ్యామరావు (బళ్ళారి) 314 కొత్తమాసు రవీంద్రబాబు (దొండపాడు, గుంటూరు జిల్లా) 315 వి. నాగేశ్వరరావు (పాతగుంటూరు) 316 బి. జె. కుమార్ రాజా (తెనాలి) 317 ఎమ్. లీలాశివశంకరరావు (విజయవాడ) 318 గొర్రెపాటి దినకర్ (విజయవాడ) 319 బీరకాయల సూర్యనారాయణరావు (ఏనుగులమహల్ తూ.గో.జిల్లా), 320. పమిడిముర్రి సుశీలాదేవి (విజయవాడ) 321. పుణ్యమూర్తుల రాజగోపాలమిత్ర (కపిలేశ్వరపురం), 322. కొల్లూరి వెంకటరమణ (హైదరాబాదు), 323. చిట్టిఅరసు భారతి (కడప), 324. సి. హెచ్. రాఘవాచారి (కాకినాడ), 325. దాసరి వరలక్ష్మి (మెలువాక, విశాఖజిల్లా), 326. గానుగుల విశ్వేశ్వర సత్యమల్లిఖార్జునరామారావు (తణుకు), 327. కొండ్రెడ్డిగుంట శోభారాణి (టంగుటూరు, గుంటూరుజిల్లా), 328. కాళ్ళకూరి రమాదేవి (భీమవరం, ప. గో. జిల్లా), 329. కొమ్మినేని లక్ష్మీనారాయణ (కంకటపాలెం, గుంటూరుజిల్లా), 330. వింజరపు శ్రీనివాసమూర్తి (మండపేట, తూ. గో. జిల్లా), 331. జి. సరోజమ్మ (ముదిపల్లెగ్రామం, చిత్తూరుజిల్లా); 332. చర్ల కృష్ణమోహనశాస్త్రి (కొకరపర్రు, ప. గో. జిల్లా), 333. శిఖనాల రోహిణీకుమార్ (కర్నూలు), 344. వై. దుర్గాదేవి (కర్నూలు), 335. టి. పుల్లయ్య (మడుపల్లె, ఖమ్మంజిల్లా), 336. పాటిల్ సువర్ణగంగ (ఉరవకొండ, అనంతపురముజిల్లా), 337. దండె నవకుమార్ (కర్నూలు), 338. చర్ల శివనాథ్ (కొకరపర్రు, ప. గో. జిల్లా), 339. తాళ్ళ కాళహస్తీశ్వరరావు (భగేశ్వరం, ప. గో. జిల్లా), 340. తురగా శేషాచలం (కలకత్తా).

341. జమ్మలమడక సత్యవతి (మచిలీపట్నం), 342. బూదర లక్ష్మీసోమలతాదేవి (అయితానగర్, గుంటూరుజిల్లా), 343. నల్లమోతు విజయభాస్కరరావు (కాకుమాను, గుంటూరుజిల్లా), 344. పాతూరి వీరవెంకటసత్యనారాయణరావు (కాకినాడ), 345. శనగవరపు మోహనకృష్ణ (తెనాలి, గుంటూరుజిల్లా), 346. తాడేపల్లి పుల్లారావు (కోరుకొల్లు, ప. గో. జిల్లా), 347. జి. వి. ఎస్. ఎస్. కామేశ్వరరావు (తాపేశ్వరం, తూ. గో. జిల్లా), 348. చల్లా రామలింగమూర్తి (సంతరావూరు, గుంటూరుజిల్లా), 349. శ్రీరాం కమలకుమారి (కంకిపాడు, కృష్ణాజిల్లా), 350. చోడవరపు ఆనందకుమార్ (ఏలూరు) 351. గొరిపర్తి సుభాస్ చంద్రబోస్ బాబు (గుడివాడ, కృష్ణాజిల్లా), 352. వాడ్రేవు పద్మావతీదేవి (రాజోలు, తూ. గో. జిల్లా), 353. కే. శేషుబాబు (గుంటూరు), 354. ఎం. వసుందర్ రావు (మంచిర్యాల ఆదిలాబాద్ జిల్లా), 355. కుమారి సుశీలాపండేశ్వర్ (గుంటూరు), 356. బొంతు వెంకటవరలక్ష్మీదేవి (భట్లపాలెం, తూ. గో. జిల్లా) 357. బోనం వెంకటకృష్ణారావు (పులేటికుర్రు, తూ. గో. జిల్లా), 358. శెట్టిపల్లి సోమశంకర్ (విజయవాడ), 359. ఎమ్. ఎల్. స్వరూపరాణి (పొన్నూరు, గుంటూరు జిల్లా), 360. తాతా రాజ్యలక్ష్మి (మచిలీపట్నం).

361. గుళ్ళపల్లి నాగేశ్వరరావు (గుంటూరు), 362. రామచంద్రుని రుక్మిణీదేవి (టంగుటూరు, గుంటూరుజిల్లా), 363. ప్రత్తిపాటి వెంకటసాంబశివరావు (విజయవాడ), 364. అమాం ఉమామహేశ్వరరావు (ఏలూరు), 365. ఆకొండి మధుసూదన్ (పిఠాపురం, తూ.గో. జిల్లా), 366. కొగంటి జగన్మోహన్ రావు (వామనగుంటపాలెం, గుంటూరుజిల్లా), 367. మాటూరు లక్ష్మీనరసింహారావు (వల్లభాపురం, గుంటూరు జిల్లా), 368. కొత్తపల్లి విజయశ్రీ (వెల్లటూరు, గుంటూరుజిల్లా), 369. చింతగింజల ఆదిలక్ష్మమ్మ (అల్లూరు, నెల్లూరుజిల్లా), 370. ఆళ్ల సాంబిరెడ్డి (గుడిపూడి, గుంటూరు జిల్లా), 371. షేక్ అబ్దుల్ షరీఫ్ (పలివెల, తూ.గో.జిల్లా), 372. నిట్టల దైవకృపావరం (భీమవరం, ప. గో. జిల్లా) 373 పోతుకూచి రాజేశ్వరి (నెల్లూరు) 374 షాహుకారు శ్రీలక్ష్మి బసవపూర్ణమ్మ (రేపల్లె, గుంటూరు జిల్లా) 375 పి. జి. కృష్ణ (ఒంగోలు, గుంటూరుజిల్లా) ★

# ★ న్యూఢిల్లీ లేఖ ★

[6-వ పేజీ తరువాయి]

కర్నల్ ఆర్. డి. అయ్యర్, కర్నల్ ఎమ్. ఎస్. రావు (ఆర్మీ డాక్టర్లు) ధర్మమా అని సఫ్దర్ జంగ్ ఆస్పత్రి బాగు పడుతోంది 'హెచ్' బ్లాకు వెనక భాగమూ, 120 మంచాలున్న ఎక్స్‌రే, రేడియో చికిత్సావిభాగమూ పూర్తి కావస్తున్నాయి 200 మంచాలున్న శిశువిభాగముకూడా అయిపోవస్తోంది 120 మంచాలతో ప్రసూతివిభాగము, 80 మంచాలతో వంశానుగత వ్యాధుల విభాగమూ, 50 మంచాలతో పుట్టకురుపు విభాగమూ, సెంట్రల్ సప్లయిస్ విభాగమూ నిర్మించటానికి ఈ ఏడాది ధనం మంజూరయింది

* * *

భారతీయ రైల్వేలను పరిశీలించటానికి అంతర్జాతీయ బ్యాంకి పునర్నిర్మాణ, అభివృద్ధిశాఖకు సంబంధించిన ఇద్దరు నిపుణులు ఈ మధ్య ఇక్కడికి వచ్చారు వీరిలో ఒకరు ఎ. ఎఫ్. జెరుయిలెట్ ఇంకొకరు ఆర్. ఎ. డి. లోవెన్

భారత రైల్వేలు ఎలా పనిచేస్తున్నాయో వీరు స్వయంగా పరిశీలిస్తారు రెండో ప్రణాళిక ప్రకారం రైల్వేలను ఎంతవరకూ అభివృద్ధిచేశారో చూస్తారు.

రెండువారాలపాటు దేశంలోని ముఖ్యమైన రైల్వేకేంద్రాలలో పర్యటిస్తారు. దాదాపు 4,500 మైళ్ళు ప్రయాణం చేస్తారు

వీరిరాకతో రైల్వేల ప్రచారంకూడా తమాషాగా మారిపోయింది

"ఇప్పుడిప్పుడు దేశం ఆర్థిక పరిస్థితి బాగు పడుతోంది ఆహారోత్పత్తి పెరుగుతోంది ఉక్కు కర్మాగారాలు, ఇతర ప్రాజెక్టులు నిర్మాణంలో ఉన్నాయి రెండో ప్రణాళికలో ఇక మిగిలిన రెండు సంవత్సరాల కాలంలోను రైల్వే రవాణాపరిస్థితికూడాల రుమెగ్గా ఉంటే సూచనలున్నాయి ప్రణాళికలో రైల్వే రవాణా 16 కోట్ల 20 లక్షల టన్నుల వరకుండాలని నిర్దేశించినా, ప్రణాళిక అంతమయ్యేనాటికి ఇది 16 కోట్ల 80 లక్షల టన్నులదాకా పెరుగుతుందని ఆశించవచ్చును

రెండవప్రణాళికలోని చాలా ప్రాజెక్టులకు ధనం ఇప్పటికే మంజూరైపోయి ఉంది. ఇప్పటిస్థితిబట్టి చూస్తే రైల్వేలు ప్రణాళికలో కేటాయించిన రూ 1125 కోట్లధనం అంతా ఉపయోగించుకో గలగటమే కాక ప్లానింగ్ సంఘం నిర్దేశించిన లక్ష్యాలన్నిటిని సాధించగలవని కూడా ఆశించటానికి వీలున్నది"

బావుంది అంటే రైల్వేరవాణాకీ రోడ్డు రవాణాకీ ఇకమీద శత్రుత్వం వినిపించ దన్నమాట ★



మే 24-వ తేదీన, తన 71-వ ఏట కాల ధర్మంచెందిన అమెరికా మాజీ విదేశాంగ మంత్రి, రాజకీయ ధురంధరుడు శ్రీ డలెస్.

ఆ ముసలావిడ రామస్వామిని ఉద్దేశించి "అసంబంధం విషయం" అని ఏదో చెప్పాకు పోతోంది.

ఆమె మాటలు అతనికి వినిపిస్తే గదా! వచ్చిన పనేమో అయిపోయింది... ★



# ★ కంచి మర్యాద ★

(45-వ పేజీ తరువాయి)

ఆ ముసలావిడకు అంతులేని సంతోషం కలిగింది రామస్వామి మాటలు వింటున్నంతసేపు మనమరాలిపెళ్లి మహావైభవంగా జరుగుతున్నట్లే అనుకుంది

ఆమె గొంతు సవరించుకుంది.

"రామూ — పాపం ఎండనుపడి వచ్చావు ఎప్పుడు భోజనం చేశావో ఏమిటో - లే - భోజనానికి" అన్నది తెచ్చుకున్న ప్రేమతో

రామస్వామి బెట్టు చేస్తూ "ఇప్పుడే భోజనం చేసి వచ్చాను" అన్నాడు.

"అలా కాదు. నువ్వు మా యింట్లో భోజనం చేస్తేనే యీ ముసలి ఘటానికి సంతోషం కలుగుతుంది," అన్నది ఆప్యాయంగా

రామస్వామి ఈసారి మరింత బెట్టు చేశాడు ఆ ముసలావిడ అంతకు రెట్టింపుగా రామస్వామి భోజనానికి లెమ్మని ఆయన్ని బలవంతపెట్టింది.

చివరికి కడుపునిండుగా రామస్వామి భోజనం చేశాడు ఆమెవద్ద సెలవు తీసుకొని 'వెళ్లివస్తాను' అంటూ వచ్చినదారి పట్టాడు రామస్వామి.



# సినిమా

## వార్తావరణం

ఆంధ్ర ప్రదేశ్ రాజధాని నగరంలో తయారైన తొలి చిత్రం నవశక్తివారి 'మా యింటి మహాలక్ష్మి' ఈ నెల 29న విడుదల అవుతోంది. పలువురు క్రొత్త నటులను క్రొత్త టెక్నీషియన్లను ఆంధ్ర ప్రేక్షకులకు పరిచయం చేస్తూ ఈ చిత్రం తీసిన యువ నిర్మాత శ్రీ గంగాధరరావు.

గుమ్మడి, జమున, శ్రీ హరనాథ్, శ్రీ రామకృష్ణ, జగ్గయ్య సోదరుడు కృష్ణ, గిరిజ, రమణారెడ్డి మొదలగువారు ఇందులో పాల్గొన్నారు. దర్శకుడు శ్రీ రామినీడు.

ఉత్తర భాగంలో అపూర్వమైన విజయాన్ని సాధించిన చిత్రం ఎ. వి. ఎం. వారి 'భాభీ'ని సారథీవారు తెలుగులో నిర్మిస్తున్నారు. ముఖ్య పాత్రను అంజలీదేవి నిర్వహిస్తోంది.

విశ్వరూపావారి తొలి చిత్రం 'కూతురు కాపురం' ఈ నెల 24న విడుదల అయింది. జగ్గయ్య, జమున, రాజసులోచన, హేమలత, పెరుమాళ్ళు మొదలుగువారు ఇందులో నటించారు. దర్శకుడు శోభనరావు. సంగీతం రమేష్ నాయుడు.

* * *

రచయిత ఆత్రేయ దర్శకనిర్మాత కాబోతున్నారు. కథ నిర్ణయమైనదనీ ఆగస్టులో నిర్మాణం ఆరంభించాలని సంకల్పించుకునీ ఆయన చెప్పారు.

* * *

శంభు ఫిలింస్ వారి 'నమ్మినబంటు' పూర్తి కావస్తోంది. క్రొత్తతరహా కథతో, నాగేశ్వరరావు సావిత్రి రంగారావు, రేలంగి ప్రభృతి అగ్ర నటులతో యార్లగడ్డ వెంకన్న చౌదరిగారు తీస్తున్న ఈ చిత్రానికి ఆదుర్తి (మాంగల్యబలం) సుబ్బారావు దర్శకుడు. ఘంటసాల సంగీత దర్శకుడు.

* * *

పద్మశ్రీ ఫిలింస్ వారి "జగన్నాటకం" 11 రీళ్ళు పూర్తి అయింది. కృష్ణకుమారి, అమర్‌నాథ్, ఆర్. నాగేశ్వరరావు పాల్గొంటున్నారు. దర్శకుడు శోభనరావు. రచయిత శ్రీ రామచంద్.

* * *

అనుపమ ఫిలింస్ అధిపతి తిలక్, "అత్తా ఒకింటి కోడలే" చిత్రాన్ని తమిళంలో పునర్నిర్మిస్తున్నారు. ముఖ్యనటుడు ఎస్. ఎస్. రాజేంద్రన్.

* * *

పద్మశ్రీ పిక్చర్స్ వారి 'శ్రీ వెంకటేశ్వర మాహాత్మ్యం' చిత్రానికి కొన్ని దృశ్యాలు తిరుపతివెళ్ళి తీశారు. ఎక్కువమంది నటులతో పనివున్న మరికొన్ని సన్నివేశాల చిత్రణకై గతవారం వాహినీ స్టుడియోలో భారీఎత్తున వెంకటేశ్వరుడి ఆలయం సెట్ వేశారు. 50 వేల రూపాయల ఖర్చుతో నిర్మించిన ఈ సెట్‌ను చూడటానికి చలనచిత్రకారులు పలువురు తీర్థప్రజగా వెళ్ళి వచ్చారు. రామారావు, సావిత్రి నటిస్తున్న ఈ చిత్రానికి, పూర్వం "బాలాజీ" చిత్రం తీసిన పి. పుల్లయ్యగారే దర్శకులు.

* * *

ప్రసిద్ధ దర్శక నిర్మాత భాస్కర్ (బ్రతుకుతెరువు, రేపునీదే) ప్రొడక్షన్స్ అధిపతి అయిన శ్రీ కోవెలమూడి భాస్కరరావుగారు తమ రెండవ కుమార్తె చి॥ సౌ॥ లలితాదేవిని, చి॥ విష్ణువర్ధనరావు ఎం. కాం. (శ్రీ పాటిబండ్ల మల్లాపల్లి కొల్లిన ప్రసాద



విశ్వరూపావారి 'కూతురు కాపురం'లో రాజసులోచన, జగ్గయ్య

రావుగారి కుమారుడు) కు ఇచ్చి మద్రాసు అభిరామపురంలో మే 28 ఉదయం 1-19 నిముషాలకు వైభవంగా వివాహం జరిపించారు. ముహూర్తానికి, రాత్రి విందుకు పలువురు చలనచిత్ర కళాకారులువచ్చి వధూవరులను ఆశీర్వదించారు.

*　　*　　*

తాతినేని ప్రకాశరావుగారి దర్శకత్వాన ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారు తీసిన సాంఘిక చిత్రం 'ఇల్లరికం' కథను, నిర్మాత అనుమోలు సుబ్బారావుగారు వెండితెర నవలగా ప్రచురించారు. చిత్రంలో సంభాషణలను, పాటలను తగురీతిన పొందుపరుస్తూ, ఎ. పిచ్చేశ్వరరావుగారు ఈ చిత్రంలో కథను పఠనీయమైన నవలగా రూపొందించారు. క్రౌన్ సైజున 130 పుటలుగల ఈ పుస్తకంలో చలనచిత్రంలోని ఛాయా చిత్రాలను సందర్భోచితంగా అమర్చారు. వెల 60 నయా పైసలు. దొరికేచోటు: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2

## వైజయంతిమాల విదేశయాత్ర

ప్రసిద్ధ నర్తకి, నటి వైజయంతిమాల గత వారం యూరప్ పర్యటనకై బయలుదేరి వెళ్ళింది. పారిస్, మాడ్రిడ్, లండన్ నగరాలలో నృత్య ప్రదర్శనాలు ముఖ్య కార్యక్రమం. గతవారం మద్రాసులో తనఇంట్లో జరిపిన విలేఖరుల గోష్ఠిలో మాట్లాడుతూ పర్యటన ఆరువారాలు జరుగుతుందనీ, మరి కొన్ని నగరాలలో కూడా ప్రదర్శనలు ఇవ్వడం జరిగితే జరుగవచ్చుననీ ఆమె చెప్పింది. వైజయంతిమాల వెంట నర్తకులూ, విదితరులూ 18 వెళ్తున్నారు. దర్శక నిర్మాత కె. సుబ్రహ్మణ్యం ముఖ్య నిర్వాహకుడుగా వెళ్తున్నారు. వైజయంతిమాల తండ్రి ఎం. డి. రామన్, అమ్మమ్మ యదుగిరిఅమ్మ కూడా ఈ బృందంలో వెళ్తున్నారు (దిగువ ఫోటోలో వీరిని చూడవచ్చును)

క్వాలిటీ ఆర్ట్స్ ప్రొడక్షన్స్‌వారి 'అగ్రహం'లో మీనా కుమారి, కిషనకుమార్ అనే కొత్త నటుడికి నాయికగా నటిస్తూంది. దర్శక నిర్మాత క్వాలిటీ ఇంతవరకు (9 రోజులు) తీసిన భాగాలలో కొత్త హీరో నటన చూస్తే అతనికి మంచి భవిష్యత్తు ఉన్నట్లు నమ్మకం కలుగుతుందని అన్నారు. ఈ చిత్రానికి ముఖ్ రాం శర్మ కథ వ్రాశారు. సంగీత దర్శకుడు వకీల్ చౌదరి

క్వాజా అహమ్మద్ అబ్బాస్ కొత్త చిత్రం 'చార్ దిల్ చార్ రహే' నిర్మాణ బృందంవారు మొన్న పూనా దగ్గరగా ఉన్న అప్టేగాంవ్ వద్ద కొన్ని ఔట్‌డోర్ దృశ్యాలు షూట్ చేశారు. రాజ్ కపూర్, షమ్మీకపూర్, అజిత్, జైరాజ్, అన్వర్, డేవిడ్, మీనాకుమారి, నిమ్మి, కుంకుం మొదలగు అగ్రశ్రేణి నటులంతా ఇందులో పాల్గొంటున్నారు. సంగీత రచయిత అనిల్ విశ్వాస్. 



ఉత్తమ చిత్రాలకు రాష్ట్రపతి బహుమతులు ఇచ్చి సత్కరించిన సందర్భంగా ఢిల్లీ వెళ్ళిన ప్రముఖ నటుడు నాగేశ్వరరావు దర్శకుడు కె. వి. రెడ్డి, తాజ్, ఫతేపూర్ చూశారు





...శ్వహావారి 'కూతురు కాపురం'లో జమున, జగ్గయ్య



# విదేశ వార్తలు

కాన్స్ అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో ఈ ఏడాది ప్రథమ బహుమతి "ఆర్ఫ్యూ నీగ్రో" అనే ఫ్రెంచి చిత్రానికి లభించింది ఈ బహుమతి వస్తుందని అందరూ అనుకున్న ఇంకో మంచి చిత్రం "రూమ్ ఎట్ ది టాప్" (బ్రిటన్) ఇంగులో నటించిన ఫ్రెంచితార సిమోన్ సినారేకు మంచితార బహుమతినిచ్చి గౌరవించారు చాలా కాలానికి తొలిసారిగా ఉత్తమ నటుడి గౌరవాన్ని ముగ్గురు పంచుకున్నారు ఆ బహుమతిని ట్వెంటియత్ సెంచరీ ఫాక్సువారి 'కంపల్షన్' చిత్రంలో నటించిన ఆర్సన్ వెల్స్, డీన్ స్టాక్‌వెల్, బ్రాడ్‌ఫర్డ్ డిల్మన్‌లకు ఇచ్చారు

## ఓ ఘా యి త్యా లు

ఇటీవలగా యూరప్ దేశాలలో జరిగే చలన చిత్రోత్సవాలలో 'సెక్సుయి మెంట్' అనేది ఫాషన్ అయిపోయింది నలుగురూ కలిసి నాలుగు దేశాల చిత్రాలూ చూడడం, కళగురించి చర్చించడం చాలా దిబ్బలు జిడ్డు అనే భావం నామూలైపోయింది అందువల్ల ఉత్సవానికి హుషారుచెయ్యడానికి ఫ్రెంచి, ఇటాలియన్, అమెరికన్ తారలు నడుం బిగించారు లేదా నడుం చుట్టూరా బిగింపులు సడలించారు కాన్స్ ఉత్సవంలో మూడేళ్ళుగా ఇది మరీ ఎక్కువ అయిపోయింది ఉత్సవానికి వచ్చే తారలు సాధ్యమైనంత నగ్నంగా పల్లీకున ఏ బీచిలోనో కూర్చుని, పడుకుని ఉండడం ఓ ఫోటోగ్రాఫరుదళం వాళ్ళని చుట్టుముట్టి ఫోటోలు తియ్యడం ముఖ్య కార్యక్రమం చాలామంది సినిమాలు మానేస ఇవే చూడ్డానికి పోతున్నట్లు విదేశీ పత్రికలు లోగడ వెల్లడించాయి

## కా న్స్ లో

మొన్న కాన్స్ ఉత్సవంలో ఉత్సాహంగా నగ్నసత్యాలు ప్రకటించిన తారలు అలా ఉండగా, కొందరు ఇష్టంలేకపోయినా అందుకు ఒడిగట్టవలసి వచ్చిందట ఒక ఫ్రెంచితార బీచిదగ్గర గాలి పీలుస్తోందట అక్కడికి కొందరు ఫోటోగ్రాఫర్లు వెళ్ళారు. యూరపియన్ గ్లామరు తారలు ధరించే దుస్తులకు ఒక కనీస పరిమితి వుంది ఈ కనీస పరిమితి ఇంతకు దాటరాదని ఒక గరిష్ఠ ప్రమాణంకూడా ఉంది ఈ కనిష్ఠ గరిష్ఠ ప్రమాణాల సరిహద్దుమీద ఆమె ధరించిన దుస్తులు ఉన్నాయట అయినా, భావప్రకటనలాగే ఏ ప్రకటనకూ పరిమితి ఉండతగదని ఫోటోగ్రాఫర్లు ఆమెను చుట్టుముట్టి ఉన్న కాసిని దుస్తులుకూడా లాగిపారేసి ఫోటోలు తీశారట (స్థానికు డెవరో ఉత్సాహాతిశయంకొద్దీ ఈ పని చేశాడని మరొక వార్త) తరవాత నిర్వాహకులు ఇందుకు సంతాపం ప్రకటించారు

మొత్తానికి కిది ప్రభుత్వస్థాయిలో పాలకప్రతిపక్షాలమధ్య తర్జుమా అవడందాకా వెళ్ళింది

విచారించవలసినవిషయం తేగాయిదాలో కొగు, తార ధోరణి

## బె ర్లి న్ ఉ త్స వం

1958 సంవత్సరంలో రాష్ట్రపతి సువర్ణపతకాన్ని పొందిన బెంగాలీ కథాచిత్రం "సాగర్ సంగమే"ని "రాధాకృష్ణ డాక్యుమెంటరీ"చిత్రాన్ని భారతప్రభుత్వం బెర్లిన్ అంతర్జాతీయ చలనచిత్రోత్సవానికి పంపింది ఏలా జరిగే యీ వుత్సవం యీ సంవత్సరం జూన్ 26 నుండి జూలై 7 వరకు జరుగుతుంది

ఈ రెండు చిత్రాలతోపాటు ఇంకో భారతీయ డాక్యుమెంటరీ చిత్రాన్నికూడా యీ వుత్సవానికి పంపుతారు నిరుడు పంపినట్లే యీ సంవత్సరంకూడా భారతప్రభుత్వం యీ వుత్సవానికి ఒక ప్రతినిధివర్గాన్ని పంపవచ్చు

భారతీవారి 'బభ్రువాహన' చిత్రంలో రాజసులోచన

# రేచుక్క - పగటిచుక్క

సగం స్వప్నం సగం సత్యం అయిన జానపద కథాప్రపంచంలో, తండ్రీ కొడుకు లిద్దరు యుద్ధానికి సిద్ధపడే అసాధారణ సన్నివేశాన్ని నిర్మించి చూపే వృత్తాంతం 'రేచుక్క—పగటిచుక్క' (స్వస్తిశ్రీ ప్రొడక్షన్స్) చిత్రం సగం కదనం సగం కథనంగా, ఆద్యంతం బ్రహ్మాండమైన సెట్లమీద డాన్సు చేస్తూ సాగిపోతుంది.

పగటిచుక్క విజయరాయలు, 'దొంగ' వేషం వేసుకోవాలిక్కి ముందు దొర సి. ఎస్. ఆర్. ఒక్కడే ఒప్పించి నప్పించగలతరహా వైరిబాగుల చక్రవర్తి వీరరాఘవులు దగ్గిర సామంతుడు చక్రవర్తి సోదరుడు విక్రముడు (సిసిలిలన్ ఆర్. నాగేశ్వరరావు) ఖిల్లగూడెంలో కన్నెపిల్ల (ఎస్. వరలక్ష్మి)లను చెరచి దొంగచాటుగా తప్పించుకు పోవడం తన కొడుకు ముగ్గురు బిడ్డల తండ్రి సైజాకి పెరిగినా తను బిగ్గుకి సినిమాసాలక్కి రంగేసు కోవడంవంటి కుర్రకారు చేష్టల దగ్గర నుంచి, రాజ్యాధిపత్యం కోసం వేసిన తన ఇరవై రీళ్ళ ప్రణాళికను ఒకటో రీలు నించీ అడ్డు తగులుతున్న విజయరాయలును అక్రమంగా బంధించి అతని దేవిని, కులదీపకుడనీ జేబిడీలో ఉండగా తగల పెట్టించబోవడంవంటి పెద్ద పెద్ద ఓఘాయిత్యాలదాకా చేస్తాడు. విజయరాయలు చెరనుండి తప్పించుకుపోయి భిల్లులలో కలిసి అడవిలో పెద్ద సైన్యం కట్టుకుని అక్రముడి విక్రమానికి సవాలుగా రేచుక్క పేరిట నిలుస్తాడు. విక్రముడు, యువరాణిని ఖర్చు రాయించబోయే సరికి రేచుక్క ఆ పిల్లని ఎత్తుకపోయి తన దగ్గిర పెంచుతూ ఉంటాడు. విక్రముడు తన కొడుక్కి పట్టాభిషేకం చేయించబోయే సరికి అతన్ని ఎత్తుకపోయి ఖైదులో కాపాడుతూ ఉంటాడు. దానికితోడు విజయరాయలు కొడుకు, చిన్ననాటి ప్రమాదంవల్ల అడవుల పడి తిరిగి, ఈ రాజ్యపు సేనానికే దొరికి అతని కొడుకుగా పెరుగుతూ ఉంటాడు. యువరాజమాత 'కన్నాంబ', దాది వేషంలో అతన్ని సాకుతూ ఉంటుంది. సినీకర్మము కపటం జయించునన్న నమ్మకతో తన ప్రయత్నాలన్నిటికీ (రే) చుక్కెదురు కావడంతో విక్రముడు సేనాపతిని బెదిరించి, రేచుక్కని పట్టితెమ్మంటాడు. సేనాని కుమారుడు విజయకుమార్, రేలంగి వెంట రాగా సరదాగా ఆడుతూ పాడుతూ ఫొటోజెనిక్ అడవులలో కొంత దూరంపోయి ఒక చిన్నదాన్ని (స్వయానా రాజుగారి కన్నదాన్ని) చూసి ప్రేమకథలో జారిపడతాడు. కొంగలకార్యం కథకులే తీరుస్తారన్న ధీమాతో శ్రుతిమధురమైన యుగళగీతాలుకూడా పాడుతారు. ఆ పిల్లే వెదకబోయిన తీగ కాబట్టి అతనిచుట్టూ అల్లుకుంటుంది. ఆమె ద్వారా విజయకుమార్ అద్భుతమైన రేచుక్క శిబిరం సెట్లమీదకు వెళ్తాడు. తరవాత మెల్లిగా తనకి కావలసిన బందీ విక్రముడి కొడుకుని విడిపిస్తాడు. రాకుమారిని అతన్ని రాజ్యానికి పంపివేస్తాడు. ఇలా రేచుక్కకికూడా చుక్కెదురుచేసిన తాను పగటిచుక్కననీ ఫలానాచోట ఖైదీ దొరుకుతుందనీ కబురు పెడతాడు. చుక్కలిద్దరికీ, చివరకి యుద్ధం జరుగుతుంది. పగటిచుక్క తన కన్న కుమారుడే అని రేచుక్క గ్రహించి కొడుక్కి చేజిక్కిపోతాడు. ఆపై పగటిచుక్క విజయకుమార్ అసహాయశూరుడై అధర్మాన్ని జయించడం దర్శకుడు కె. కామేశ్వరరావు యీ చిత్రంపతాక సన్నివేశాలలో చిత్రించారు.

చిక్కటి కథ అయినా రెండుతరాల వృత్తాంతాలను సమన్వయించడం, సముద్రాల జూనియర్ వ్రాసిన జాను, టూర్జాను తెలుగులలాగే జరగతగినంత కట్టుగట్టుంగా జరిగినట్లు కనిపించదు. అనేక సన్నివేశాలు విడిగా చాలా బాగున్నాయి. వాటిలో సంభాషణలూ కథోచితమైనరీతిన చక్కగా నడిచాయి. ప్రత్యేకంగా కె. తియుభాలు, తెలుగునాటి మల్లయుద్ధ ప్రవీణుల విన్యాసప్రదర్శనలూ, టూరీలుగా నృత్యాలూ, పాటలూ మొదలయినవాటితో చిత్రం విసుగు లేకుండా కాలక్షేపంగా ఉంది. తండ్రిని బంధించి చెరలో వేసిన పుత్రుడుగా రామారావు, దొరగానూ దొంగగానూ డాబుగా నిండైన దొరతనాన్ని చూపిన పగటిచుక్కగా రంగారావు, కన్నాంబ, పతాక సన్నివేశాలలో మంచినటన ప్రదర్శించారు. యుద్ధాలు అన్నీ ఉత్సాహభరితంగా ఉన్నాయి. ముఖ్యంగా రామారావు, ఆర్. నాగేశ్వరరావుల ద్వంద్వయుద్ధం చాలా బాగుంది. భిల్లులదొరగా మహంకాళి వెంకయ్య, విక్రముడుగా ఆర్. నాగేశ్వరరావు, అతని కుమారుడుగా రాజనాల, యువరాణిగా జానకి యథోచితంగా నటించారు. హాస్యనటులు పలువురూ ఇందులో సమృద్ధిగా వినోదం సమకూర్చారు. పెకేటి గుప్తుడి పాత్ర ధరించినా డా॥ ఆహ్లాదకరంగా నటించాడు. బాలకృష్ణ పద్మనాభం చిత్రం ఆరంభంలో చేసిన శ్లాప్‌స్టిక్ మనోహరంగా ఉంది. ఈ చిత్రం మొత్తంమీద కొట్టొచ్చినట్టు కనిపించేవి తోట వెంకటేశ్వరరావు వేసిన సెట్లు. వాటిని నేత్రపర్వంగా చూపినది రెహమాన్ ఛాయాగ్రహణం. పాటలకు రూపకల్పనకూడా కొత్తదనంతో ఒప్పింది. కొండా డోనా అనే యుగళగీతం, 'మనవి సేయవే' అనే పాట చాలా బాగున్నాయి. వాటికి మరి రెండు పాటలకూ టి. వి. రాజు కూర్చిన వరసలుకూడా హాయిగా ఉన్నాయి. ఒకటి రెండు పాటలు మటుకు పాత బాణీలను జ్ఞాపకం చేశాయి. నేపథ్య సంగీతం సెట్లాగే భారీ ఎత్తున ఉంది.





'రేచుక్క పగటిచుక్క'లో గిరిజ



'రేచుక్క— పగటిచుక్క' చిత్రంలో జానకి

# చిత్రసమీక్ష

## 'లవ్ మారేజ్'

ఏడెనిమిదివేల అడుగులు పొడుగుపాటు తప్పటడుగులు వేస్తూనూ చిరాకేసేటంత బడకంగా చతికలబడి ఆవులిస్తూనూ అక్కడా ఇక్కడా తారట్లాడుతూనూ కాలం గడిపి, ఆ తరవాత ఆరువేల అడుగులూ ఒక్కపెట్టున, ధాటీగా అంగలు వేసుకుంటూ గమ్యస్థానానికి చేరుకుని చెప్ప దలచుకొన్న సంగతి గట్టిగా చెప్పగల్గడం చలనచిత్రాలలో సాధ్యమా అన్న ప్రశ్న వేసుకుంటే కాదని జవాబిస్తుంది సుబోధ్ ముఖర్జీ చిత్రం 'లవ్ మారేజ్' (అలాటి ప్రశ్న ఎందుకు వేసుకోవాలీ అన్నది వేరే ప్రశ్న. మనం అవునన్నా కాదన్నా, స్థూలంగా నేటి చలనచిత్రాలలో కథన శిల్పం ఆ తరహాలోనే ఉంది.

ప్రేక్షకులకు పుష్కలంగా వినోదం సాధారాచయనం ముఖ్యం అని నమ్మి ఆ పని చేసేవారిలో 'దర్శకనిర్మాత' సుబోధ్ ముఖర్జీ ముఖ్యుడు మునీంజీలో అత నంతపనీ చేసి చూపించాడు 'పేయింగ్ గెస్ట్'లో కూడా అదేపద్ధతి అనుసరించాడు మళ్లీ ఇప్పుడు 'లవ్ మారెజ్'లో ఈ శిల్పాన్ని ప్రశంసనీయంగా అవలంబించి మంచిఫలితాలు సాధించాడు

మొదటి ఎనిమిదిరీళ్లలోనూ చిత్రం కేవలం పేటెంటు అయిన 'ప్రేమాయణంగా'— డ్యూయెట్‌లూ వగైరాలూ సహా—కని పిస్తుంది కథ ఆడుతూ పాడుతూ ఒకచోటే తారట్లాడుతుంది తరవాత హఠాత్తుగా లేచి, జరిగిన కథలో సంఘటనలన్ని ఆసరాకూడ దీసుకుని ధాటీగా నడిచిపోతుంది కలిసీ కలియనట్టున్న సన్నివేశాలన్నీ చివర అందంగా కలసి కథాంశాన్ని సూచిస్తాయి

ఈ పద్ధతి మంచిది కాదనటం లేదు సరదాగా కబుర్లు చెబుతూ, పాటలు పాడుతూ ఉంటే చూసి ఆనందించవచ్చును కాని, అస్తమానం ఇదేపనిగా సాగిస్తూ ఉండడం వల్ల చెప్పకోదగ్గ ప్రయోజనం ఏమీ కనబడదు జీవితంలో ఆలోచించదగ్గ విషయాల మీద చర్చించడం అసలు వాటికేసి చూడడం కూడా జరగటంలేదు ఈ చిత్రంలో క్రికెట్ కూడా ఉంది దేవానంద్ క్రికెట్ హీరో చూట్టానికికూడా అలాగే ఉంటాడు పోతే దీనినిబట్టి 'ఎల్ బి డబ్ల్యు' అనే మాట మకుటంగా తలా తోకాలేని పాట ఒకటిఉంది మిగతావి కూడా ఈ ధోణిలోనే ఉన్నాయి లోపాలు కూడా చాలా ఉన్నాయి అయినా లవ్ మారేజి 'బాక్సాఫీసు చిత్రం' ప్రేమఘట్టాలూ, వాటిలో దేవానంద్, మాలాసిన్హాల మాటలూ, పాటలూ, ఉత్సాహకరమైన చిత్రణ ఈ చిత్రాన్ని జనరంజకంగా రూపొందించాయి నాయికానాయకులిద్దరూ అద్భుతంగా వున్నారు మిగతావారిలో అభి భట్టాచార్య, ప్రోనోతి చేసిన అభినయం, దీనికి తగ్గస్థాయిలో లేదు సరికదా అపశ్రుతిగా కూడా ఉంది

శ్రుతిమధురంగాఉన్నది శంకర్ జైకిషన్‌ల సంగీతం వాళ్ల సంగీతంలో ఇది ఉత్కృష్టతమం కాకపోయినా—పాటలన్నీ వేటికవి వినడానికి హాయిగా ఉన్నాయి.

## నయా సన్సార్

శ్రీ కృష్ణ ఫిలింస్ వారి "నయా సన్సార్" చాలా మంచిచిత్రం. ఇది రాణించడానికి ముఖ్యకారణం పండిట్ ముఖ్ రాంశర్మకథ. ముఖ్ రాంశర్మ, సినిమాకు ప్రయోజనాత్మకమైన కథలురాయడంలో సమర్థుడని ఋజువు చేసుకున్నాడు మధ్యతరగతి కుటుంబాలలో పాత్రలను, మనకి రోజూ కనబడే మనుష్యులను ఆయన తనకథలో తెచ్చి నిలబెడతారు అందుకే అవి మనకి అభిమాన పాత్రాలు అవుతాయి. నయా సన్సార్



సుధాకర్ పిక్చర్స్‌వారి తొలిచిత్రం 'వచ్చినకోడలు నచ్చిందిలో'
రాజసులోచన, జమున.

## రేలంగి

రెడ్డిగారూ కూడా—" అంటాడు రేలంగి

*    *    *

శ్రీ పుల్లయ్యగారు రేలంగి పైకి రావడానికి మొదటినుండీ తోడ్పడ్డవారిలో ముఖ్యులు. దాదాపు 15 ఏళ్ళపాటూ, ఆయనకి ఎక్కడ పనిఉంటే ఆయనకి అక్కడ పని ఉండేది. ఇద్దరూ ఎక్కడవుంటే అక్కడ పనీవుండేది. 'శ్రీ పి', రేలంగినిచూసి "దుమ్ము దులిపి", సోమబట్ల గుణసుందరిలో రేలంగిని వెలిగించారు. కాని, నాటకరంగస్థలంమీద తిరుగుతున్న రేలంగి సినిమాలో మొదట ప్రవేశపెట్టినవారు దూసి శాస్త్రిఅన్న ఆయన రేలంగి మొట్టమొదటిచిత్రం 'తులాభారం' అది కలకత్తాలో తయారయింది. దూసిశాస్త్రిగారు, చురుకయిన కుర్రవాడు కావాలని, రేలంగిని తీసుకువెళ్ళి అక్కడ వేయించారు. జీతం 70 రూపాయలు వేషంవెయ్యడం ప్రొడక్షన్ పనులు చూడడం వగైరా బాధ్యతలు చాలా ఉండేవి. (సశేషం)

## బహు బహుమతి గ్రహీత

తెలుగునాటి ఔత్సాహిక నాటక రంగస్థలంలో అగ్రగణ్యుడనిపించుకొని, అనేక నాటకోత్సవాలలో ప్రథమబహుమతులందుకొన్న యువనటుడు కె. వెంకటేశ్వరరావు ఇటీవల ఢిల్లీలో ఢిల్లీ నాట్యసంఘ ఆధ్వర్యాన జరిగిన అఖిల భారత నాటకోత్సవాలలో ప్రథమ బహుమతిని అందుకొన్నాడు. దాదాపు అన్ని రాష్ట్రాలవారు పాల్గొన్న ఈ పోటీలో తెలుగువారి తరఫున వెంకటేశ్వరరావు 'అశోక రామన్న' (రచయిత బెల్లంకొండ రామదాసు) నాటకం ప్రదర్శించి అందులో ముఖ్యపాత్రను నిర్వహించి ఉత్తమనటుడుగా ఎన్నిక అయాడు.

మే నెల తొలివారంలో విజయవాడ శ్రీ నవ్యకళామండలివారు సభ జరిపి శ్రీ వెంకటేశ్వరరావును అభినందించారు.





కె. వెంకటేశ్వరరావు.

## సంగీత వార్తలు

శాస్త్రీయ సంగీత విద్వాంసులు సినిమాలో గానసభలు చేయడం అరుదు ఉన్నా ఇంతకుముందు దక్షిణాదిన ఇలాటివి లోగడ సందర్భాలు వచ్చాయి. కె బి సుందరాంబాళ్, ఎం. ఎస్. సుబ్బులక్ష్మి, ఎ ఎం దండపాణి దేశికర్, జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యం వంటివారు సినిమాలో పాడడమే కాక గాయకుల పాత్రలుకూడా నిర్వహించారు. ఉత్తరాదిన 'బైజుబావ్రా' వంటి చిత్రాలలో పలూస్కర్, అమీర్ ఖాన్ ప్రభృతులు పాడారు బొంబాయి సంగీత దర్శకులలో వసంతదేశాయ్‌కి ఈ ప్రసిద్ధ గాయకులను పిలిచి పాడించుకోవడం అలవాటయిపోయింది.

ఇటీవల ఆయన "గూంజ్ ఉఠీ శహనాయ్, అనే చిత్రంలో, ప్రఖ్యాత శహనాయి విద్వాంసుడు ఖాన్‌సాహెబ్ బిస్మిల్లాఖాన్ పాటలను రికార్డు చేశారు. దీనికై ఆయన ప్రత్యేకంగా కొన్ని పాటలు చాలా శ్రమపడి రచించి బిస్మిల్లాఖాన్‌ను మెప్పించి ఒప్పించారు. పాటలకేగాక, శహనాయిని శాస్త్రవిధాల—గాత్రానికి దగ్గరగా నూ, సితారు తోకలిపికూడా వాడి గొప్పఫలితాలు సాధించారట. త్వరలోనే బడేగులామ్ ఖాన్‌ కూడా ఒకచిత్రంలో పాడించడానికి వసంతదేశాయి ఏర్పాట్లు చేశారట.

శంకర్ జైకిషన్‌లు మూడు వారాలు సినిమా సంగీత రచనా కార్యక్రమం ఆపి, విదేశాలు పర్యటించబోయారు. సింగపూర్, హాంకాంగ్, టోక్యో ఇప్పటికి వెళ్ళదలచిన నగరాలు. తరవాత వీలుపడితే, న్యూయార్కు వెళ్తారట.

"విదేశీ మేగినా అక్కడి సంగీతపు సంప్రదాయాలను తీరు తెన్నులను తెలుసుకోవడమే మా లక్ష్యం అని వేరే చెప్పనక్కరలేదు" అనివారన్నారని వేరే చెప్పక్కరలేదు.

# ఆరుద్ర గళ్లనుడికట్టు-3

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | 2 | ■ | 3 | 4 | | | ■ |
| 5 | ■ | 6 | 7 | ■ | | ■ | ■ | 8 |
| | ■ | 9 | | | | 10 | ■ | |
| 11 | 12 | | ■ | ■ | 13 | | 14 | |
| ■ | | ■ | 15 | | | ■ | | ■ |
| 16 | | 17 | | ■ | ■ | 18 | | 19 |
| | ■ | 20 | | | 21 | | ■ | |
| | ■ | ■ | | ■ | 22 | | | |
| ■ | 23 | | | | ■ | 24 | | ■ |

## ఆధారాలు

### అడ్డం

1. సంధ్యావందనంలో శతమానం భవతి!
3. నరికి చంపబోమని హామీ ఇచ్చే యమలోకం.
6. గని తిరగబడి. (ఆమ్రేడితమైతే తళతళ).
9. ఏ వారమునాడైనా ఎత్తేబిచ్చం.
11. "బిలబిలాక్షులు తినిపోయె... పెసలు" (శ్రీనాథుడు)
13. తనకేగాని మరి యాదవులకు లేదని శిశుపాలుడు చెప్పడంలో గల సభ్యతా ఇది?
15. ఈ సంవత్సరం అంతా రణగుణ ధ్వనులందే ఉండొచ్చు.
16. గాలము మధ్యన ఉండి తారుమారైతే ఒక జమీందారీ గ్రామం.
18. మనదేశం ఇంకెవరిదీ కాదని మొదటే తెలుసుకోవాలి.
20. ముముక్షువునకుండే జ్ఞాననేత్రంలా యమకంలో ధ్వనిస్తుంది.
22. సాధన పూర్తికావచ్చేముందు డబ్బుదొరకడం ప్రారంభం.
23. (ఇష్టంలేని) విడాకులు కొద్దిగా తారుమారవుతాయి.
24. ముడివేసిన ప్రేమా? చివరకు మిగిలేదంతే.

### నిలువు

2. ఈ జాతికి చెప్పుదెబ్బలు తప్పవు.
4. ...గోవిందో హరిః
5. పొట్టి సంపాదకుడి గతి: వార్త!
7. మూగయతుల పుణ్యక్షేత్రం.
8. దేవర దయదలిచినా ఈ వెల్లువ తప్పదు.
10. పాలు ఒలికిపోగా మురిపాలు.
12. ఈ స్త్రీ మొదట రెండులకారాల విలువచేస్తుంది.
14. 9 అడ్డంలో ఎత్తేముష్టి.
15. తాంబూలము మధ్యన్యయం మొదలైతే దవడ పలికే మాటలొస్తాయి.
16. ఆముదములోని జిడ్డుకాదు. హర్షించతగ్గదే.
17. ఉగాదిపండుగలో నిండేది.
18. మనము లోపల మూగినోముల్లో మధ్య 'వు'అంటే తప్పలేదు. పూర్తవుతుంది.
19. విడిదే రాజప్రాసాదం చేసుకుంటే కోటవాకిలి కనబడుతుంది.
21. బాధ తుణ్ణంగా ఉంటే ఆకలి తిరుగుబాటు చేస్తుంది.

---

### 2-వ నుడికట్టుకు జవాబులు.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 శాం | న | 2 క | ము | ■ | 3 ప | 4 త | క | 5 ము |
| త | ■ | టి | ■ | ■ | ■ | గ | ■ | దు |
| క | ■ | 6 క | 7 వి | ■ | 8 కొ | రం | ■ | స |
| 9 ము | 10 ది | ■ | 11 వ | ది | న | ■ | 12 జో | లి |
| ■ | మ | ■ | ర | ■ | న | ■ | రీ | ■ |
| 13 కా | సు | ■ | 14 ము | ఖ్య | ము | ■ | 15 గ | 16 ని |
| ని | ■ | 17 కే | లు | ■ | 18 లు | 19 వ | ■ | లు |
| వా | ■ | ర | ■ | ■ | ■ | రు | ■ | వ |
| 20 డు | వు | ము | లు | ■ | 21 హం | స | పాం | దు |

---

### ప్రాసక్రీడ
### జవాబులు

సీడ; వేళ్ళు; స్త్రీలు; పళ్ళు; నన్న; దినము.



# పుస్తక సమీక్ష

## సుబ్బన్న

కన్నడమూలం: శ్రీ మాస్తి వెంకటేశయ్యంగార్, అనువాదం: విద్వాన్ విశ్వం. పుటలు: 94. వెల: రూపాయి. ప్రతులకు: విద్యాసాగర్ కార్పొరేషన్, ప్రైవేటు లిమిటెడ్, మద్రాసు—1.

సంగీతమే సర్వస్వంగా భావించి, చాలీచాలని సంపాదనతో సతమతమవుతున్న కుటుంబం వదలి మైసూరు సీమ కదలి, వంగదేశానికి వెళ్లి, వెయ్యార్లు సంపాదించి, తుదకు పిల్లలను, భార్యను పోగొట్టుకొని, మాతృదేశానికి మరలివచ్చి, కళారాధనతోనే సకలవేదనలూ మరచి, నిర్వికారస్థితినందున్న సుబ్బణ్ణ అనే వాయులీన విద్వాంసుని అపురూపమైన గాథ ఇది. "మూడవ కృష్ణరాజ ఒడెయరు నాటి మైసూరు తీరుతీయాలను" దీనిలో శ్రీ మాస్తి మహోజ్జ్వలంగా చిత్రించారు.

శ్రీ మాస్తి వెంకటేశయ్యంగార్ "కన్నడ కథాపితామహులు." ఆయన రచనలు తెనుగులోకి రావడం సంతోషించదగింది. ఆ రచనలలోని నిగ్గు తెనుగులో రావడానికి ఆ నుడికారం తెలిసినవారు యత్నించి ఉంటే బాగుండేది. ఈ అనువాదకులకు సామాన్య కన్నడ వ్యవహారంకూడా తెలీదని, ఏ ఆంగ్లానువాదమో ఆధారంగా, గురికి బారెడుదూరంగా తెలుగు చేశారని ప్రతి పుటా రుజువు చేస్తుంది.

మచ్చుకు కొన్ని:

మైసూరు ఆస్థానం అనేక విద్వాంసులకూ—పుట: 1. మూలంలో ఉన్నది "ఎందిగింతలూ విశేషవాగి" అని.

నాలుగు తరాలనుంచీ వారికుటుంబం మైసూరులోనే ఉంటూవచ్చింది—పుట: 1. "అవర మనెయవరు" మూలం. మనెయవరు అంటే వంశం.

తన మెడ కిందొకతాడు—పుట: 12. మూలం "కుత్తిగెగె సుత్తిదారె." మెడకు చుట్టుకుంది అంటేనే మాస్తిమాటల అందం.

తల్లిమీద అన్యథాభావం ఏర్పడింది—పుట 25. "అంతూ కాయిబళ్ళి యిందబేరయాగు వుదక్కె ప్రారంభవాయితు." మూలం. ఎంత మంచిభావం! "మొత్తానికి కాయి తీగనుంచి వేరయిపోవడానికి ఆరంభమైంది" అని అనువదిస్తే మూలకర్త ఎంత సంతోషించేవాడు!

కోడలు దేవతార్చన విగ్రహాలు కడగడం రెండునిముషాలు ఆలస్యమైతే చాలు—పుట: 26. "స్వామిదేవర ఉపకరణతొళెయువుదు ఎరడునిమిష సావకాశవాదరె" అని మూలం. దేవతార్చన సామగ్రి కడుగుతారు ఇతరులు. విగ్రహాలను పూజచేసేవారే అభిషేకం చేస్తారు. కనుక విగ్రహాలు కడుగరు.

ఇంటికి యజమానురాలై పోయానని కులుకుతున్నావా?—పుట: 30. "మనెయ యజమానిగింత హెచ్చాగి కుణియుత్తీయల్లా?"—మూలం. ఇంటి యజమానురాలి కంటె హెచ్చుగా గునిసిపోతున్నావే—అని ఉండాలి.

చచ్చినా బ్రదికినా భగవంతుని మరవను. కొట్టినా తిట్టినా మగనిని విడువను—అని తల్లి చెప్పింది.—పుట: 34. "సావలి బదుకలి దేవరన్ను బిట్టుఇల్ల. హొడెలీ, బడిలీ గండన్ను బిట్టుఇల్ల." అని మూలం. చచ్చినా, బతికినా దేవుణ్ని వదలితే (వేరేగతి) లేదు. కొట్టినా, తిన్నా మొగుణ్ని వదలితే (వేరేగతి) లేదు—అని వుండాలి.

ప్రాణం గాడితప్పి ఆగిపోయింది. కళ్లింది వట్టికట్టె చూడండి—పుట: 91. ఇది సుబ్బణ్ణ తన శిష్యురాలిని మరొకవూరికి సాగనంపినప్పటి ఆవేదనను తనే చెప్పిన సందర్భం. "ప్రాణం గాడిహత్తిర నింతు బట్టితు." అంటాడు. అంటే ప్రాణం బండి దగ్గరే ఉండిపోయిందన్నమాట. గాడి అంటే బండి. (గంత్రీ అనే సంస్కృత పదం గంత్రీ, గడ్డీ, గాడి అయి కన్నడంలో దూరింది) గాడి తప్పడం కాదు.

అనువాదాలు ఎలాఉన్నా దక్షిణభాషా పుస్తక సంస్థవారు చేస్తున్నకృషి హర్షించదగినది.

## దిబ్బరాజ్యం

[కథాసంపుటి]

కొడవటిగంటి కుటుంబరావు. జయా పబ్లికేషన్స్. విజయవాడ. వెల: 1-50.

ఈ కథాసంపుటిలో చేర్చిన ఏడుకథల లోను వాయుభక్షకుడు చాలాచిత్రమైన వ్యక్తి. వాడు అసలెప్పుడూ అన్నంతినడు! ఒక ఇంటిలో పనికి కుదురుకుని చాకిరీచేస్తుంటాడు. పేరు రంగడు. క్రమక్రమంగా ఆ వార్త ఊరంతా పొక్కుతుంది. ఈ అన్నం తినని పుర్రాణ్ణి పట్టుకుని ఒక యోగిగా తయారుచేసి డబ్బు గుంజుకోవాలని కొందరు ధూర్తులు ప్రయత్నిస్తారు. టెంటుసినీమాలాడికచే వెంకయ్యరంగడి ఫోటో పేపర్లో వేయిస్తాడు. నానాటికీ రంగడి బతుకొక యముచెరలా తయారవుతుంది!

మళ్ళీ ఇదేకథ సత్యాన్వేషణ అని వేరే శీర్షికతో నడిపిస్తారు కుటుంబరావుగారు. ఈ రంగడు అన్నంతింటాడా? తినడా? అన్న సమస్య చివరిదాకా అలాగేఉండిపోతుంది.

ఈ కథ చదువుతూంటే—'హఠాత్తుగా ప్రపంచంలో జనానికందరికీ ఆకలెయ్యడం మానేస్తే ఏమవుతుంది?' అని. ఒక విచిత్రమైన ఊహతట్టుతుంది! ప్రస్తుత సమాజవ్యవస్థ అటువంటి పరిస్థితులో పేకమేడలా కూలిపోతుందని అనిపిస్తుంది! 'ఇంతకీ అసలే అన్నం తినడం అలవాటులేని ఈ రంగడికి ఒకరింటిలోచేరి ఊరికే ఉల్ఫాగా నౌకరీ చెయ్యవలసిన అవస్థ ఎందుకు పట్టింది?' అని ఈ కథ చదివినవాళ్ళందరికీ అనుమానం వేస్తుంది. దీనికి కథలో ఎక్కడ సమాధానం చెప్పినట్టు కనబడదు ఒక ఆసామీ అన్నం తింటున్నాడా? తినడంలేదా అన్న గొడవ పట్టించుకోకుండానే ఈ మాయలోకం నాడి మెళ్లో దండలువేసి యోగిగా తయారుచేస్తుందని కథకుల అభిప్రాయం గాబోలు!

కొంతకాలంనించి సామాన్యకుటుంబాల్లో బాగా చదువుకున్న ఆడపిల్లల పెళ్ళి ఒక పెద్దసమస్యలా తయారయింది. 'తీరని సమస్య'లో ఈ సమస్య ఒక చక్కని కథగా నడిపించారు కుటుంబరావుగారు.

'సహనం'లో సుశీలఅనే అమ్మాయిని సినిమాతారగా తయారుచెయ్యాలని కామాజి ఒక పెద్దమనిషి తాపత్రయ పడతాడు. క్రమక్రమంగా కామాజి సుశీలమీద కన్ను వేస్తాడు. కాని సుశీల చిట్టచివరికి ఒక సినీమాడైరెక్టరుతో జోడీ కలుపుతుంది. రచనాశిల్పాన్ని బట్టిచూస్తే ఇదికూడా మంచికథే.

మొత్తంమీద ఈ సంపుటిలో కథలన్నీ 'వాడి వాడి'గా నడిచిపోతాయి. వీటిలో 'తడి' చాలా తక్కువ. కథలలోని వ్యక్తులందరు కుటుంబరావుగారి ఆజ్ఞప్రకారం, ఆశయాల ప్రకారం గబగబా ముందుకు సాగిపోతూన్నట్టు కనిపిస్తారు.

ఉదాహరణకి 'తీరని సమస్య'లో ద్రౌపది కథ తీసుకుందాము. ఈ పెళ్లి కానిపిల్ల మనస్సులో చెలరేగే ఆందోళనగాని, ఆవేశంగాని మనకీ కథలో వ్యంగ్యంగా స్ఫురించదు. చిట్టచివరి ఎట్టకేలకు కథకుడే ఆ సంగతి కాస్తా మన చెవిలో వేసినట్టుంటుంది!

'దిబ్బరాజ్యం' 'ఆదర్శప్రభువు' ఒకే తరహాకి చెందినకథలు. పెట్టుబడిదారీ వ్యవస్థ బండారం బయటపెట్టడమే ఈ కథల పరమార్థం. దీనిలో కుటుంబరావుగారు అవలంబించిన 'అవహేళన' బాగా పాకానపడింది. నిజానికి కథలలో అంతటా కనిపించే ధోరణే ఇది.



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 Editor S. Sambhu Prasad.




"ఈతపళ్లండోయ్, ఈతపళ్లండి"

చిత్రకారుడు: వెల్లటూరి పూర్ణానందశర్మ.




# పియర్స్

సొగసైన
వనితా
సాంప్రదాయము!




పియర్స్ సబ్బు—సౌందర్యమును గలిగించే శుద్ధమైన,
గ్లిసరీన్‌తో గూడిన సబ్బు—మీ చర్మమునకు ఎంతో సౌమ్యమైనది.
మీ సౌందర్యమును కాపాడునట్టిది. మీ సౌందర్యముకోసం
పరిమళమైన పియర్స్ సబ్బును వాడుట అలవాటు చేసుకోండి!
పియర్స్ పసిబిడ్డల లేత చర్మమునకు దివ్యమైనది!

పియర్స్ టాల్కమ్.. ఎంతో పట్టువంటి—మెత్తనిది, ఎంతో
మనోహరంగా పరిమళ మొనర్చబడినట్టిది...రోజంతా మిమ్ములను
హాయిగాను, సొగసుగాను, వుంచును. ఆకర్షణీయమైన లేత పసుపు,
ఆకుపచ్చ—బంగారు రంగులతోనున్న డబ్బీలో గల
పియర్స్ టాల్కమ్ ను అడగండి!






హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారిచే భారతదేశంలో తయారు చేయబడినది.